

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర' "చతుర సమీక్ష" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. '**చతుర సమీక్ష**' కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.

4. కవర్‌పై "**చతుర సమీక్ష**" కు అని పేర్కొనాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మూడింటికి రు.100, రు.75, రు.50 చొప్పున, మరో మూడింటికి రు.25 చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచేలక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనేవంతు పాఠకులదే.

---

**కూపన్**

**మార్చి 'చతుర' నవల: జైలు**

**సమీక్షకుని పేరు** ..............................................

**చిరునామా** ..............................................

..............................................

..............................................

# చతుర ప్రపంచం



## భాష

మన మనోభావాలను ఎదుటివారికి తెలియజేసే ముఖ్యసాధనం 'భాష.'

ప్రస్తుతం ప్రపంచం మొత్తంలో 2756 ప్రధానమైన భాషలు ఉన్నాయి.

భారతదేశంలో దాదాపు 1652 భాషలు మాట్లాడుతారు. జీసస్‌క్రైస్ట్ 'అరమిక్' భాషలో మాట్లాడేవాడు. ఇంగ్లీషులో అత్యధికంగా వాడే పదాలు ఏవంటే 'టాక్సీ' 'హలో' 'ఓ.కె.' 'స్టాప్'.

మనదేశంలో మధ్యప్రదేశ్‌ప్రాంతంలో నివసించే కొంతమంది ప్రజలు 'నహలి' అనే భాషను మాట్లాడుతారు. ఈ భాష ఆర్యులకు గానీ, ద్రావిడులకుగానీ చెందదు. ఈ భాష పుట్టుక గురించి భాషాశాస్త్రవేత్తలకుకూడా ఇంకా ఏమీ తెలీదు.

అండమాన్ దీవుల్లో వెయ్యిమందికిపైగా ప్రజలు మాట్లాడే ఒక భాషకు ఆఫ్రికా భాష మాతృక.

అమెరికా దేశంలోని కంప్యూటర్‌లలో ఒకభాషలో మనం విషయాన్ని 'ఫీడ్'చేస్తే కంప్యూటర్ వెంటనే దాన్ని ఇతర భాషలలోనికి తర్జుమా చేస్తుంది. ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యన్, స్పానిష్, చైనీస్, అరబిక్ భాషలను అక్కడి కంప్యూటర్లు తర్జుమా చేయగలవు.

అసలు 'హైజాకింగ్' అనే పదం ఎలా వచ్చిందంటే ఇంగ్లండ్‌లో పూర్వం రహదారి దొంగలు బాటసారులను ఆపేసి 'హాండ్స్‌అప్ హైజాక్' అని అరిచేవాళ్ళు. తరువాత పైలట్‌ను లొంగదీసుకొని విమానాన్ని దారి మళ్ళించడాన్ని 'హైజాకింగ్' అని పిలవడం మొదలు పెట్టారు.

డాక్టర్లు మందుల జాబితా రాసేటప్పుడు ఒక మూలగా 'Rx' అని రాస్తారు. Rx అనేవి ఒక ఈజిప్షియన్ దేవతకు చిహ్నామట.

## డ్రాక్యులా

సినిమాల్లో, నవలల్లో ఎంతో భయంకరంగా ఉత్సుకతను రేకెత్తించే విధంగా ఉండే 'డ్రాక్యులా' ఇంగ్లీషు సినిమాలు చూసేవారికి చిరపరిచితుడే. అయితే చరిత్ర ప్రసిద్ధుడైన అసలు డ్రాక్యులా గురించి చాలా మందికి తెలీదు.

సరిగాతెలీదు గానీ 1431-76 మధ్యకాలంలో ఎప్పుడో రుమేనియా దేశంలో పుట్టాడు ఆ డ్రాక్యులా. 'వలీషియా' అనే రాష్ట్రానికి అతను రాజుగా ఉండేవాడు. అసలు పేరు 'బ్లాడ్' అయినా తన తండ్రి పేరు 'డ్రాక్యులా' అంటే ఇష్టం కావడంతో ఆ పేరుతోనే పిలిపించుకొనేవాడు. 'డ్రాక్యులా' అంటే 'దెయ్యం కొడుకు' అని అర్థం. డ్రాక్యులా అన్నీ చేయరాని పనులే చేసి పైశాచికానందాన్ని పొందేవాడు. ఒకసారి డ్రాక్యులాకు, పొరుగు దేశమైన టర్కీ తన సంస్థానంపై దాడి చేయబోతోందని తెలిసింది. దానితో ఆ శత్రు సైన్యాన్ని బెదరగొట్టడానికి తన రాజ్యంలోని వేలాదిమంది ప్రజలను చంపించి, వారి శవాలను సరిహద్దు ప్రాంతంలో వరుసగా పేర్పించాడు.

ఇంకోసారి కొంతమంది బిచ్చగాళ్ళు అడుక్కోవడం ఇతని కంటబడింది. వెంటనే ఈయనగారికి బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది. బిచ్చగాళ్ళందరికీ తన భవనంలో ఓ మంచి విందు ఇస్తున్నారని ప్రకటించాడు.



చతుర ... 5



దాంతో తిండిలేక మాడుతున్న బిచ్చగాళ్లందరూ తండోపతండాలుగా రాజుగారి దివాణానికి వెళ్లారు. వాళ్లందర్నీ ఓ భవనంలో చేర్చి, తలుపులన్నింటినీ మూసేసి అన్ని వైపుల నుంచి నిప్పుపెట్టేశాడీ మహానుభావుడు. లోపల చిక్కుకొన్నవారి ఆర్తనాదాలూ, పెడబొబ్బలు విని ఆనందంపట్టలేక నవ్వుతూ నృత్యం చేశాడట.

ఒకసారి టర్కీ దేశంనుండీ ఇద్దరు రాయబారులు డ్రాక్యులా దగ్గరికి వచ్చారు. తన గౌరవార్థం వారిద్దరూ తమ తలమీద ఉన్న హాట్స్ తీయాలని పట్టుబట్టాడు ఈయన. అలా 'హాట్స్' తీయడం తమ సంప్రదాయం కాదనీ, ఆ విషయంలో తమను బలవంతపెట్టవద్దని వారు చెప్పగానే ఈ పిశాచపుత్రుడికి తిక్కరేగింది. ''అయితే మీ టోపీలు మీ తలమీదే శాశ్వతంగా ఉండే ఏర్పాటు చేస్తాను'' అని ఒక నౌకరును పిలిచి వాళ్ల టోపీల మీద తలలోకి దిగేలా మేకులు కొట్టించి వినోదించాడట.

తన ఆరేళ్ల రాజ్య పాలనలో లక్షమందికి పైగా ప్రజలను చంపి పైశాచికానందాన్ని పొందిన ఈ డ్రాక్యులా చివరికి తన నలభై అయిదో ఏట టర్కీ సైనికుల చేతిలో మరణించాడు. వారు అతని తలను బల్లేనికి గుచ్చి తమ రాజ్యానికి తీసుకెళ్లారు. మొండేన్ని రుమేనియాకు పదిహేను మైళ్ల దూరంలోవున్న 'స్నగోవ్' అనే ప్రదేశంలోని ఒక స్మశానంలో పాతిపెట్టారు. 1931 లో ప్రభుత్వం ఆ శ్మశానంలో ఉన్న సమాధులనన్నింటిని తవ్విస్తే అక్కడ 'డ్రాక్యులా' చంపినవారి అస్తిపంజరాలు అనేకం బయటపడ్డాయి, కానీ డ్రాక్యులా సమాధి మాత్రం ఖాళీగావుంది. అయితే దానికి కొద్దిదూరంలో మరో శ్మశానంలో ఉన్న ఒక సమాధినుండి తలకు చుట్టుకునే ఒక ఎర్రటి బట్ట, డ్రాక్యులా ధరించే ఆభరణాల వంటి ఆభరణాలు కొన్ని బయటపడ్డాయి. వీటిని 'బుఖారెస్ట్' లోని ఒక పురావస్తు ప్రదర్శనశాలలో ఉంచితే అవి హఠాత్తుగా మాయమయ్యాయి.

డ్రాక్యులా ఎంత భయంకరమైనవాడంటే ఇప్పటికీ, ప్రపంచం నలుమూలల నుండీ

పర్యాటకులు వేల సంఖ్యలో వలీషియా కు వచ్చి డ్రాక్యులా కోటను చూసి వెళుతూవుంటారు. రుమేనియా 'టూరిజం డిపార్ట్‌మెంట్'వారు మాత్రం ప్రజలకున్న ఈ 'డ్రాక్యులా' పిచ్చిని బాగా డబ్బు చేసుకుంటున్నారు. 'డ్రాక్యులా' నవలలో వర్ణించిన మాదిరిగానే 'గోల్డెన్ క్రౌన్' అనే ఒక హోటల్ నిర్మించి నవలలో వర్ణించినటువంటి పదార్థాలే వండివడ్డిస్తూ వుంటారు. 'డ్రాక్యులా' అంటే ఒక వైపు దడపుడుతున్నా అతనంటే ఆసక్తి అందరికీ ఉంటుందనేది మాత్రం నిజం.

## సహజ వైద్యం

అందానికి, ఆరోగ్యానికి వివిధ దేశాల్లో రకరకాల బ్యూటీపార్లర్లు, హెల్త్‌క్లినిక్కులు, మసాజ్ రూమ్స్ నడుపుతున్నారు. అయితే లండన్‌కు 64 కిలోమీటర్ల దూరంలో ఉన్న 'హెల్త్‌ఫామ్'కు ఓ ప్రత్యేకత ఉంది. ఇక్కడ శరీరసౌష్టవాన్ని ఆరోగ్యాన్ని మెరుగుపరచేందుకు మందులు, టానిక్కులు, వ్యాయామం లాంటివేమీ వుండవు. కేవలం కూరగాయలు, వళ్లద్వారానే అన్నిరకాల వైద్యాలు, అవసరాన్నిబట్టి బరువు తగ్గించడం, హెచ్చించడం చేస్తారు. అనేక మంది ధనవంతులు, మోడల్‌గర్ల్స్, క్రీడాకారులు డాక్టర్ గ్రాహమ్ నిర్వహిస్తున్న ఈ 'హెల్త్‌ఫామ్'లో ట్రీట్‌మెంట్ కోసం క్యూల్లో నిలబడుతున్నారట.

బంగాళాదుంపలు, కారెట్, బీట్‌రూట్, కాబేజి, అరటి, యాపిల్, ద్రాక్ష-ఒకటేమిటి అన్నిరకాల కూరగాయలను, వళ్లను వీరు తమ ఫామ్‌లోనే పండిస్తారు.

ఈ పళ్లను, కూరగాయలను తోటనుండి మొదట 'ట్రీట్‌మెంట్ రూమ్'కు పంపుతారు. అక్కడ వీటిని శుభ్రపరచి కావలసిన పరిమాణంలో, ఆకృతిలో కోసివుంచుతారు. తరువాత ఈ ముక్కలను పేషెంట్ల శరీరమంతటా పొందిగ్గా అమర్చి ఆ కూరగాయల, పళ్ల ముక్కల మీదుగా శరీరానికి తగిలేలా, యంత్రాల ద్వారా నీటి ఆవిరిని పంపుతారు. అలా కూరగాయల మీదుగా ఆవిరిని చర్మం మీదకు పంపినపుడు ఆ కూరగాయల్లోని పోష



కపదార్థాలను, చర్మం గ్రహిస్తుందని డాక్టర్ గ్రాహమ్ సిద్ధాంతం.

బంగాళాదుంపలు, కారట్, దోసకాయల్లో సహజమైన నూనెలు ఉంటాయి. వీటిని శరీరం మీద అమర్చి ఆవిరిపంపితే అవి అమర్చిన శరీరభాగానికి ఒక విధమైన కాంతి, నునుపుదనం వస్తాయిట. శరీరంలోని నూనె పదార్థాలు ఎక్కువైవే వాటిని తగ్గించుకోవాలనుకొనేవారికి నిమ్మ, దోసకాయ, స్ట్రాబెర్రి ముక్కలను అమరుస్తారు. అలా చేస్తే శరీరంలోని నూనె పదార్థాలు తగ్గిపోవడమే కాకుండా మొటిమలు కూడా మాయమవుతాయిట. ఎప్పుడూ నీరసంగా, అలసటగా వుండే వారికి ఆలివ్‌నూనె, తేనె, పళ్లరసం కలిపి శరీరమంతటా బాగా రుద్దుతారు. దాంతో వారు చురుగ్గా, ఉత్సాహంగా తయారవుతారట. బీట్‌రూట్ ముక్కలను రోజూ బుగ్గల మీదా, పెదాలమీదా రుద్దుకుంటూ ఉంటే వాటికి శాశ్వతంగా ఎర్రటి కాంతి వస్తుందిట. వయసుతో ముఖం మీద వచ్చే ముడుతలను తగ్గించడానికి తేనెను ముఖానికి రాసిఉంచి కొంతసేపటి తరువాత నీటితో కడిగేసుకోవాలి. వివిధరకాలైన పళ్లను, మూలికలను కలిపి ఉడకబెట్టిన నీటితో రోగులకు స్నానం చేయించి ఆస్తమా, గుండెజబ్బు వంటి వ్యాధులు కూడా నయంచేస్తారట. ''ఈ పద్ధతులేవీ ఈనాడు మేం కొత్తగా కనుక్కొన్నవి కావు.... 'క్లియోపాత్రా' కాలం నుండీ ఉన్నవే'' అంటారు డాక్టర్ గ్రాహమ్. అయితే క్లియోపాత్రాలాగా గాడిదపాలతో ఆయన తన పేషెంట్లకు స్నానం చేయించాలని ప్రయత్నిస్తే మాత్రం చాలామందికి గాడిద పాలుపడలేదట పాపం!

# బాలవైజ్ఞానికుడు

ఈ రోజుల్లో పిల్లలు ఓ గమ్యంలేకుండా అష్టమైన తిరుగుళ్లతో తల్లిదండ్రులకో సమస్యగా తయారవుతున్నారు. సక్రమంగా చదువుకుని పెద్దవాళ్లకు భారమనిపించని పిల్లలు చాలా అరుదు. ఇటువంటిరోజుల్లో పదునాలుగేళ్ల ప్రశాంత్‌పూరి స్వయంగా ఎన్నో ఉపయోగకరమైన వస్తువులు తయారు చేయగలగడం ఓ గొప్ప విశేషం.

చండీఘర్‌లోని ఓ మధ్యతరగతి కుటుంబానికి చెందిన ప్రశాంత్‌పూరి ఎంతో బుద్ధిమంతుడేగాక తెలివైన కుర్రాడుకూడా. చిన్నవయసులోనే తక్కువఖర్చుతో అనేక ఉపయోగకరమైన వస్తువులు తయారుచేయగలిగాడు. ఇతడు తయారుచేసిన 'వైర్‌లెస్ సెట్'తో 70 కిలోమీటర్లదూరంలో ఉన్నవారితో మాట్లాడవచ్చు. బజారులో నాలుగువందల రూపాయలు ఖరీదుచేసే టి.వి. యాంటిన్నా సెట్టును రెండు వందల రూపాయలకే తయారుచేయగలిగాడు. అలాగే టి.విలు, ఫాన్‌లు తక్కువ ఖర్చులో చేయడంలో ఇతను మంచి నేర్పరి.

వైర్‌లెస్‌సెట్ తయారుచేయడం చట్టవిరుద్ధమని ప్రశాంత్‌పూరికి తెలుసు. అందుకనే చట్టబద్ధమైన 'దూరం'వరకు మాత్రమే పనిచేసే వైర్‌లెస్‌సెట్‌ను తయారుచేశాడు. అయితే ఎవరయినా ప్రభుత్వఅనుమతి తీసుకొని వైర్‌లెస్‌సెట్ తయారుచేసి ఇవ్వమని అడిగితే ఏమాత్రం లాభంలేకుండానే తయారుచేసి ఇవ్వడానికి ఇతడు సిద్ధంగా ఉన్నాడు.

ప్రశాంత్‌పూరి చిన్నతనం నుండి కూడా 'ఎలక్ట్రానిక్స్' అంటే చాలా ఆసక్తి కనబరిచేవాడు. ఏవస్తువు గురించయినా స్థూలంగా ఓ అంచనా వచ్చిందంటే, తీవ్రంగా ఆలోచించి తన సొంతపద్ధతిలో దానికొక రూపం ఇచ్చేవరకు తనకు నిద్రపట్టదంటాడు ప్రశాంత్.

ప్రశాంత్‌పూరి గురించి వార్తాపత్రికల్లో చదివి అనేకమంది వ్యాపారస్తులు, తమకు అతడు తయారుచేసిన వస్తువుల 'నమూనా'లు అమ్మమని అడిగారు. అయితే బాగా చదువుకొని తండ్రిలా డాక్టరు కావాలనుకొంటున్న ప్రశాంత్ తను కనిపెట్టిన వస్తువులతో అప్పుడే వ్యాపారం చేయడానికి ఇష్టపడటంలేదు. ప్రశాంత్ తల్లిదండ్రులు మధ్యతరగతికి చెందిన వారవడంతో అతని ప్రయోగాల నిమిత్తం డబ్బు ఎక్కువ ఖర్చు చేయలేకపోయినప్పటికీ ప్రశాంత్ నిరుత్సాహపడకుండా తక్కువ ఖర్చుతోనే కొత్త వస్తువులు కనిపెట్టే ప్రయత్నం చేస్తుంటాడు.

ప్రశాంత్‌పూరి వంటి పిల్లలు తలిదండ్రులకేకాక దేశానికే గర్వకారణం.








# పురుగుల ఫలహారం

**ఇంట్లో** బొద్దింకో, చీమో, పురుగో కనబడగానే సాధారణంగా అందరూ చేసేపని- వెంటనే దాన్ని చంపటం లేదా దూరంగా పడేయడం. కానీ అందరూ చీదరించుకొనే క్రిమికీటకాల్లో ఎంతటి విలువైన పోషకపదార్థాలు వున్నాయో తెలుసుకొంటే ఆశ్చర్యపోతారు. ప్రకృతిలో ఈ క్రిమికీటకాదుల సంఖ్య మొత్తం మనుషులు, జంతువులు, పక్షుల సంఖ్యనుమించి వుంది. ఇళ్లల్లో వుండే మామూలు 'ఈగ' గుడ్లలో 60 శాతము మాంసకృత్తులు వుంటాయి. ఇందులో మానవశరీరానికి అవసరమైన పదహారు 'అమినోయాసిడ్స్' వున్నాయి. అంతేకాకుండా 15 శాతం కొవ్వు పదార్థాలు, ఖనిజ లవణాలు కూడా వున్నాయి. అలాగే చెదలు, మిడతల్లో కూడా అనేక పోషకపదార్థాలు వున్నాయి. ఎండ బెట్టిన చెదల్లో ఎనభైశాతం మాంసకృత్తులు, కొవ్వు పదార్థాలు, విటమినులు వుంటాయి. తేనెటీగ గుడ్లలో ఎ,డి విటమినులు పుష్కలంగా వున్నాయి.

క్రిమికీటకాలు ఇంతటి విలువైన పోషకాహారమైనా, ప్రస్తుతం వాటిని ఆహారపదార్థాల్లో ఒక భాగంగా వాడకపోవడానికి కారణం— మనం వాటిని చూడగానే అసహ్యించుకోవడమే. ఈ పురుగులు, ఈగలు సాధారణంగా పెంటకుప్పలమీద, మురుగు కాలువల్లో వుండటంవల్ల వాటిని మనం అసహ్యించుకుంటాం. అంతేకాకుండా క్రిమికీటకాలను తినేవి జంతువులు, పక్షులేగానీ మనుషులు కారనే ఓ నమ్మకం కూడా మనకు వుంది.

చేపలకు, కోళ్లకు పురుగులను ఆహారంగా వేస్తుంటారు. వాటిని పంటలకు మంచి ఎరువుగా కూడా వాడవచ్చు. ప్రాచీనకాలంలో రోము, గ్రీకు దేశాలకు చెందినవారు మిడతలను ఎండబెట్టి, పొడిచేసి దానిని కేకులు, బ్రెడ్లు తయారుచేయడంలో ఉపయోగించేవారు. అమెరికాలో రెడ్ ఇండియన్లు మిడతలను వేయించుకొని తినేవారు. మనదేశంలో కూడా కొంతమంది గిరిజనులు చీమలను తింటారు. ఆఫ్రికా దేశాల్లో చెదలను వేయించి మార్కెట్లో అమ్ముతారు. చెదలనుండి వంటనూనె తయారుచేయవచ్చునని పరిశోధనల్లో తేలింది కూడా. వేయించిన పురుగులను రోమనులు ఎంతో ఇష్టంగా తినేవారు. మనరాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలవారు వర్షాకాలంలో దీపంచుట్టూ చేరే 'ఉసిళ్లు' అనే పురుగులను తింటారు. చైనాలో నీటిలో నివసించే నల్లి జాతికి చెందిన పురుగులను తింటారు. వారు కప్పలను ఎంతో ఇష్టంగా తింటారనే విషయం అందరికీ తెలిసిందే.

ఈ క్రిమికీటకాలను అసలు ఖర్చేమీలేకుండా ఎంతో సులభంగా పెంచవచ్చుననే విషయం చెప్పనక్కరలేదు. ★



# 'నిజం' నవలపై చతుర సమీక్షలు

జనవరి 'చతుర' నవల 'నిజం'పై పాఠకులనుంచి మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందిన వారికి మా అభినందనలు!

## భయంకర 'నిజం'

**ప్రథమ బహుమతి**
**రు. 100/- పొందిన సమీక్ష**

జనవరి చతుర నవల "నిజం" సమకాలీన పత్రికా రచనారంగాన్ని, దాని అవలక్షణాలను అతిశక్తివంతంగా చిత్రించి పాఠకుల కందించింది. అన్నిరంగాల సంగమమైన ఈ సమాజమే ఒక అవలక్షణాల కుప్పగా చెడిపో తున్నప్పుడు పత్రికారంగం దానికతీతంగా వుండజాలదని తెలిసినా, ఆ రంగంతో అంత ప్రత్యక్ష సంబంధంలేనివారికి వాస్తవాల్ని అద్దంపట్టి చూపించింది.

రచనలో ఎక్కడా సెక్సును ఎక్స్ప్లాయిట్ చేయలేదు. సస్పెన్స్‌కోసం సస్పెన్స్‌ని క్రియేట్ చేయాల్సిన అవసరం కూడా లేకుండా మాస్ రేప్ అండ్ మర్డర్ చేసిన గ్యాంగ్ ఎవరో అంత తేలికగా బయటపడదుగనుక అది బయటప డేదాకా సాగిన సస్పెన్స్‌ను సహజంగానే ఉప యోగించుకొన్నారు. ఆ గ్యాంగ్‌ని బయటపడ నీయకుండా చేసేశక్తులు ఎంత బలమైనవో, బయటకు లాగాలని చూసే నిజాయితీగల వ్యక్తుల్ని ఎలా బలి తీసుకుంటాయో చక్కగా చిత్రించగలిగారు.

కాని జర్నలిజాన్ని సమూలంగా నాశనం చేయటానికి ప్రయత్నిస్తున్న విషపు మొక్కల్ని పీకెయ్యడానికి, వాటిని పెంచి పోషించే విషనా గుల్ని నాశనం చెయ్యడానికి ఏంచె య్యాలి?— అని ప్రశ్నించుకొని ఆవేదనకు గురైన నిఖిలేష్ చివరికి ఆ ప్రశ్నకు సమా ధానం చెప్పకుండానే అతిభయంకరంగా బలై ప్రశ్నను ప్రశ్నగానే మిగిల్చాడు.

**—ఉ. సాంబశివరావు**
హైదరాబాదు.

## 'నిజం' వెనుక నిజం

**ద్వితీయ బహుమతి**
**రు. 75/- పొందిన సమీక్ష**

సంఖ్యాపరంగా పెరుగుతున్న నేటి దినప త్రికల్లో వివిధ సెక్షన్లనుంచి వచ్చినవాళ్లు ఉద్యో గులుగా చేరుతున్నారు. ఒకవక్క సాహిత్యం క్షీణవిలువలతో వెలువడుతోంది. మరోపక్క సంఖ్యలో తక్కువే అయినా మంచి రచనలూ జనజీవితంలోకి విస్తృతమౌతున్నాయి. ఊహాజ నిత ప్రేమలు, కాకమ్మకథలస్థానే వివిధ వృత్తు లకు సంబంధించిన సమస్యల మూలాల్లోకి సాహిత్యం పాకుతోంది. ఈ నేపథ్యంలో జర్నలి స్టుల సమస్యలగురించి 'నిజం' నవల రాసిన సత్యవోలు సుంచరశాయిగారికి, ప్రచురించిన 'చతుర'కు ధన్యవాదాలు.

అయితే విలేకరులు ఈ 'నిజం' నవలలో చిత్రించినట్లుగానే వున్నారా? ఉంటే అది వారి వైయక్తిక లక్షణమా? అట్లా వాళ్లను తయారుచే సే శక్తులేమిటి? ఈ నవలలో ఒకచోట చెప్పిన ట్లుగానే ప్రభుత్వానికి, ప్రజలకుమధ్య విలేకరు లు వారధులు. అంతేకాకుండా పత్రికల మను గడకు, వాళ్ల జీతాలకు, జీవితాలకు కారణం ప్రజలు. ప్రజల మంచిచెడ్డలు విలేకరులు పట్టించుకోవాలి.

ప్రజలు తమ అవసరాలు తెలుసుకొని, తమ దైన్యాన్ని దరిద్రాన్ని మార్చుకోవడానికి ప్రయత్నిస్తారు. సహజంగానే ప్రభుత్వాలు దండనీతిని ప్రయోగిస్తాయి. ఈ సమయంలో విలేకరుల బతుకు కత్తిమీది సాములాంటిది. విమర్శ సహించలేని ప్రభుత్వాలకు విలేకరు లు ఏచిన్న విషయం రాసినా ప్రభుత్వాలకు దాని భావజాలంలో బతికేవానికి కంటగింపే అవుతుంది. ఇటు ప్రజలు తమ దైనందిన సమస్యలు రాయకపోతే పత్రికలు చదవరు.

ఇటీవల తెలంగాణా జిల్లాల్లోనే విలేకరులమీద దాడులు పెరగడం, విలేకరుల సంఘటితశక్తి పెరగడం, కొన్ని జిల్లాలలో విలేకరులకు మద్దతుగా ప్రజలు ఊరేగింపులు తీయడం కన్పిస్తున్నది.

'నిజం' నవలలో సాయిగారు సమాజాన్ని ఈ నేపథ్యంలో ఏకమొత్తంగా కాకుండా విడివిడిగా చూస్తున్నారు. ఈ నవలలోని అన్నిపాత్రల మంచిచెడ్డలకు కారణం— వాళ్లు బతుకుతున్న సమాజంలోకాక ఆయా వ్యక్తుల్లోనే వెతకడానికి రచయిత ప్రయత్నం చేశాడు. ఈ నవలలోని హోమ్‌మినిస్టరునుంచి అజయ్‌దాకా ఒక లింకున్నది. అది దోపిడి. రెండోపక్క నిఖిలేశ్‌నుంచి సామ్యదాకా ఇంకో లింకున్నది. అది దోపిడిని ప్రశ్నించడం. దోపిడిశక్తి బలమైందేకాక అధికారంలోకూడా వున్నది. ఈ శక్తిని ఎదుర్కోవడానికి నిర్మాణం కావాలి. తనతో కలిసివచ్చే శక్తులన్నిటిని కలుపుకొని పోరాడాలి. కాని నిఖిల్‌కు ఈ విషయం తెలియదు. అందుకే వ్యక్తిగతచర్యలకు, ఆదర్శవాదానికి లోనయ్యాడు.

యూనియన్లలోని వ్యక్తులు కరప్టు అయితే ఆయా వ్యక్తులను మార్చుకోవడానికి ప్రయత్నం చేయాలిగాని మొత్తంగా యూనియన్లను వ్యతిరేకించడం మంచిపద్ధతి కాదు. జర్నలిస్టులు మిగతా ప్రజానీకంతోపాటు తమ భద్రతను పోరాడి సాధించుకోగలమనే వాస్తవాన్ని గుర్తించాలి.సమాజంలోని చెడుకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో నిఖిలేశ్‌లాగా ఒంటరి పోరాటంకాకుండా ప్రజలతో కలిసిపోవాలి. నాలాంటివాడికి జర్నలిస్టు వృత్తిపరమైన విషయాలు తెలియజేసిన రచయితకు, 'చతుర'కు ధన్యవాదాలు.

**—అల్లం రాజయ్య**
మంచిర్యాల.

## కొత్త కోణం

**తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష**

మామూలు నవలలకు భిన్నంగా, ఒకతరహా ఇతివృత్తంతో ఒక విలక్షణమైన, వినూత్నమైన నవల చదివే అవకాశం జనవరి నెల 'చతుర'ద్వారా కలిగింది.

'పంతొమ్మిదో శతాబ్దం నవలాకారుడిదైతే, ఇరవయ్యో శతాబ్దం జర్నలిస్టుదని' ప్రఖ్యాత అమెరికన్ జర్నలిస్టు జేమ్స్ రెస్టెన్ ఏనాడో చెప్పాడు. ఇది పత్రికాయుగం. ప్రజలు పలురకాల సమస్యలు ఎదుర్కొంటున్న ప్రస్తుతకాలంలో పత్రికారంగం ప్రజలకు మరింత సన్నిహితమైంది.

వర్తమాన ప్రాముఖ్యతగల 'జర్నలిజం' కథావస్తువుగా ఈమధ్యకాలంలో ఏ నవలా రాలేదు. అటువంటి కొత్తకోణంవైపు పాఠకుల్ని తనతోపాటు తీసుకువెళ్ళటంలో రచయిత కృతకృత్యులైనారు. పైవర్గాల్లో తమకుగల పలుకుబడినుపయోగించుకొని, కుటిల రాజకీయశక్తులతో లాలూచీపడి, తమ వృత్తికున్న విలువల్ని సైతం తాకట్టుపెట్టి పబ్బంగడుపుకోజూచే పాత్రికేయ ప్రబుద్ధులకు 'నిజం' నిజంగా ఓ చెంపపెట్టు.

ముగింపు పాఠకులకే వదిలేసినట్టున్నారు రచయిత. వర్తమాన పత్రికా ప్రపంచపరిస్థితుల్ని పాఠకులకు పరిచయంచేయడంవరకే రచయిత ఉద్దేశమైనట్లుంది. ఇటువంటి క్లిష్టతరమైన సబ్జెక్ట్‌ను ధైర్యంచేసి పాఠకుల ముందు పెట్టడం అభినందించాల్సిన విషయం.

**—మేడేపల్లి శేషు**
**తిరుపతి.**

## సూచించని పరిష్కారం

**రు. 25/- బహుమతి పొందిన సమీక్ష**

'నిజం' నవలారచయిత ఉద్దేశం మంచిదే కాని దాన్ని సరిగ్గా ప్రజెంట్ చెయ్యలేక పోయారేమో అనిపిస్తుంది.

ఒక అబ్బాయి, అమ్మాయి, అపార్థాలు, కన్నీళ్ళు, చివర్లో మళ్ళీ కలుసుకోవటాలు లాంటి ఇతివృత్తాలకు కాలంచెల్లిసమకాలీన సమస్యలను చిత్రించే రచనలకు ఆదరణ పెరిగిన ఈ సమయంలో కలుషితమై ఉన్న జర్నలిజం రంగంపైన రచయిత తన దృష్టిని సారించటం అభినందనీయం.

పాఠకులకు జర్నలిజం గురించి కొన్ని ప్రాథమిక విషయాలు తెలియజెప్పటంవరకూ రచయితను అభినందించాలి! అయితే జర్నలిజం మీద రాస్తున్న ఈ రచనను డిటెక్టివ్

నవల స్టయిల్లో నడిపించాలనుకోవటం అభిలషణీయంకాదు. విలన్లందరూ నాయకుడి పరివారజనంలోని వారేకావటం, భారతి, నిఖిలేష్‌ల మధ్య ఒక లవ్‌ఎలిమెంట్ కూడా ప్రవేశపెట్టి, మళ్ళీ దాన్ని భగ్నం చేసి, ఆమెని ప్రతినాయకుల ఏజెంట్‌గా చిత్రించటం అచ్చంగా తెలుగు సినిమాలా వుంది. పోనీ ఆ సౌమ్య అనే అమ్మాయి మానభంగం, హత్య గురించిన పరిశోధన అయినా పూర్తిగా రాశారా అంటే అదీ అసంపూర్తిగానే వదిలేశారు. నిఖిలేష్ దుష్టశక్తులపై విజయం సాధిస్తాడా, ఓడిపోతాడా అనేది కూడా స్పష్టం చేయకుండా అతడు మరణశయ్యపై పెనుగులాడుతుండగా కథని ముగించేశారు.

కేవలం సమస్యను చర్చించి వదిలేయటం సరయిన పద్ధతికాదుకదా! దానికి పరిష్కార మార్గంకూడా సూచించాలి. ఆ పని మాదికాదు అంటారా రచయిత? కేవలం సమకాలీన పరిస్థితిని ప్రొజెక్ట్‌చేయటం వరకే వారి ఉద్దేశమైనపుడు వ్యాసం రాసుకుంటే సరిపోయివుండేదిగా?!

మొత్తంమీద పాఠకుడికి పూర్తి సంతృప్తిని కలిగించని రచన 'నిజం'.

—మహమ్మద్ రఫీ
మాచర్ల

## వాస్తవానికి అద్దం

**రు. 25/- బహుమతి పొందిన సమీక్ష**

వెరైటీ నవలలనందించడంలో 'చతుర' దానికదేసాటి అనడంలో అతిశయోక్తిలేదు. నేటి పాఠకుల అభిరుచికనుగుణంగా 'ప్రత్యేక తరహా' నవలలను ప్రచురించడంలో 'చతుర' కృతకృత్యురాలవుతూంది.

'నిజం' ఓ మంచి నవల చదివామన్న తృప్తి కలుగజేసింది. 'జర్నలిజం' వంటి ఓ డ్రైస బ్జెక్టను ఇతివృత్తంగా ఎన్నుకొని, పాఠకులకు అందించడంలో రచయిత విజయం సాధించారు. జర్నలిజం గురించి ఏమీ తెలియనివారికి కూడా ఆ రంగం అర్థమయ్యేలా రాశారు.





కాని నవలను, అసంపూర్ణంగా ముగించినట్లనుపించింది. అకస్మాత్తుగా భారతి పాత్రనలా మార్చేయడంవల్ల కథకు ఏం ఉపయోగమో అర్థంకాలేదు. 'హోంమంత్రి'వంటి పాత్రలద్వారా, దేశంలోని కుళ్ళురాజకీయాలకు, పైరవీకార్ల అరాచకాలకు అద్దంపట్టారు రచయిత.

ఏదియేమైనా 'జర్నలిజం' గురించి చక్కటి నవల చదివామన్న తృప్తి కలిగింది. 'నిజం' అన్న పేరు నవలకు చాలా చక్కగా అతికినట్లు సరిపోయింది.

—టి.వి. సునంద
గూడూరు

## అందరూ కాదు కొందరే

**రు. 25/- బహుమతి పొందిన సమీక్ష**

ఇన్వెస్టిగేటివ్ జర్నలిజంపట్ల ఆసక్తి పెరుగుతున్న ఈకాలంలో, అందుక్కావలసిన సమాచారాన్ని సేకరించటంలో ఓ పాత్రికేయుని బరువు బాధ్యతలను పేర్కొన్న 'నిజం' నవల బాగుంది.

కాని ప్రజల్లో ఓరకమైన గ్లామర్ తెచ్చుకొన్న జర్నలిస్టులను, జర్నలిజంను డబ్బుకు, విందు వినోదాలకు లొంగిపోయేదిగా చిత్రీకరించిన తీరు బాగాలేదు.

జర్నలిస్టులందరూ డబ్బుకో, మరోదానికో బానిసలై అమ్ముడుబోతే కేవలం 'ఎల్లో జర్నలిజం' మాత్రమే నిలబడగలుగుతుందిగదా అనే సందేహం రాకమానదు. రచయిత ఈ విషయంలో ఇంకాస్త శ్రద్ధ తీసుకొంటే బాగుండేది. కేవలం ఒకరో ఇద్దరో నిజమైన జర్నలిజానికి అంకితమైన పాత్రికేయుల వల్లనే పత్రికలు నిలదొక్కుకుంటాయనేది అర్థంలేనిది.

ప్రెస్‌కాన్ఫరెన్సులు, ఇంటర్వ్యూలు, ప్రెస్‌నోట్స్‌లాంటి పత్రికల పరిభాష, కొత్త ప్రపంచాన్ని పరిచయం చేస్తాయి. మనంరోజూ చదివే దినపత్రికల వెనుక ఇంత కథుందా అనిపిస్తుంది.

నవలను ఆసాంతం చదివేలా రాసిన రచయిత కృషి ప్రశంసనీయం.

—గురిజాల రమేష్
ఖమ్మం.



# చతుర

సంపుటి: 10 మార్చి 1987 సంచిక: 2

## ఈ నెల ప్రత్యేక నవల

చీకటివడింది. జైలుగోడల మధ్య మెలికలు తిరిగిపోతూ, బాధగా, భయంకరంగా అరుస్తున్నారు ఖైదీలు. ఉదయం నుండీ వచ్చి మంచి నీళ్లు కూడా లేవు వాళ్లకి. సరిగదా శరీరాల్నిండా చిత్ర హింసల తాలూకు చర్మం రేగిన గాయాలు. ఆ గాయాలపైన వనిగట్టుకుని జల్లిన కారవు మంటలు.

వారి హృదయవిదారక ఆర్తనాదాలకు జాలిపడకపోగా ఆవేశంతో చిందులుతొక్కుతున్నాడు, హెడ్డు. "ఒరేయ్! జైలు అధికారులమీదే తిరగబడతార్రా. మీ బ్రతుకెంతరా? మిమ్మల్ని కైమా చేసి మీతోటి ఖైదీలకే వండి పెట్టి తినిపించగలంరా...!" అంటూ పైశాచికంగా, జైలు ఆవరణ అంతా ప్రతిధ్వనించేలా భీకరంగా అరుస్తున్నాడు.

ఏమిటది?

జైళ్లయినా, శిక్షలయినా నేరస్తులను సన్మార్గంలోకి తెచ్చేందుకే, వారిలోని వివేకాన్ని, విచక్షణని మేల్కొలిపేందుకేనని అందరూ అంటున్నారు. వందమంది అపరాధులు తప్పించుకున్నా సరేగాని ఒక్క నిరపరాధికి కూడా నేరస్తుడుగా ముద్రపడకుండా చూడాలనీ అంటున్నారు.

మరి, వాస్తవంలో జరుగుతున్నది ఏమిటి? మనిషిలోని మానవత్వాన్ని హరించేసి మంచి వారిని సైతం క్రూరులుగా రూపొందిస్తున్నాయా మన జైళ్లు?

# కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి

తెలుగులో తొలిసారిగా జైలులోపలి జీవితాల్ని గురించి విశ్వసనీయంగా రచించిన సరికొత్త తరహా నవల

# జైలు



ఈ నెల చతుర సమగ్ర నవల. 'చతుర' నవలలపోటీలో ప్రత్యేక బహుమతి రు: 3000/- పొందిన యదార్థ జీవన చిత్రణ "జైలు" ఊహాప్రపంచాన్నిగాక తమ పరిసర జీవన ధోరణులను కొన్నింటినయినా తెలుసుకోగోరే పాఠకులకు ఆసక్తికర నవల "జైలు"

సరిగ్గా ఏడేళ్లక్రితం 1980 మార్చి "చతుర"లో తన నవల "మానవహోమం"తో పాఠకుల్ని ఆకట్టుకున్న శ్రీ కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి జీవితంలోని అన్ని కోణాలనూ దర్శించి, అనుభవించి, తన రచనల ద్వారా పాఠకులకు ఆ యదార్థ జీవిత వ్యధార్తరూపాన్నిచెప్పి ఆలోచింపజేయాలనే తపనగల రచయిత. తన వివరాలు చెప్పుకోవటానికి ఇష్టపడని కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి కనీసం స్థిరమైన చిరునామా కూడా లేని రచయిత.



కుండపోతగా కురిసిన వర్షం సద్దుమణి గింది. గార్డ్‌రూంలో కూర్చున్న పోలీసులు గుడ్డలు దులుపుకొని లేచి తుపాకులు చేతికి తీసుకున్నారు.

"అందరూ లేచి వరుసగా నిలబడండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పదిమంది ఖైదీలు చేతికి సంకెళ్ళతో ఇద్దరిద్దరుగా నిలబడ్డారు. ముందు ఇన్‌స్పెక్టర్, వెనుక పదిమంది కానిస్టేబుల్స్ తుపాకులు చేత పట్టుకుని నడిచారు.

డెబ్బైమెట్లు ఎక్కిన తరువాత వచ్చిన పెద్ద గేటుముందు వారిని వరుసగా నిలిపారు. ఇన్‌స్పెక్టర్ ముందుకువెళ్ళి, లోపలకు చెయ్యిదూర్చి లోపలున్న వ్యక్తికి కాగితాలు అందించాడు.

ఇన్‌ఛార్జి ఆఫీసరు కాగితాలు చూసుకుని తల ఊపి, సెంట్రీని తలుపు తీయమన్నాడు.

వరుసగా అందరినీ లోపల నిలబెట్టారు.

"పోతాలూ" గార్డ్ అరుపుకు ఆఫీసరు ముందుకు వచ్చాడో వ్యక్తి.

"నీపూర్తి పేరేమిటి?" ఆఫీసరు అడిగాడు నోట్సులో రాయబోతూ.

"చింతపల్లి పోతాలు"

"కేసేమిటి?"

"144 సెక్షన్, 258 సెక్షన్ కింద"

"గుడ్డలూడదీయండి" గార్డ్‌లకు ఆజ్ఞాపించాడు ఆఫీసరు.

ఇద్దరు గార్డులు అతని గుడ్డలు ఊడదీశారు.

మొలత్రాడు తెంచారు.

జుట్టులో వేళ్ళు దూర్చి తడిమారు.

డ్రాయరు మొత్తం పిసికి పిసికి శోధించారు.

ఏమీలేవని నిర్ధారించుకున్నాక అతడి సంచితీసుకుని గుమ్మరించారు. అందులో ఒక అద్దం, పెన్ను కాగితాలు, దువ్వెన, ఒక జత గుడ్డలున్నాయి.

గుడ్డలు, పెన్ను దువ్వెన అతనికి ఇచ్చి మిగిలినవి సంచిలో వేసి కట్టారు. సంచిమీద





నంబర్ రాసి, ఒక మూలకు గిరాటేసి, మరొకరిని పిలిచారు.

వరుసగా పదిమంది పూర్తవుతూనే ఇన్‌స్పెక్టరు తన ఎస్కార్ట్‌తో వెనుదిరిగాడు.

పోతాలుతోపాటు మిగిలిన తొమ్మిదిమందినీ లోపలకు తీసుకెళ్ళి జైలు దుస్తులు అందజేసి, ఒక సెక్టర్‌లో వేశారు.

అప్పటికే ఆ సెక్టర్‌లో దాదాపు ముప్పైమంది ఖైదీలున్నారు.

అందులో ఒక వ్యక్తి వీరిని చూసి "ఏవూరు భాయ్?" అన్నాడు నవ్వి.

"నంద్యాల ప్రాంతం" అన్నాడు పోతాలు కూడా నవ్వి.

"మనోడివేనన్నమాట! నాదీ కర్నూలు జిల్లాయే భాయ్! మావాళ్లకు నామీద చాలా దయ! అందువల్ల తరచూ ఇక్కడికి తీసుకొస్తుంటారు. జేబులో ఏమైనా సిగరెట్లున్నాయా?"

ఒక వ్యక్తి బీడీకట్ట తీసి వారి ముందుకు విసిరాడు.

"ఇదే మొదటిసారా? లేక ఈ అత్తగారింటికి ఇంతకుముందు కూడా వచ్చారా?"

"ఇదే మొదటిసారి! అత్తగారింటిలాగే ఉంటుందా?"

ఖాసిం బీడీ దమ్ములాగి, చిద్విలాసంగా పొగవదిలాడు. "భాయ్... ఎవడు పేరు పెట్టాడో నాకు తెలియదుగానీ, ఇది జైలు కాదు అత్తగారిల్లే! మన జీవితంలో తినని తిండి ఇక్కడ దొరుకుతుంది. ఎన్నడయినా తామరకాడల పులుసు తిన్నావా? నువ్వేం తిని వుంటావ్? మురుగునీళ్ళు, పసుపు రంగూ కలిపి సాయంత్రం ఆరు గంటలకు ఎంతో ఆప్యాయంగా మనకు తినబెడతారు. ఇహ ఉదయంపూట చూస్కో, పవిత్ర గోదావరి నీళ్ళ పులుసూ, తుంగభద్రడామ్ దగ్గర పేరుకుపోయిన బురద లాంటి అన్నం వద్దన్నా గొంతుదాకా తినిపిస్తారు. ఇదే కాదులే! వారానికోసారి రెండు ఎముక ముక్కల పులుసు కూడా దొరుకుతుంది. అయినా భాయ్! బయట ఇంతమాత్రమయినా మనకు దొరకదుకదా!"

పోతాలు ఖాసిం పక్కన కూర్చున్నాడు. మిగిలినవారు కూడా చతికిల బడ్డారు.

ఆ సెక్టర్‌లో మొత్తం కర్నూలు జిల్లా వాళ్ళే ఉన్నారు. వారిలో దొంగలు, రౌడీలు, ఖూనీకోరులు, పిక్‌పాకెట్‌గాళ్ళు, రైటింగ్ కేసులు, ఒకటీ అరా డ్రైవర్ కేసులు!

పోతాలు జైలుకు రావడం ఇదే మొదటి సారి! జైలును గురించి చెబుతుంటే వినడమే గానీ, ఇంతవరకూ చూడలేదు. బయట వర్ణించినంత భయంకరంగా జైలు కనిపించడంలేదు. పెద్ద హాలు, ట్యూబ్‌లైట్ల వెలుతురు, మరుగు దొడ్లు, చల్లటి బండ పరుపు, మనిషికో దుప్పటి, కంబళి, మనిషికో పళ్ళెం, గ్లాసు, బీడీలు తాగే అవకాశం!

అతని దృష్టిలో ఇదంతా బాగున్నది.

ఓ ముసలతను దగ్గుకుంటూ వారి వద్దకు వచ్చాడు.

"ఏం కులం నాయనా?" అన్నాడు దగ్గుతూ పోతాలుతో.

"ఏందిరోయ్ ముసలోడా! ఇది జైలురా! ఇక్కడున్నోళ్ళంతా జైలు కులంవాళ్ళే" అన్నాడు ఖాసిం ఈసడింపుగా.

పోతాలు ముసలతనివైపు చూశాడు. రేపో మాపో చచ్చేలా ఉన్నాడతను.

బయట గంట మోగింది.

బిలబిలమంటూ అందరూ బయటకు పరుగులు తీస్తున్నారు. ఎవరి పళ్ళెం, గ్లాసు వారి చంకల్లో పెట్టుకున్నారు.

ఖాసిం కూడా లేచి-- "లేవండి భాయియోం! మనల్ని ప్రభుత్వం కూటికి ఆహ్వానిస్తున్నది. ఇంత దయగా ఇంటి దగ్గర మన పెళ్ళాలు కూడా పిలవరు " అన్నాడు టోపీ తలకు పెట్టుకుంటూ. అతనితోపాటు పదిమంది పళ్ళేలు చేతపట్టుకుని బయట నిలబడ్డారు. వారందరినీ వరుసలో నిలిపాడు ఖాసిం.

వరుసలో నిల్చున్నవారు నిల్చుంటే, పక్కవైపునుండి కొందరు వచ్చి అన్నం, రొట్టెలు తీసుకెళ్తున్నారు. కొందరయితే తమంతకు తామే తీసుకుంటున్నారు. కాటా వేసేవాళ్ళు వాళ్ళను ఏమీ అనడం లేదు.

"ఏమిటిది... మనం వరుసలో నిలబడ్డాం! కొందరు ముందే వెళ్ళితీసుకెళ్తున్నారే?" అన్నాడు పోతాలు ఖాసిం వైపుతిరిగి.

ఖాసిం టోపీ చేతికి తీసుకుని విసురుకుంటూ నవ్వాడు. "భాయ్! కిరోసిన్ క్యూలో నిలబడితే నిలబడ్డవాడు మూడురోజులు నిలబడ్డా వాడి వంతురాదు. వచ్చేలోగా పక్కవాళ్ళు పదిసార్లు తీసుకెళ్తారుకదా!"

"అది బయటి ప్రపంచం. కాని జైలులో అందరు సమానమేకదా!"

"ఎవరన్నారు... నువ్వనుకుంటే సరిపోతుందా? ఇక్కడ ఖూనీలు చేసిన వాళ్ళు ఉన్నారు. చేతిలో రొట్టె లాక్కెళ్లిన చిట్టి దొంగలున్నారు. వీరందరూ సమానమెందుకవుతారు?"

పోతాలు ముఖం కోపంతో జేవురించింది. అయినా నోరెత్తలేదు. ఊపిరి పీల్చి వదుల్తూ నిలబడ్డాడు. అతడి ఆగ్రహం చూసిన ఖాసిం "ముందుంది మొసళ్ళ పండుగ" అన్నాడు భుజం తట్టి.

వీరి వంతు వచ్చింది.

కాటాతో తూకం వేసి, అన్నం పోతాలు పళ్ళెంలో వేశారు.

అన్నం నీళ్ళుకారుతున్నది. మెత్తగా అంబలిలాగావుంది.

పక్కనున్నతను గ్లాసులో కూరవేశాడు.

అవి పసుపు, కారం కలిపిన రంగు నీళ్ళలా వున్నాయి తప్పితే పప్పులాగా లేదు.

అందరూ అన్నం పట్టుకున్న తరువాత వరుసగా కూర్చొని తింటున్నారు. కాటా దగ్గర మిగిలిన అన్నం యధేచ్ఛగా పంచుకుని తింటున్నారు.

ఆ అన్నం పోతాలుకు సహించలేదు. తన పక్కన కూర్చున్న నలీంకు, నాగన్నకు అన్నంపెట్టి పళ్ళెంలో చెయ్యికడుక్కుని లేచి నిలబడ్డాడు.

అంతలోనే ఒక గార్డు అరుస్తూవచ్చి, లాఠీతో వీపునబాదాడు. "బేవకూఫ్! బైట్... బైట్‌రే!" అంటూ మెడమీద చేతులేసి ముందుకు తోశాడు. పోతాలు ముందుకు బోర్లపడ్డాడు.

ఖాసింలేచి "గార్డ్‌సార్! అతడు కొత్తవాడులెండి! తెలియకలేచాడు" అంటూ సర్దిచెప్పాడు.

# ఆ కళ్ళలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జి.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత!!



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :

ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

''నాలుగుతన్నితే వాడేతెలుసుకుంటాడు'' అంటూ భీకరంగా చూస్తూ గార్డ్ వెళ్ళిపోయాడు.

ఈ హఠాత్సంఘటనకు దిమ్మెరపోయిన పోతాలు మాట్లాడలేకపోయాడు.

నలీంలేచి- ''వీడి పంగచించేస్తే సరిపోతుంది'' అన్నాడు ఆగ్రహంగా.

''నోర్మూయరా పిచ్చినాయనా! ఇది పుట్టిల్లు కాదురా... అత్తగారిల్లు! ఇలాంటి సన్మానాలు ఇక్కడ సహజమే'' అన్నాడు ఖాసిం.

అందరూ లేచారు. తొట్టిదగ్గరకు వెళ్ళి కంచాలు కడుక్కుని నలుగురు చొప్పున వరుసలుగా కూర్చున్నారు. వరుసలో సరిగా కూర్చోలేకపోయిన నలీం పిర్రలమీద బూటుకాలు తగిలింది.

తన్నిన గార్డ్వైపు భీకరంగా చూశాడు. గార్డు మరింత భీకరంగా చూస్తూ ''ఏరా! పొడుస్తావా''? అంటూ జుట్టుపట్టుకొని, చాచి దవడ మీదకొట్టాడు. తోటిఖైదీలు పట్టుకుని విడిపించారు.

కళ్ళనీరుకారుతున్న నలీం తలవంచుకుని వరుసలో కూర్చున్నాడు. ఖైదీలందరూ సరిగా వున్నారని నిర్ణయించుకున్న తర్వాత ఎవరి సెల్లులోనికి వాళ్ళు వెళ్ళమని ఆజ్ఞాపించారు.

అందరూ వెళ్తూనే తలుపులు బిగించి తాళాలు వేశారు.

అప్పుడప్పుడే చీకటిపడుతున్నది. ట్యూబ్ లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఎదురుగా ఎత్తుమీదున్న కిటికీగుండా చల్లటి గాలి లోనికి వస్తున్నది. కంబళ్ళుపరుచుకుని పడుకుని పాటలు పాడుతున్నారు. కొందరు కంచాల్ని డప్పుల్లా వాడుతున్నారు.

పోతాలు ఖాసిం దగ్గరగా వచ్చాడు. ''రోజూ ఇదేతిండా?''

అవునన్నట్లు తలూపాడు ఖాసిం.

''ఎలా తినగలుగుతున్నారు?''

''మరోరెండ్రోజులుంటే అలవాటుపడిపోతావు భాయ్! ఇదిజైలు! జైలుకూడు ఇంతే!''

''బయట దీన్ని గురించి బాగా చెప్పుకుంటున్నారే?''

''స్వర్లోకం చూడనివాళ్ళు రంభాఊర్వసుల గురించి కలలుకంటూ చాలా గొప్పగా చెప్పుకుంటారు. చూసిన తర్వాత అక్కడ ఏంటుంది? సారా కంపు ఊర్వశీ, రొచ్చువానన రంభా! ఇదీఅంతే!''

''ఇక్కడ ఎన్నోసౌకర్యాలు కలిగించామని ప్రభుత్వం చెప్పుకుంటుంది గదా?''

''నిజమే! ప్రభుత్వపద్ధతిప్రకారం ఇక్కడ కొన్నిసౌకర్యాలు ఏర్పరిచారు. మంచి లెట్రిన్ సౌకర్యాలు; మంచిదుస్తులు, దేదీప్యమానంగా విద్యుత్లైట్లు, విహరించడానికి చిన్నపార్క్, చదువుకోడానికి బుల్లిలైబ్రరీ, కాలక్షేపానికి రేడియో, తూకం, కొలతలతో సరియైన భోజనం. కానీపాపం! ఏ మంత్రిగాడూ ఈ జైళ్లలోపడటంలేదు, అందువల్ల ఏమిస్తున్నారో, ఏం తింటున్నారో ఎవడూ చూడటంలేదు. ఎవడయినా ఆఫీసరు తణిఖీకి వస్తే ఆరోజిది నగరం వీధిలాగే కళకళలాడుతుంది. అతగాడు వెళ్ళిన తర్వాత వాడికొరకు పెట్టిన ఖర్చంతా ఖైదీల రేషన్లో కోతపడుతుంది. ఇది మామూలేభాయ్''

తుపుక్కున ఊశాడు పోతాలు అసహ్యంగా- ''మనకు రావలసిన సౌకర్యాలు రాబట్టుకోడానికి చేతగాక ఎందుకు నోరు మూసుకుంటున్నారు? మనమేం జైలర్ల సొమ్ము అడగడంలేదే! మన రేషన్ మనకివ్వాలి. ఇది ఎందుకు అడగగూడదు?''

ఖాసిం చిరునవ్వునవ్వి మీసం మెలేశాడు- ''పోతాలు భాయ్... ఇక్కడున్న చాలామందికి ఈ తిండీ, రావలసిన రేషన్ తెలుసు! మొదట నీలాగే రెండురోజులు కేకలేసినవాళ్ళే! ఆ తర్వాత వాళ్ళే నోరు మూసుకుంటున్నారు''

''అయితే ఎదిరించలేమంటావా? చూడు... రేపు వీళ్ళ సంగతేమిటో తేల్చుకుంటాం'' అన్నాడు నాగన్న రోషంగా.

''తగ్గుభాయ్ తగ్గు! తన్నులు తింటావ్ ఇలాఅయితే! ఈ పూట మీవాళ్ళు ఇద్దరు తిన్నదెబ్బలు అప్పుడే మరచిపోతే ఎట్లా?''

''కుక్కల కొడుకులు, లోపలకాబట్టి కొట్టగలిగారు! ఇదేబయట అయితే ఈపాటికి ఇద్దర్నీ ఈబెల్ట్తో చీరేసేవాణ్ని!''

'''నీటిలోన మొసలి నిగిడిఏనుగు' పద్యం

విన్నావా? అంతమరి! మీ శిక్షాకాలం రెండు సంవత్సరాలు! ఏదోకాలం గడిపి బయటపడ టానికి ప్రయత్నించండి! లేకుంటే అరవైనర కలోకాల్ని చూపిస్తారు వాళ్లు"

"చూద్దాం వాళ్ళసంగతి! రావలసిన సౌక ర్యాలు ఎలారావో, ఎందుకివ్వరో తేల్చు కుందాం" అన్నాడు పోతాలు.

"మంచిది! మీరు తేల్చుకుని మేలుచేస్తే ఇక్కడిమూడొందల ఖైదీలూ మీపేరు చెప్పు కుని సుఖంగా తింటారు. కానీ భాయ్... అది అసాధ్యం. తొందరపడకుండా ఆలోచించండి" అన్నాడు ఖాసిం పక్కమీదకు జారుతూ!

బయట గార్డ్‌రూంలో తొమ్మిది గంటలు కొట్టారు. పహరాహుషార్ అంటూ గార్డులు ప్రతి సెల్ తలుపు వద్దకు వచ్చి తలుపు టకటక మోగిస్తున్నారు. లోపల ఎవరయినా మాట్లాడు తూనో, కూర్చునో ఉంటే బండబూతులు తిడు తున్నారు.

"పడుకోరా నాగన్నా" అన్నాడు పోతాలు ఆలోచిస్తూ.

గార్డు కేకలు, అరుపులూ, హెచ్చరించుకోవ డాలూ వినబడుతున్నాయి. అప్పుడప్పుడూ తలుపు ఊచలకేసి లాఠీలతో కొడుతూ తిరుగు తున్నారు గార్డులు.

పోతాలుకు ఎంత ప్రయత్నించినా నిద్రప ట్టడంలేదు.

పోతాలుకు ఒకటే బాధ. తాను ఏ తప్పూ చేయలేదు. చేతనయినంతవరకూ మేలుచే యడానికే ప్రయత్నించాడు. చేయని తప్పుకు రెండు సంవత్సరాలు తాను శిక్షఅనుభ వించాలి. ఇది న్యాయమా? అనుకున్నాడు.

తాము ఏ తప్పూ చేయకున్నా ఈ జైలుకు తరలించబడ్డారు. మరో రెండు సంవత్సరాల దాకా ఇక్కడ నుండి తాము బయటకు వెళ్ళలే రు. ఈరోజు తిన్నతిండి చూస్తే ఈ రెండు సంవత్సరాల్లో కండలటుంచి ఎముకలు కూడా కరిగిపోతాయి. బయటి జనం మంచి కొరకు తాను ప్రతిఘటన చేశాడు. ఇప్పుడు జైలులో మాత్రం తాను ఎందుకు చేయకూడదు? అధి కారులకు భయమన్నది ఏర్పడితేనే మెత్తగా వ్యవహరిస్తారు. వారిని ఎదిరించేవాడు లేకుంటే వారి పద్ధతులింతే!

ఆలోచిస్తూ పడుకున్నాడు పోతాలు.

పోతాలు కష్టజీవుల్లోకూడా కష్టజీవి. అతని తండ్రి ఫ్యాక్టరీకార్మికుడు. తల్లి దీర్ఘరోగి. తండ్రి సంపాదన ఆ కుటుంబానికి ఏమాత్రం చాలేది కాదు. అడపాదడపా వస్తువులుమామూలే! ఎప్పు డునేలకూలుతుందో తెలియని తాటాకు పూరి గుడిసె. అద్దె పదిహేనురూపాయలు చెల్లించా లన్నా ఎంతో కష్టంగా ఉండేది. పోతాలుగాక ఆ కుటుంబంలో మరోపిల్ల! అతని కళ్ళ ముందే రోగాలతో, సరయిన తిండిలేనిస్థితిలో శుష్కించి చనిపోయింది. పోతాలు ఇంటిదగ్గర ఆలనా పాలనాలేక రోడ్లమీద పడ్డాడు. ఐదోతర గతి వరకూ చదువులాగించిన పోతాలు, ఆ సమయంలోనే ఇంటిబాధ్యత భరించే తండ్రి కూడా అర్ధంతరంగా చనిపోవడంతో, రోగిష్టి తల్లితో జీవితం మోయవలసిన పరిస్థితి ఏర్ప డింది. తినడానికి తిండి దొరకని స్థితిలో, పదోఏట రిక్షా తొక్కడం ఆరంభించాడు.

కొన్నాళ్ళకు రోగిష్టి తల్లి ప్రాణం ఎగిరిపో యింది. చివరకు పోతాలు ఒక్కడూ మిగిలా డు.

★ ★ ★

కలత నిద్రలో ఉలిక్కిపడి లేచాడు పోతా లు. కళ్ళు తెరచి చూస్తే,నవ్వుతూ నిలబడిన ఖాసిం.

"భాయ్! సమయం అయింది. మనం బయటకు వెళ్లాలి!"

లేచి కంబళి చుట్టి టోపీ తీసుకున్నాడు.

చీకట్లు విచ్చుకుంటున్నాయి. ఆవరణలో గార్డుల కలకలం ఆరంభమయింది. విప్పుకు న్న బెల్టులు నడుములకు చుట్టుకుంటున్నా రు. పక్కన పడవేసిన లాఠీలు చేతికి తీసుకు న్నారు. సెంట్రీ వచ్చి అన్ని సెల్లుల తాళాలూ తీశాడు.

ఖైదీలు బయటకువచ్చి వరుసలలో కూర్చు న్నారు. హెడ్‌కానిస్టేబుల్ వచ్చి లెక్కపెట్టాడు. ఖైదీలందరూ వున్నారని నిర్ణయించుకున్నాక "ఊరో" అంటూ అరిచాడు. ఖైదీలు దినకృత్యా లకు కదిలారు. కొందరు చెట్లకు నీళ్ళుపోయ డానికి, మరికొందరు కసవు చిమ్మడానికి, పారి




శుద్ధ్యానికి కొందరు, జైలుకిందవున్న ఇరవై ఎకరాలలో పనులు చేయడానికి కొందరు, ఎవరిపనిమీద వారిని గార్డులు తీసుకెళ్తున్నారు.

పోతాలును వంటరూంకు తీసుకెళ్లాడు గార్డు.

వంట వార్డర్ నజీమ్ అతన్ని చూసి "ఏంపని చేస్తావ్?" అన్నాడు.

"ఏంపని చేయాలో చెబితేకదా, నాకు చేతనయ్యేదీ లేనిదీ చెప్పేది?" పోతాలు మాటలకు కంటగింపుగా చూశాడు నజీం. "నీలాంటి పొగరుమోతులకు తగినట్లే పనివుందిలేరా! జొన్నపిండి పిసకడానికి వెళ్ళు" అని గదిమాడు.

మరొక వ్యక్తి అతన్ని ఆవైపు తీసుకెళ్లాడు.

"వచ్చినవాళ్లందర్నీ అలా గదమాయించకురా! కోపగాళ్లయితే తన్ని కీళ్ళువిరుస్తారు" అన్నాడు గార్డ్ నవ్వి.

టోపీ కింద పెట్టి బల్లమీద కూర్చున్నాడతను.

"ఓసబ్బో! ఇలాంటి మొనగాళ్లను వేల సంఖ్యలో చూశానయ్యా! వీడెంత?" అంటూ పాలగ్లాను తెచ్చి గార్డుకందించాడు నజీం!

పాలు చప్పరిస్తూ కూర్చున్నాడు గార్డు.

ఎదురుగా వసారాలోనే పిండి ఏవిధంగా కలపడమో ఒక వ్యక్తి చెబుతుంటే పోతాలు పిసుకుతున్నాడు. ఒకవైపు పెద్దపెద్ద కాగులలో అన్నం వండుతున్నారు; పప్పు ఉడకబెడుతున్నారు. గార్డ్లు వస్తున్నారు. పాలు తాగుతున్నారు. ఖైదీలలోనే తెల్లబట్టలవాళ్ళు కొందరు వస్తున్నారు. వారికి కాఫీ, టీ, పాలు, ఏది అవసరమయితే అది నజీం సగౌరవంగా తయారుచేయించి ఇస్తున్నాడు.

జైలులో కూడా కాఫీలకు, టీలకు బాధ లేదనుకుంటూ, తనతోపాటు పిండి పిసుకుతున్న వ్యక్తితో "మనకూ కాఫీ ఇస్తారా" అన్నాడు.

ఆ వ్యక్తి ఎగాదిగా చూశాడు పోతాలును. చేతితో ముఖం రుద్దుకున్నాడు. అప్పుడయిన పిండిని వదిలించడానికి మరో చేతిని పైకిలేపి లోగొంతుకతో "తమరెవరో కాఫీ లేకపోతే పడిచచ్చేలాగున్నారు. ఆ కాఫీలు గార్డులకూ, గార్డులనూ, వంటవార్డర్‌ను మేపే పెద్దపెద్ద ఖైదీలకూ మాత్రమే. నోరు మూసుకుని పిండిపిసకడం కానివ్వు" అన్నాడు మందలింపుగా.

"ఆ పాలు ఖైదీలకు కాదా?"

"కావడమయితే ఖైదీలకే, కానీ అనుభవించేదిమాత్రం వాళ్ళు కాదు"

"ఇది అన్యాయం కాదా"

"ఇక్కడ ఎవరూ అనుకోవడంలేదు. ఈ మాటలు వింటే ఆ వార్డరుగాడు మనల్ని ఇక్కడినుండి తన్ని తరిమేస్తాడు. కానీ కానీ..."

పిసికిన పిండిని రొట్టెలుగా ఒత్తుతున్న ఒక వ్యక్తి వీరిద్దరి మాటలూ విన్నాడు. కండలు తిరిగిన శరీరం. బుర్ర మీసాలు. రొట్టెలను అతి తేలికగా ఒత్తి పక్కకు విసరివేస్తున్నాడు. అతడు వీరి దగ్గరగా వచ్చి- "ఒరే రామూ! బీడీ ఒకటి ఇవ్వరా" అన్నాడు.

పిసుకుతున్న పిండిని విడిచి జేబులో నుండి ముక్కబీడీ ఒకటి ఇచ్చి "ఇదే చివరి ముక్క గురూ" అన్నాడు.

ఆ ముక్కనే మహాసందంగా వెలిగించి గుప్పున పీల్చి వదిలాడతను.

అటుగా వచ్చిన నజీం- "ఓయ్... హనుమంతూ! తొందరగా కానీయ్... టైమవుతున్నది" అంటూ హెచ్చరించి మరోపక్కకు వెళ్లాడు.

"ఏవూరు నీది?" అన్నాడు హనుమంతు పోతాలువైపు తిరిగి.

పిండి పిసుకుతూనే వివరాలు చెప్పాడు పోతాలు.

"నీవు రాముతో మాట్లాడిన మాటలన్నీ విన్నాను. ఇది జైలయ్యా... జైలు! ఇక్కడ ఇవన్నీ మనలాంటివారికొరకే ఏర్పరచారు. కానీ అనుభవం మాత్రం మనదికాదు. అందువల్లనే నజీంగాడు సంవత్సరానికి ఎనిమిది నెలలు జైలులోనే వుంటాడు"

పోతాలు తలెత్తి అతడివైపు చూశాడు.

"నీ చరిత్ర వింటే నిజాయితీపరుడిలాగున్నావు. అందువల్ల నా సలహా ఏమంటే... దొరికింది తిను. ఇచ్చింది పుచ్చుకో. ఇవ్వనిది ఎందుకని ప్రశ్నించకు"

''ఏం?''

''ఆ ప్రశ్న వస్తే ఆతర్వాత నరకలోకం ఎక్కడుందో ఈ జైలులోనే చూపిస్తారు''.

''అందుకని మనకు రావలసింది వదులుకుందామా?''

''ఆ ధైర్యంలేకనే ఇక్కడ కొందరు వదులుకున్నారు, మరికొందరు డబ్బుపెట్టి కొనుక్కుంటున్నారు''

''ఇక్కడ డబ్బెక్కడిది?'' అన్నాడు ఆశ్చర్యంగా.

హనుమంతు తలవూపాడు. ''నీకు తీరిగ్గా చెప్పాలి. నీకేమీ తెలియదు. నేనూ ఒకప్పుడింతే! అయినా ఇప్పుడు చాలావరకూ తెలుసుకున్నాను. ముందు పనికానియ్. పదకొండు నుండి, రెండు గంటలదాకా మనకు తీరిక ఉంటుందిలే. అప్పుడు మాట్లాడుదాం!'' అన్నాడు హనుమంతు తన చోటుకు వెళ్తూ.

''ఎవరితను?'' అన్నాడు పోతాలు రామూతో.

''ఖూనీ కేసులో ముద్దాయి. చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు కొద్ది శిక్షతో ఇక్కడ పడ్డాడు. మంచిమనిషి! ఏంలాభం? ఇక్కడ అతడి శక్తిసామర్థ్యాలు పనిచేయడంలేదు. నజీంగాడితో తిండిదగ్గర ఒకసారి పోట్లాటకూడా అయింది. ఆతర్వాత హనుమంతే లొంగిపోయి పోట్లాట మానుకొన్నాడు. గార్డులందరూ వంట వార్డరుకు అనుకూలం! వాడితో పోట్లాడితే మళ్ళీ బొక్కలో తోయిస్తాడని ప్రతి ఒక్కరికీ భయమే''

''ఇప్పుడున్నది బొక్కలోనేకదా? ఇంతకంటే ఘోరమైన బొక్క ఇంకేముంటుంది?''

రాము నవ్వాడు. ''ఇక్కడ లోపలే మరో నరక లోకముందని హనుమంతు చెప్పలేదూ?'' అంటూనే నజీం అటురావడంతో నోరు మూసుకున్నాడు.

గార్డులు ఒక్కొక్కరే వస్తున్నారు. వారికొరకు స్పెషల్‌గా భోజనం, కూరలు చేశారు. ఒకరినొకరు పరాచకాలాడుకుంటూ భోజనం చేస్తున్నారు. దాదాపు యాభైమంది గార్డులు, వారిపై అధికారులు పదిమందీ భోజనాలు పూర్తి చేసేసరికి కుండలో పెరుగు చాలా వరకూ ఖర్చయింది. కూరలో నీళ్ళు కలిపి ఉడకపెట్టారు. పదిగంటలు దాటుతూనే అన్నం సెల్ ఆవరణలోకి మోసుకెళ్ళారు. హనుమంతు కూరవేస్తుంటే, పోతాలు రొట్టెలు అడిగినవారికి ఇస్తున్నాడు. పోతాలు వంటను జాగ్రత్తగా చూశాడు. అంతా ముద్దముద్ద అన్నం. పెసరపప్పు మెత్తగా రుబ్బి అందులో నీళ్ళుపోసి, నీళ్ళలాగా తయారుచేశారు. రొట్టెపిండి పిసికేటప్పుడు అందులో వరి తౌడుకూడా కలిపారు. ఈ ఖైదీలు అదేదో జొన్నరొట్టెగా భావించి, ఆ కల్తీ రొట్టెను, నీళ్ళ పప్పులో వేసుకొని ఆబగా తింటున్నారు. చివరగా వంట రూంలో పనిచేసినవారికి తిండిపెట్టారు. ఆ తిండి తినలేక కళ్ళు మూసుకున్నాడు పోతాలు.

పదకొండు గంటలకు వంటమనుషులు సెల్‌లోకి వచ్చారు. ఉదయం సెల్ తలుపులు బిగించరు. అందువల్ల ఒకరి సెల్‌లోనికి మరొకరు వస్తూ పోతూ ఉంటారు. హనుమంతు పోతాలు భుజం మీద చెయ్యివేసి అతడి రూంలోనికి వచ్చాడు. టోపీతీసి కిందవేసి దానిపైన కూర్చుంటూ— ''ఖాసిం! బీడీ ఒకటి ఇవ్వు'' అన్నాడు.

''నేనేం ఖూనీలు చేసి జైలుకు రాలేదమ్మా! ఉట్టి జేబుదొంగగాణ్ణి! నాదగ్గర డబ్బు లేడిశాయా బీడీలు తాగడానికి'' అన్నాడు ఖాసిం జేబు నుంచి బీడీముక్క తీస్తూ.

ఆ ముక్క హనుమంతు లాక్కున్నాడు. ''ఒరే... జేబు దొంగగాడి దగ్గరున్నంత డబ్బు మాదగ్గరెందుకుంటుందిరా! ఏదో ఆవేశంలో ఖూనీలు చేస్తాంగానీ, డబ్బుకోసం కాదుగదా! సరేగానీ... మన గురువుగారికి జైలును గురించి బోధించలేదేం!''

''ఈ పోతాలు చూస్తేనే మండిపడే స్థితిలో ఉన్నాడు. ఇటువంటివాడికి ఇక్కడి వివరాలు చెప్పి బాధపెట్టడమెందుకు?''

''అదేంమాట! కొత్తవ్యక్తి! అతడూ తెలుసుకోవాలి. ఆతర్వాత చేసేది లేదనుకో! అయినా మరోసారి జైలుకు వస్తేనయినా సుఖంగా తినడం నేర్చుకుంటాడు''

''హనుమంతూ! జవాన్లు ఇక్కడే అన్నం ఎందుకు తింటున్నారు?'' అన్నాడు పోతాలు.





హనుమంతు ఒక దమ్ము లాగి, రాయిమీద బీడీని ఆర్పి చెవిలో పెట్టుకున్నాడు ముక్కను.

"మనం కొద్దికాలమే ఇక్కడ ఖైదీలం. కానీ ఈ జవాన్లున్నారే! వాళ్ళు జీవితాంతం ఖైదీలే! అందువల్ల ఈ శాశ్వత ఖైదీలకు ప్రభుత్వం కొంత దయ చూపించింది. అదేమంటే ఖైదీల తోపాటు రోజుకు ఒక పూట వారికోసం చేసిన వంటనే తినాలి! కానీ మన జవాన్లు స్పెషల్‌గా వంటలు చేయించుకుంటున్నారు. ఖైదీలకు రావలసిన రేషన్ సగం బయటకు వెళ్తుంది. మిగతాసగం ఈ అరవైమంది కలిసి స్పెషల్‌గా సగం తింటారు. అంటే ఖైదీకి రావలసిన రేషన్‌లో చివరకు మిగిలేది నాలుగో వంతే!"

"ఈ అన్యాయాన్ని ఎదిరించకూడదా?"

గలగల నవ్వాడు హనుమంతు. అతడి నవ్వుకు ఆ గది ప్రతిధ్వనించింది.

జవాను ఒకడు బిరబిరా అక్కడకు వచ్చి చూసి తిరిగి వెళ్ళిపోయాడు.

"అంత సులభం కాదు తమ్ముడూ! నీవు పోరాడుతానంటే నాకభ్యంతరం లేదు. కానీ దానివల్ల తోటి ఖైదీలు బాధపడతారనే నాకు భయం"

"ఎటువంటి బాధలనయినా నేను ఓర్చుకుంటాను అన్నగారూ! నాకు వివరాలు చెప్పండి. ఇక్కడి ఖైదీలందరికొరకు నేను ఒక్కడినీ బాధపడటానికి వెనుకాడను. అసలు జైలు నిబంధనలేమిటి?"

హనుమంతు తల గీరుకున్నాడు. ఆ తర్వాత తలుపువైపు చూశాడు. అటు తర్వాత గది పైకప్పుకేసి చూశాడు.

"చూడు పోతాలూ! ప్రతి ఖైదీకి ఇవ్వవలసిన రేషన్ 400 గ్రాముల బియ్యం, 50 గ్రాముల కందిపప్పు, 25 గ్రాముల నూనె, 25 గ్రాముల చింతపండు, ఉల్లిగడ్డలు, పాలు 70 గ్రాములు. వీటికి సరిపడే ఇతర దినుసులు ఉదయం పూట. కాగా సాయంత్రం బియ్యం ఉదయం లాగే ఇస్తారు. ఇవిగాక ఏదైనా కూరగాయ చేయాలి. ప్రతి ఆదివారం మసాలాతో ఉడకబెట్టిన 200 గ్రాముల మాంసం ఇవ్వాలి. 400 గ్రాముల బియ్యం వండి తూకం వేస్తే కిలోగ్రాము అన్నం వస్తుంది. 50 గ్రాముల కందిపప్పు ఒక వ్యక్తికి గట్టి ముద్దలాంటి పప్పు వస్తుంది. సరిపోతుంది- అదే రొట్టె అయితే అయిదు వందల గ్రాముల పిండి ఇవ్వాలి. కాని న్యాయానికి మనకు ఇందులో సగం కూడా రావడంలేదు. రేషన్ తీసేచోటవున్న జవాను తన పైఅధికారుల వాటా ముందుగానే తీస్తాడు. ఆ తర్వాత తన అవసరాలకు అంటే బీడీలు, సినిమాల లాంటివాటికి సరిపడా తీసుకుంటాడు. మిగిలిన రేషన్ తెచ్చి వంటగదిలో పడవేస్తారు. ఆ తెచ్చిన సరుకులో జవానుల కొరకు ప్రత్యేకంగా వంటలు తయారుచేస్తారు. రూల్స్‌ప్రకారం ఖైదీలకిచ్చినంతే వారూ తీసుకోవాలి. కానీ వాళ్ళు ఇష్టం వచ్చినంత పందులు మెక్కినట్లు మెక్కి పాలు తాగిపోతారు. వాళ్ళు తినగా మిగిలిన దాంట్లో, డబ్బులు పుష్కలంగా ఉండే ఖైదీలు వార్డర్‌గాడికి సిగరెట్లు, బీడీలు ఇస్తూ ఆకట్టుకుని తింటారు. మిగిలిన పప్పులో నీళ్ళు, అన్నంలో నీళ్ళు, పెరుగులో నీళ్ళు మన కడుపులో ఉన్న నీళ్ళకు తోడు పోస్తారు. దీన్ని చాలామంది వ్యతిరేకించే ప్రయత్నంచేశారు. డబ్బు బలం ఉన్నవాడినయితే వాడి నోరు తడిపి మూయిస్తారు. అవి లేనివాణ్ణి గంజికొట్లో పడేసి బాధిస్తారు. ఆఫీసర్లకూ ఇందులో వాటా ఉందిగనుక వాళ్ళకూ మంటేకదా అడిగినవాడి మీద!"

"గంజి కొట్టు అంటే?"

"ఒంటరిగా ఒకపక్క ఉంటాయి ఈ గదులు! ఒక్కో గదీ ఆరడుగుల పొడవు, ఆరడుగుల వెడల్పు! అంటే ఒక మనిషి పడుకోవడానికి సరిపడే సైజు. ఇందులో ఓ కుండ ఉంటుంది. అచ్చం మన పోలీసు లాకప్పు లాంటిదే"

"లోపలి ఖైదీలకు బీడీలు, కాఫీపొడి లాంటివి ఎలా వస్తాయి?"

"ఇంటి నుంచి డబ్బు తెప్పించుకోవచ్చు. ఆ డబ్బును ఆఫీసులో ఉంచుతారు. ఖైదీలకు కావలసిన వస్తువులు పదిహేనురోజులకోసారి లిస్టురాయించుకుని తెచ్చి ఇస్తారు"

పోతాలు తలఊపాడు

అప్పటికి చాలామంది ఖైదీలు అక్కడ చేరారు. హనుమంతు చెప్పే మాటలు వింటే

వారిలో చాలామందికి కడుపు మండుతున్నది. అయినావారిలో అదేమని అడిగే దమ్ము ఎవరికీలేదు. ఇంత వివరంగా చెప్పించుకుంటున్న ఇతడయినా ముందుకు వస్తాడేమోనని వాళ్ళ ఆశ! ఇంతకంటే ఎక్కువ వివరాలు అడిగి కూడా చివరకు అందరూ వంటవార్డరుకు లొంగినవాళ్ళేనని వారికీ తెలుసు. అయినా ఆశ సహజం!

జేబుదొంగలు, చిన్న దొంగలు ఆ జైలులో ఎక్కువగా ఉన్నారు. రెండు సంవత్సరాలకు మించి శిక్షపడినవారిని వేరే సెంట్రల్ జైలుకు మార్చుతారు. ఇది డిస్ట్రిక్ట్ జైలు కావడంవల్ల పెద్ద పెద్ద కేసులు గలవాళ్ళు ఇక్కడ ఉండరు. సంవత్సరానికి నాలుగుసార్లు జైలు ముఖం చూసే జేబుదొంగల్లాంటివారు తిరగబడి రేషన్ అడిగితే, వాళ్ళను వచ్చినప్పుడల్లా అధికారులు, జవాన్లు హింసిస్తారు. అందువల్ల ఉన్నంతలో కాళ్ళు, కడుపులు పట్టుకొని, దొరికినప్పుడు సుఖంగా తినడం, దొరకనప్పుడు ఆ నీళ్ళే తాగి బతకడం వారికి అలవాటయింది.

"ఇన్ని వివరాలు మన కళ్ళముందున్నాయి కదా! మనకు న్యాయంగా రావలసినది అడిగితే తప్పేమిటి?" అన్నాడు పోతాలు.

"న్యాయంగా అడిగితేనే తప్పు. అన్యాయంగా అడిగితే తప్పకుండా దొరుకుతుంది. ఇదే జైలులో మహిళా ఖైదీలలో ఒక అవ్వవుంది. తన మహాత్తులతో అధికారులను తన శిష్యులుగా చేసుకుని ఆడిస్తున్నది. నీతి, న్యాయం కొరకు పోరాడిన మరో స్త్రీని అక్కడే గంజికొట్లో నీచంగా హింసించడమేగాదు, ఈ గాడిదకొడుకులంతా కలిసి ఘానభంగం చేశారు. బయట కనీసం కొంతయినా న్యాయం దొరకవచ్చు. ఇక్కడ కష్టం. వీళ్ళు నరరూపరాక్షసులు. సాధారణంగా ఈ జైలుకు వచ్చే ఖైదీలు బయట ఎటువంటి సపోర్టు లేనివాళ్ళవడం వల్ల, లోపల వీళ్లని ఏం చేసినా తమకు నష్టం లేదనే అహంకారంతో అధికారులు పిచ్చికుక్కల్లా కరుస్తుంటారు. ఈ ఖైదీలు కూడా ఏమీ చేయలేక ఎప్పుడు బయటపడదామా అన్న ధ్యాసలోనే ఉంటూ, పెట్టింది తిని బతకడం అలవాటు చేసుకున్నారు"

"నేను మీ అందరికోసం అధికారులమీద తిరగబడతాను. మీరందరూ నావెనుకవుండి సహకరిస్తారా?" అన్నాడు పోతాలు అందరినీ చూస్తూ.

హనుమంతు మరోసారి గలగల నవ్వాడు.

ఖాసిం టోపీ చంకలో పెట్టుకొని బయటకు పోయాడు.

"నీ వెనుక ఉంటారు కాని, దగ్గరగా కాదు... దూరంగా నిలబడి చూస్తుంటారు. అధికారులు బాగా తంతే, కొందరు ఖైదీలు సంతోషించనూవచ్చు. అందువల్ల ఎవరయినా నీకు వెనుక దన్నుగా ఉంటారని ఆశించవద్దు. పిక్ పాకెట్ ఖాసింగాడు అప్పుడే జారుకున్నాడు చూడు!"

ఇంతలో ఇద్దరు యువకులు ముందుకు వచ్చారు.

"అదేమిటన్నాయ్! జరిగే అవకతవకలు ఎదిరించేటప్పుడు అందరం కదలాలి. మనమేం దొంగతనం చేయడంలేదు. కొత్త కోరికలు తీర్చమనడములేదు గదా! పోతాలు నిలబడితే మేం నిలబడతాం" అన్నారు.

"హనుమంతూ! మేం పదిమందిమి ఉన్నాం. మాకు తోడుగా ఏ కొందరు నిలబడినా పోరాడతాం! అందరూ నిలబడరని మాకు తెలుసు. అందువల్ల ధైర్యంగా ఓ ఇరవైమంది నిలబడితే ఇక్కడి నాలుగు వందల ఖైదీల పరిస్థితి మార్చగలం"

"నాకు తెలిసినంత వరకూ కష్టమే! మొదట నేనూ అలాగే అనుకున్నాను. కానీ లొంగి ఉండకతప్పలేదు. నీకు చేతనయితే నిలబడు. ఎందుకంటే నీవెనుక నీ స్వంతమనుములు చాలామంది ఉన్నారు గనుక కొంతలో కొంత న్యాయం జరిగే అవకాశముంది. నేనంటావా... నేను నీకు సహకారంగా ఎప్పుడూ ఉంటాను"

అంతలో వార్డర్ నజీం అక్కడికి రావడంతో అందరూ మాట్లాడటం ఆపేసి కూర్చున్నారు. ఈ మాటలు వింటే నజీంవెళ్ళి అధికారులకు చెప్పడం, వాళ్ళు ఒక్కొక్కరినే పిలిచి తోలు వొలవడం ఖాయమని వారికి తెలుసు. అందుకే ఒక్కొక్కరే జారుకుంటున్నారు అక్కడి




నుంచి.

"ఏంది సమావేశం?" అన్నాడు నజీం నవ్వుతూ.

ఎవరూ జవాబు చెప్పలేదు. నలుగురు తప్ప అందరూ వెళ్ళిపోయారు.

నజీం అనుమానంగా కొత్తవ్యక్తి పోతాలునూ, హనుమంతునూ మార్చి మార్చి చూసి- "ఏదో కుట్ర పన్నుతున్నట్లుందే?" అన్నాడు.

"రైలుప్లేట్లు అమ్ముకుని బతికే వెధవలకు అన్నీ కుట్రగానేవుంటాయి" అన్నాడు హనుమంతు టోపీ తలకు తగిలించుకుంటూ.

"ఖూనీలు చేసి వచ్చేవాళ్ళకు ఏమీ ఉండవు " అన్నాడు ఎగతాళిగా నజీం.

హనుమంతు చురచురా వాడివైపు చూసి- "ఒరేయ్... నిన్ను ఒక్క పోటుతో చంపేయగలనురా! కుక్కల కొడకా! గార్డుగాళ్ళ ధర్మాన నీవు బతుకుతున్నావ్. ఖైదీల రేషన్‌తిని ఊరకుక్కలా బలిసిపోతున్నావ్" అన్నాడు పిడికిలి బిగించి.

"అయితే మీరందరూ ఏదో కుట్ర పన్నుతున్నారన్నమాట. మీరందరూ ఇక ఊరకుక్కల్లా తిందామని ఆలోచిస్తున్నారన్నమాట"

"తంతాన్నాకొడకా" అంటూ లేచాడు హనుమంతు. పోతాలు లేచి హనుమంతు భుజం పట్టి కూర్చుండబెట్టాడు.

"సరే... మీ సంగతేదో చూస్తాను. పనిలోకి రండి" అంటూ వినవిసా వెనుతిరిగి వెళ్ళాడు.

వాడు వెళ్ళిన వైపు చూస్తూ- "తొందరపడ్డావ్ హనుమంతూ" అన్నాడు పోతాలు.

"ఈ తొందరపాటుతోనే ఒకన్ని సఫాచేసి ఇక్కడికి వచ్చాను. ఇక్కడ వీణ్ణి సఫాచేసి, సెంట్రల్ జైలుకు వెళ్తాను" అంటూ ముందుకు కదిలాడు. అతని వెంట పోతాలు కూడా కదిలాడు.

ఇద్దరూ వంట రూంవద్దకు వచ్చేసరికి నలుగురు గార్డులతో ఏదో చెబుతూ వీరివైపు చూపిస్తున్నాడు నజీం. ఇద్దరూ అక్కడకు చేరుతూనే గార్డు ఒకడు పోతాలు కాలరు ఒడిసిపట్టుకుని "ఏం కేసురా?" అన్నాడు.

పోతాలుకు భగభగమండింది. అయినా నెమ్మదిగా— "రిజిష్టర్‌లో రాసి ఉంటారు. వెళ్ళి చూడు" అన్నాడు.

గార్డు చాచి కొట్టాడు పోతాలు దవడమీద. కిందపడిన పోతాలు లేచి దుమ్ము దులుపుకున్నాడు.

"ఒరేయ్ హనుమంతూ! నీ ఖూనీకోరు పనులు ఇక్కడ సాగవురా! మర్యాదగా ఉండు" అన్నాడు ఒక గార్డు ముందుకువచ్చి.

మరో గార్డు వారిమధ్యకువచ్చి- "అనవసరంగా ఎందుకు తొందరపడతారు? పొండి పొండి... ఎవరి పనులు వాళ్ళు చూసుకోండి" అన్నాడు.

పోతాలు, హనుమంతు రొట్టెలు చేయడానికి వెళ్ళారు.

నజీంను చూస్తూ ఆ గార్డు- "ఒరేయ్! నిన్ను మక్కెలిరగతన్నుతారురా! ప్రతి ఒక్కరిమీదా చాడీలు చెబుతున్నావ్?" అంటూ గుర్ణురిమాడు.

నజీం మాట్లాడలేదు. తల వంచుకున్నాడు.

ఆ గార్డు అక్కడినుండి కోపంగా వెళ్ళిపోయాడు.

"మాదర్చోద్‌లు! వీళ్ళ తోలుతీస్తాంలేరా! నువ్వేం భయపడకు. ఈరోజు ఆదివారంకదూ! మటన్ ఫ్రైచెయ్యి! రొట్టెలో నూనె బాగావేసి తివ్పు. ఆకలవుతోంది... తొందరగాకానియ్!" అన్నారు మిగిలిన ముగ్గురు గార్డులూ.

వాళ్ళు తనను సపోర్టు చేసినందుకు మెచ్చుకుంటూ, గుండెకాయ తెప్పించి వేయించమని తన అసిస్టెంట్స్‌కు ఆజ్ఞలు జారీచేశాడు.

ముగ్గురు గార్డులూ పేకపంచుకుని ఆడుకోవడంలో మునిగిపోయారు.

హనుమంతు ఉన్నవైపు నజీం సాయంత్రంవరకూ రాలేదు. వాళ్ళను ఇద్దరినీ ఉదయంనుండీ వంటపనిలోకి రాకుండా చేయదలచుకున్నాడు. తనకు వ్యతిరేకమైనవాళ్ళు అక్కడ ఉంటే, పైఆఫీసర్లకు రిపోర్టు చేయవచ్చు. పైవాళ్ళు తినేవాళ్ళే అయినా నీతిగా ఉన్నట్లు చూపించడానికి దాడి చేస్తుంటారు.

సాయంత్రం ఐదు గంటలకు హెడ్ కానిస్టే

బుల్ వచ్చాడు.

వివరాలు చెప్పాడు నజీం!

"ఇంకేం... ఆ దున్నలను రేపు పొలం పంపితేసరి! సిగ్గు వస్తుంది!" అన్నాడు క్రోధంగా.

వారిద్దరినీ తనవద్దకు పిలిపించుకున్నాడు.

"ఏమర్రా! ఏదో గూడుపుఠాణీ చేస్తున్నారట! బయట చేసింది చాలక లోపల కూడా చేద్దామనుకున్నారా ఏం? మీ తోలు ఒలిచి, దండెం వేలాడ తీస్తాను జాగ్రత్త!" అంటూ హుంకరించాడు.

కారా కిళ్ళీతో ఎరుపెక్కిన అతడి నోరు ఈ కోపంతో మరింత ఎరుపెక్కినట్లయింది.

"పొండి... రేపటినుంచి బయట పొలంలో పడిచావండి. తేరగా వంటగదిలో కూచుని తింటే ఒళ్ళు కొవ్వెక్కుతోంది" అన్నాడు.

గార్డులు ఇద్దరినీ బయటకు ఈడ్చారు.

సెల్‌లోనికివెళ్తూ- "హెడ్ కానిస్టేబుల్‌కు రేషన్ గురించి చెబితే మంచిదేమో?" అన్నాడు పోతాలు.

"ఈ జైలుకు నంబర్ వన్ కేడీవాడే! వాడికి చెప్పేదేమిటి? చెప్పదలచుకుంటే జైలరుకు చెప్పుకోవాలి. అతగాడయినా ఎంతవరకు వింటాడు?"

"సరే హనుమంతూ! అయ్యేది ఎలాగూ అవుతుంది. రేపు ఉదయం ఈ వంట వార్డరు గాడితో నేను తగవు పెట్టుకుంటాను. నీళ్ళు కెలికితేనే బురద అవుతుంది. ఒడ్డున కూర్చుంటే నీళ్ళే కనిపిస్తాయి"

"తొందరపడుతున్నావేమో పోతాలూ! వీళ్లందరూ తోడు దొంగలే! బయటినుండి మనకు సహాయం లేకుండా ఇక్కడ ఏమీ చేయలేము"

"అలాగని జరిగే అన్యాయం చూస్తూ కూర్చోవడం నాకు చేతగాదు. చేతకాకనే ఈ జైలుకు వచ్చాను. ఈరోజు, నిన్న నేను తిండి తినలేదు. ఇదేవిధంగా వస్తుండవలసివచ్చినా పోరాడుదాం"

"నీ ఇష్టం!" అన్నాడు హనుమంతు.

ఇద్దరూ సెల్‌కు వచ్చేసరికి అక్కడ కొందరు ఖైదీలు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. వీరినిచూసి "అప్పుడే వంట అయిందా?" అన్నారు.

హనుమంతు చెప్పాడు వివరంగా.

"నాయనోయ్! మనందరంకలిసి మధ్యాహ్నం మాట్లాడిన విషయాలు తెలిస్తే అందరినీ బాదేస్తాడురా" అన్నాడు ఖాసిం భయపడుతూ.

వీరిద్దరూ మాట్లాడలేదు. ఈ తగవునుండి ఎలా తప్పించుకుందామా అని హనుమంతు ఆలోచిస్తున్నాడు. ఏవిధంగా ఈ అన్యాయం ఎదిరిద్దామా అని పోతాలు ఆలోచిస్తున్నాడు.

ఆరున్నరకు గంటకొట్టారు. బిలబిలమంటూ నాలుగు వందల ఖైదీలు కంచం, గ్లాసులతో నీళ్ళతొట్టి వద్దకు పరుగెత్తారు. అవి కడిగి వరుసగా నిలబడ్డారు. పోతాలు వరున వచ్చేసరికి మాంసంలో పులుసు-ఎముకలుతప్ప మరింకేంలేవు. పోతాలుకే కాదు ఎవరికీ మాంసం అంది ఉండదని అతను ఊహించాడు. అడుగుదామా అనుకుని కూడా, రాత్రి మిగిలినవారితో సంప్రదిద్దామనుకున్నాడు.

దొరికిందే మహాప్రసాదంగా ఖైదీలు ఆబగా తింటున్నారు. చివర్న వచ్చిన వారిని విదిలించికొడుతూ 'మిగిలిందిదే' అంటున్నాడు నజీం! వాళ్ళు బతిమలాడుతున్నారు- వంటగది నుంచి తెచ్చిపెట్టమని. గార్డువచ్చి బెదిరించేసరికి పెట్టిందే చాలనుకుని నీరసంగా దూరంగావెళ్ళి తినసాగారు. పోతాలు ఆ మాంసం పులుసుతో కొంత అన్నంతిన్నాడు. ఉదయం, అంతకుముందు రాత్రి అన్నం తినకపోవడంతో కాలుతున్న కడుపుకు కొంత అన్నం పట్టించగలిగాడు. ఆ మాంసం, కారం పసుపు వాసనతప్ప, మసాలా వాసన లేదు. మసాలా దట్టించిన కూర వారికి వంచరని కూడా పోతాలుకు తెలిసిపోయింది. తినగా మిగిలిన అన్నం నాగన్నకు పెట్టాడు.

రాత్రి సెల్ మూసేసరికి ఎనిమిదయింది. కిటికీ వద్దకు వెళ్ళి చీకట్లో బయటకు చూస్తూ ఆలోచిస్తూ నిలబడ్డాడు.

* * *

ఉదయం హనుమంతునూ, పోతాలునూ




# రిఫ్రిజిరేటర్ - మీ జీవిత భాగస్వామి

ఆల్విన్ రిఫ్రిజిరేటర్ మీకు సరియైన తోడు. సాంకేతికంగానూ, విశిష్టతలోనూ పనితనంలోనూ ఎదురులేనిది. వాడుకలో ప్రతి ఆల్విన్ రిఫ్రిజిరేటర్ ఒక మణిపూస. ఆల్విన్ ఎన్నుకోండి. మీరు చిరకాలం హాయిగా కలసి ఉంటారు.

ప్రత్యేక లక్షణములు:-

- హిటాచీ కంపెనీ వారిచే నిర్మించబడిన కంప్రెసర్.
- త్వరితగతిని చల్లబరిచే సమర్థనీయమైన "రోల్ బాండ్ఫ్రీజర్
- స్టెబిలైజర్ అవసరము లేకుండా 170 నుండి 250 వోల్టుల వరకు పని చేయు శక్తిగలది.
- కేవలము మీట నొక్కితే చాలు. దానంతటదే మంచు కరిగిపోవును.
- వీటన్నిటితో బాటు ఏడు సంవత్సరముల గ్యారంటీ.
- ఇంకా దేశవ్యాప్తంగా సాంకేతిక సర్వీసు సౌకర్యం.

మీకు పసందైన రంగులలో 165 మరియు 300 లీటర్లలో సింగిల్‌డోర్ డబుల్ డోర్‌లలో లభ్యమవుతుంది ఆల్విన్ రిఫ్రిజిరేటర్.



**7 సంవత్సరాలు గ్యారంటీ**

IS 1476




**H ఆల్విన్**




*అన్ని వేళలందు ఆల్విన్*

MAA(S) H ALN TEL 78 86

పొలానికి పంపారు జైలు అధికారులు! వారి వెంట గార్డు ఒకడు బయలుదేరాడు. మొత్తం ఆ జట్టులో ఎనిమిదిమంది ఉన్నారు.

జైలు గేటుదాటి, మెట్లుదిగి వచ్చిన తరువాత అందరినీ పరిశీలించి, గార్డు సంతృప్తిగా తలాడించి, కొండపక్కనేవున్న మాగాణిలో కలుపుతీయడానికి తోలాడు. గార్డు గట్టుమీదున్న చెట్టుకింద పడుకున్నాడు. ఆజైలునుండి ఖైదీలు పరారి కావడం అతడి సర్వీసులో జరగలేదు. అదే అతడికి ధైర్యం! అయినా చిన్న చిన్న శిక్షలువడ్డవాళ్ళు పారిపోయినా, దొరికి మరింత పెద్ద శిక్షలు అనుభవించవలసి వస్తుంది గనుక, పారిపోవడం జరగదు.

మాగాణిలో నీళ్ళులేవు. గడ్డి పరపరాలాగుతూ మాట్లాడుకుంటున్నారు. మరికొంత దూరంలో రైతుల పొలాల్లో పనిచేసేవారు ఈ ఖైదీలను చూస్తున్నారు. జైలువున్న కొండ ఒకవైపు, రెండోవైపు పట్టణం, మూడోవైపు సన్నగా పారుతున్న నది, నాలుగోవైపు పొలాలున్నాయి. నది అవతలి పొలాలు, ఊర్లు కన్పిస్తున్నాయి. పోతాలు లేచి చుట్టూ చూశాడు. పారిపోవడానికి కావలసినంత అవకాశంవుంది. కాపలాగార్డు నిద్రపోతున్నాడు. దూరంగా రైతుకూలీలు వీరు పారిపోయినా పట్టించుకోరు. పోతాలు మనస్సులో ఆ ఊహ మెదిలింది. ఈ కూడు తిని బతికేకంటే పారిపోతే మంచిదనిపించింది. కాని వెంటనే ఆ ఊహ మార్చుకున్నాడు. పారిపోతే ఎంతదూరం వెళ్ళగలడు? ఈ దుస్తుల్లో ఈ ప్రాంతాలలోనే దొరకవలసి వస్తుంది. లాకప్‌లోపెట్టే చిత్రహింసలకు తగ్గకుండా, వీళ్ళూ చిత్రహింసలు పెడతారు. తలవంచుకుని కలుపు పెరకసాగాడు. అతడి ఊహ అర్థం చేసుకున్నట్లుగా హనుమంతు చిన్నగా నవ్వాడు.

"ఏం లాభంలేదు పోతాలూ! మహాఅయితే ఒకరోజుకంటే ఎక్కువ దాక్కోలేవు. ఆ తర్వాత దొరికితే కీళ్ళువిరిచి, ఆస్పత్రిలో కట్టుకట్టించి, 'సెల్ఎక్కి కింద పడ్డాడ'ని పుకారు పుట్టిస్తారు. రెండు సంవత్సరాలు కళ్ళు మూసుకుంటే బయటపడవచ్చు. తొందరపడటం మంచిదికాదు"

"నాకా ఉద్దేశంలేదు. బయట ప్రపంచం చూసి మూడురోజులయింది. అందువల్ల చుట్టూ చూస్తున్నాను" అన్నాడు పోతాలు దాటవేస్తూ.

హనుమంతు పలకలేదు. దూరంగావున్న గార్డు వీరివద్దకు వచ్చాడు. బెల్టు సరిచేసుకుంటూ, "ఎంతవరకు పని అయిందర్రా?" అన్నాడు అందరినీ చూస్తూ.

"దొడ్డికిపోయేదాకా అయింది" అన్నాడు పాతఖైదీ ఇస్లాం.

"అంతేలేరా! తిన్నది అరక్కుంటే వీపువగిలేదాకా అవుతుంది" అన్నాడు గార్డు నవ్వి.

"వీపులు వగలబాదడానికితప్ప మీరెందుకు పనికివస్తారులే!" అంటూ ఇస్లాం గట్టుఎక్కి-."ఒక దమ్ములాగాలి. ఒక ముక్కవెయ్యిసారూ" అన్నాడు.

గార్డు జేబులు వెతికి, అందులో ఒక బీడీ దొరికించుకుని ఇస్లాం చేతిలో పెట్టాడు. అగ్గిపెట్టె కూడా అతడివద్దే తీసుకుని బీడీ వెలిగించి దమ్ములాగాడు.

"ఇంకా టైంకాలేదా?"

"ఏరా! అప్పుడే పొట్టలో ఎలుకలు పరుగెడుతున్నాయా?"

"అదేందయ్యోవ్! నిన్న సాయంత్రం ఆరు గంటలకు గంజి మెతుకులు నాలుగేసి, ఇంత వరకూ పొట్ట మాడ్చిందిచాలక ఇంకా అడుగుతున్నావా?"

నారాయణ మాటలకు గార్డు వగలబడి నవ్వాడు. లాఠీ పైకి కిందకూ ఊపాడు. ఆ లాఠీతోపాటు తోలుతప్ప రక్తంలేని అతని ఎముకలగూడు కూడా కదిలింది. కట్టెకు తగిలించినట్లున్న అతడి తలమీది టోపీ, ఒక ఊపు వూగింది.

"పదర్రా! మీ సంగతేమోగానీ, నాకుమాత్రం మహా ఆకలిగావుంది. ఈ దరిద్రపు ఉద్యోగం వేళకు తిండిలేకుండా చేస్తున్నది" అన్నాడు. అందరూ గట్టుమీదకు చేరారు. పాతబడిపోయిన ఇంజన్ శబ్దం చేస్తున్నది. పంపుగుండా బయటకు నీళ్ళు చిమ్ముతున్నది. అందరూ ఇంజన్ రూంవద్దకువెళ్ళి కాళ్ళు, చేతులు కడుక్కున్నారు. జైలు లోపలకు వచ్చేసరికి పదిన్నర గంటలయింది. ఆపాటికి




లోపల ఖైదీలు అన్నంతిని తీరిగ్గా కబుర్లాడు కుంటున్నారు. ఎనిమిదిమంది కంచాలు తీసు కుని వంటగది ముందు నిలబడ్డారు. నజీం మరో ఇద్దరు అన్నంతెచ్చి వారి కంచాలలో పడేశారు. గ్లాసులో పప్పుచారు పోశారు. అందు లోనే పెరుగు కూడా పడేశారు. పోతాలు అన్నం పట్టిచూశాడు. పాచిపోయిన అన్నంలా నీళ్ళు ఓడుస్తున్నది. వేడిమీద అయితే తినడం సాధ్య మవుతుందేమోగానీ, చల్లారిన ఆ నీళ్ళ అన్నం తినడం సాధ్యంకాదని అతను అనుకున్నాడు. పప్పుచారులో పప్పులేదుగానీ, నీళ్ళున్నాయి.

"ఇది అన్నమేనా?" అన్నాడు నజీం వైపు చూస్తూ పోతాలు.

"కాదని ఎవడన్నాడు?" అన్నాడు నజీం కళ్ళెగరేసి.

"ఇది అన్నమే అయితే మాముందు తిని చూపించు" అన్నాడు పళ్ళెం చేతపట్టుకుని అతని దగ్గరగావచ్చి.

"ఏం కొడతావా ఏమిటి?" అన్నాడు నజీం వెనకడుగేసి.

లోపలున్న గార్డులిద్దరు బయటకువచ్చారు.

"ఏమిటి" అన్నాడు ఒకడు వార్డర్‌వైపు చూస్తూ.

"వీడికి అన్నం బాగోలేదట" అన్నాడు నజీం చూపిస్తూ.

"మర్యాదగా మాట్లాడు. వాడూ, వీడు ఏమిటి? పేరుపెట్టి పిలవలేవూ?"

"ఏం పేరుతో పిలవాల్రా? జైలుకూడు ఒక పూట తింటే మీకు మకురు ఎక్కుతుందిరా" అన్నాడు గార్డు పోతాలు దగ్గరగావచ్చి "ఏందోయ్... ప్రధానమంత్రి ఇంటినుండి క్యారియర్ తెప్పించాలా ఏమిటి? దొంగనా కొడుకులకు ఈ కూడు పెడితే చాలదేంరా" అంటూ మెడ పట్టుకున్నాడు.

పోతాలు మెడ విదిలించి అతన్ని పక్కకు తోశాడు. "ఇక్కడ అందరూ దొంగనాకొడుకులే ఉన్నారు. మంచివాళ్ళెవరున్నార్రా?" అన్నాడు గట్టిగా.

"మాకు నీళ్ళకూడు పడేసి మీరంతా పందుల్లామెక్కి తింటున్నారు. దొర దగ్గిరే తేల్చుకుందాం" అంటూ పళ్ళెం చేతపట్టుకుని ముందుకు నడిచాడు. అతని వెంట ఎనిమిదిమందిలో ఆరుగురు కదిలారు. హనుమంతు నెమ్మదిగా వెనుక కదిలాడు. ఆఫీను ముందు నిలబడి అందరూ పళ్ళేలు కిందపెట్టారు. నజీం వంటగది లోనికి ఉరికి అదురుతున్న గుండెను చేతపట్టుకుని, బెదురు తగ్గడానికి సిగరెట్ వెలిగించాడు. గార్డులిద్దరూ అటువైపు రాకుండా తప్పుకున్నారు.

హెడ్ కానిస్టేబుల్ అక్కడకు వచ్చాడు "ఏమిటి" అన్నాడు కళ్ళెగరేసి.

"ఇది అన్నమో కాదో చూడండి. ఈ అన్నం తిని మేమేం పని చేయగలం?" అన్నాడు పోతాలు చేతిలోకి అన్నంతీసి చూపిస్తూ.

"దీనికేమయింది?"

"నీళ్ళు కారడంలేదా? పులిసిపోయిన అన్నంలాగా లేదూ?"

హెడ్డు చేతితో అన్నం మెతుకులు పట్టిచూశాడు. "బాగానే ఉందికదా! కాకపోతే మెత్తగా అయింది"

గార్డులు బిలబిలమంటూ అక్కడకు పరుగెత్తుకొని వచ్చారు. ఖైదీలు చాలామంది తోసుకు వచ్చారు. వారిని పొమ్మని గార్డులు లాఠీలతో అదిలిస్తూ, బెదిరిస్తున్నారు. కొందరు ఖైదీలు జనంమధ్యలో నిలిచి ఈలలువేస్తున్నారు.

పరిస్థితి శృతిమించుతుందేమో అనుకున్నాడు హెడ్డు. ఆఫీసుకు ఇంకా జైలర్‌గానీ, అసిస్టెంటుగానీ రాలేదు. వారు వచ్చేవరకు పరిస్థితి ఇలావుంటే తమమీద విరుచుకుపడతారు. అలాగని ఫిర్యాదు చేసేవాళ్ళమీద దాడిచేస్తే మరింత ఉద్రిక్తంగా తయారవుతుంది. అందువల్ల మిగిలిన ఖైదీలవైపు వేలు చూపి 'మారో' అన్నాడు గార్డులతో.

పదిమంది గార్డులు లాఠీలతో ఖైదీలను తోసి వీపులమీద బాదారు. ఖైదీలు గార్డుల మీద తిరుగబడటంతో రణగొణధ్వనిగా తయారయింది. కాపలా గార్డులు మరో పదిమంది పరుగున వచ్చారు. అందరూ కలిసి ఖైదీలను లోపలకు తోసి తలుపులు బిగించారు.

సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి ఒక కాలు ఎగరేస్తూ వచ్చాడు. అతన్ని చూస్తే చుక్కదున్నపోతు జ్ఞప్తికి వస్తుంది. నల్లతుమ్మ మొద్దులావున్న అతడి శరీరంమీద యూనిఫారం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది. ఇటు గార్డులను, అటు ఖైదీలనూ, వారిముందున్న అన్నం పళ్ళేలనూ చూసి 'క్యా?' అన్నాడు హెడ్డుతో.

"అన్నం మెత్తగా అయిందనీ, తినమనీ గొడవచేస్తున్నారు సాబ్! ఖైదీలనందరినీ పురికొల్పారు. ఖైదీలంతా గార్డులమీద తిరుగబడ్డారు"

ఆఫీసు వసారాలో ప్రభాకరరెడ్డి నిలబడ్డాడు. పోతాలు వైపుచూసి ఉర్దూలో గర్జించాడు.

పోతాలు అతడి వైపుచూసి 'నాకు ఉర్దూరాదుసార్!' అన్నాడు గట్టిగానే.

"ఒళ్ళు చిటచిటలాడుతుందా అంటున్నాను" అన్నాడు సబ్‌జైలర్.

"సార్! ఈ అన్నం మీరు తింటారా? మేం దొంగలంకాదు, రౌడీలమూ కాదు. ఒకవేళ అయినా మాకు రావలసిన రేషన్, సక్రమంగా ఇవ్వాల్సివుంది. ఇవ్వకుండా నీళ్ళకూడు, నీళ్ళ పప్పు, నీళ్ళ పెరుగు, వడగట్టని నీళ్ళూ మాముందు పడేసి వంటవార్డర్‌తో షరీకై గార్డులందరూ జల్సాగా తింటున్నారు. మాకు సక్రమంగా తిండి పెట్టించాల్సిన బాధ్యత మీది" అన్నాడు ఆవేశంగా పోతాలు.

"పైకిరా" అన్నాడు సబ్ జైలర్. దగ్గరగా వస్తూనే లాఠీతో వీపుమీద రెండుసార్లు బాదాడు.

పోతాలుకు ఆవేశం వచ్చింది. అది జైలనీ, అక్కడ తాను బందీ అనీ ఆలోచించలేకపోయాడు. వీపున తగిలిన దెబ్బలకు అప్పటికే చర్మంచిట్లి రక్తంకారి, చొక్కా తడిసింది. ఆ రక్తంచూసి మరింత ఆవేశం పెరిగింది. కింద పడ్డ పళ్ళెం తీసుకొని సబ్‌జైలర్ రొమ్ముమీద బాదాడు. మీదపడి చేతితో గ్రుద్దాడు.

కిందపడిన సబ్ జైలర్‌నుచూసి గార్డుల్లో వణుకు ఆరంభమయింది. కిందనున్న ఖైదీలు గార్డులమీదపడేసరికి వారితో తలపడవలనవచ్చింది. పది నిముషాలు హోరాహోరీ పోరాటం తర్వాత ఖైదీలు లొంగిపోయారు. పోతాలును, మిగిలిన ఖైదీలనూ పెడరెక్కలు విరిచికట్టి, లాఠీలతో వీపులుచిట్లి రక్తంకారుతున్నానరే బాదారు గార్డులు. సబ్ జైలర్ ఒగర్చుకుంటూ ఆఫీసులోకి వెళ్ళాడు. ఊచలమధ్యనుండి చూస్తున్న మిగిలిన ఖైదీలు భయంతో నోటమాటరాక నిలబడ్డారు.

ఎనిమిదిమందినీ తీసుకెళ్ళి ఒక్కొక్కరినీ ఒక్కొక్క గదిలో పడవేసి, చేతులకు, కాళ్ళకూ కడియాలు తగిలించారు.

జైలులోని మిగిలిన ఖైదీలను జట్లు జట్లుగా ఆఫీసుకు పిలిపించాడు సబ్ జైలర్. ఒక్కొక్కరినీ వరుసగా నిలబెట్టి బాదారు గార్డులు. "ఒరేయ్! బయటకుపోతే మీకు కూడు దొరకదు. సుష్టుగా జైలులోతిని మామీదే తిరుగుబాటు చేస్తారా? మీ తాత సొమ్ము ఇక్కడ దాచిపెట్టామనుకుంటున్నారా? కొడుకుల్లారా... కీళ్ళు విరిచేస్తాను నోరెత్తితే! పోతాలుగాడికి సహకారంగా మాట్లాడినవాళ్ళు ఎవరెవరో చేతులెత్తండ్రా!" హూంకరించాడు సబ్ జైలర్.

అతడి హూంకరింపుకు అతడి పొట్ట వెనుకకూ, ముందుకూ ఊగుతున్నది.

ఎవరూ పలుకలేదు. వంట వార్డర్ ముందుకు వచ్చి పోతాలు, హనుమంతులతో క్రితంరోజు ఎవరెవరు మాట్లాడుతున్నారో, వారందరినీ చూపించాడు.

వారిని ముందుకు ఈడ్చారు గార్డులు.

"నాకేం తెలియదు దొరగారూ! వాళ్ళు ఏదో మాట్లాడుతుంటే నేను దూరంగా ఉండి వింటున్నాను" అన్నాడు ఖాసిం చేతులెత్తి దండంపెట్టి.

"మాదర్చోద్! పిక్‌పాకెట్‌గాడివి నీవూ అన్నం అడిగేవాడివయ్యావ్? తన్నండి కొడుకుని" సబ్‌జైలర్ ఆర్డర్‌కాగానే, కిందపడేసి గాడిదను బాదినట్లు బాదారు గార్డులు. చేతులు, కాళ్ళు కట్టి గంజి రూము వైపు లాక్కెళ్ళారు.

మిగిలిన ఖైదీలను హెచ్చరించి పంపేశారు. తలలు వాల్చుకుని అందరూ ఎవరి స్థానంలోనికి వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఒరేయ్ నజీం... ఇలారా!" అన్నాడు సబ్ జైలర్. నజీం భయపడుతూనే ముందుకు








వచ్చాడు. ఒక పళ్ళెంలోని అన్నం చూపించి "అది నువ్వు తింటావా?" అన్నాడు.

నజీం పలుకలేదు. ఏమంటే ఏవిధంగా మారుతుందోనని అతడి భయం.

"అరే లుచ్చా! కూడు ఎందుకిట్లా వండావ్?" గాండ్రించాడు.

నజీం ఏం చెప్పగలడు? అంతా గార్డులు తినేశారని చెబితే, రేపు నజీంను పచ్చడి చేస్తారు గార్డులు. గార్డులు తినగా మిగిలింది బడా ఖైదీలకు వడ్డించానంటే జైలర్ వీపు చిట్లకొడతాడు.

"రేయ్! రేపటినుండి కూడు శుభ్రంగా లేకుంటే, నిన్ను ఉడకేస్తాను."

"అలాగే దొరా!" అన్నాడు నమ్రతగా నజీం.

"జావ్!" ఆఫీసరు అరుపుకు పరుగు లాంటి నడకతో వంట రూంవైపు నడిచాడు.

గార్డులంతా వరుసగా నిలబడ్డారు. వారిలో కొందరి గుడ్డలు పెనుగులాటల్లో చినిగాయి. ఒకడి టోపీ రెండు ముక్కలయింది. కొంత మంది చేతిలో లాఠీలు విరిగినవి ఉన్నాయి.

హెడ్డును ముందుకు రమ్మన్నాడు సబ్‌జైలర్.

"రేషన్ సక్రమంగా తీసుకోవడంలేదా?"

రేషన్‌లో ఒక పాలు తమరింటికే చేరుతున్నాయని అతడు చెప్పలేదు. జైలుకు వచ్చే వంద లీటర్ల పాలులో తమరింటికి మూడు

లీటర్లు, జైలర్ ఇంటికి మూడు లీటర్లు పోతున్నాయని చెప్పలేదు.

అందువల్లే తల ఊపి "సక్రమంగానే తీసుకున్నాం సాబ్" అన్నాడు నమ్రతగా.

"మరి కూడు ఎందుకిట్లా అయింది?"

"ఈరోజు పొరపాటు జరిగి, అన్నం మెత్తగా అయినట్లుంది సాబ్! రోజూ బాగానే ఉంటుంది. మేమందరం ఉదయం ఇక్కడే తింటాంకదా సాబ్! అన్నం బాగులేకుంటే ఎందుకు ఫిర్యాదు చేయం?"

హెడ్డు మాటలకు తల ఊపి సబ్‌జైలర్ ఆఫీసులోనికి దారితీశాడు. హెడ్డు గంజి రూముల వైపు వెళ్ళాడు.




సాయంత్రం ఐదుగంటలు దాటింది. చలి వణుకు అప్పుడే ఆరంభమయింది. సబ్‌జైలర్ సాయంత్రం రెండో రౌండుకు వచ్చే సమయం. ఉదయం బీభత్సంవల్ల నిర్లక్ష్యంగా తిరిగే గార్డులు కూడా- అటెన్షన్‌లో ఉన్నారు. సబ్‌జైలర్ వరుసగా ఐదు సెల్లులు తనిఖీ చేశాడు. ఖైదీలు చేతులు కట్టుకుని నిలబడ్డారు. గార్డులు రక్షణగా అటు- ఇటు నడుస్తున్నారు. ముందు హెడ్‌కానిస్టేబుల్ ఉన్నాడు.

ఆవరణలోనికి వచ్చి, "రాత్రి గార్డులు ఇక్కడ పడుకుంటున్నారా?" అన్నాడు సబ్‌జైలర్. హెడ్డు తల ఊపాడు.

అక్కడి నుండి గంజి రూముల వైపు కదిలారు. వంట రూం ముందుగానే వెళ్ళాలి. వంట రూంలోనికివెళ్ళి వంట చూశాడు. ఆ పూట అన్నం ఆరపోసిన ముత్యాల్లా వుంది. కూర ధనియాల పొడితో ఘుమాయిస్తున్నది. కల్తీలేని పిండితో వేగిన రొట్టె మంచి వానన వస్తున్నది.

"ఇంత బాగావుంటే, బాగులేదంటారేం ఈ గాడిదలు?"

సబ్‌జైలర్ మాటలకు హెడ్డు తలూపాడు— "సాబ్! ఈ బడాచోరులు బయట తేరగా దొంగసొత్తు తిని, ఇక్కడికి వచ్చి అదే తిండి కావాలంటారు" అన్నాడు.

గంజిరూంలలో మొదటి రూం దగ్గరికి వచ్చారు. పోతాలును విరగకట్టి వేశారు. ఉండలా పడివున్నాడు. పారిపోతాడేమోనన్నట్లు ఇనుప ఊచలకు బిగించారు.

లాఠీతో అతన్ని కదిపాడు సబ్‌జైలర్ "రేయ్! మకురు అణిగిందా?"

ఆ విరగకట్టి వేయడంవల్ల బాధగా ఉన్న పోతాలు సబ్‌జైలర్ మాటలకు ఆవేశపడ్డాడు. వీళ్ళు ఇంతకుమించి ఏం చేస్తారు? చంపుతారా? వీళ్ళతో అమీతుమీ తేల్చాల్సిందే! లొంగిపోతే ఇంకా హింసించి ఆనందించగలరని భావించాడు.

కరుకుగానే జవాబిచ్చాడు. "మకురు ఎవరికున్నదీ ఈ జైలు చెబుతూనే ఉందికదా! మరి అణగాల్సింది ఎవరికో మీరే చెప్పాలి?"

"కుక్కా! ఇంకా మాటలు తగ్గలేదుబే!" అంటూ హెడ్డు లాఠీతో పోతాలు పొట్టలో పొడిచాడు. పోతాలు ఒక మూలుగు మూలిగాడు హృదయవిదారకంగా.

"వీడి వీపుకు కారం రాయండి. ఈ గాడిదలకు తెలివి తెప్పించాలి. లేకుంటే రోజుకొకడు తిరుగబడతాడు" అని ముందుకు నడిచాడు సబ్‌జైలర్. రెండో రూంలో హనుమంతు ఉన్నాడు. జైలర్ అడిగిన ప్రశ్నకు హనుమంతు జవాబివ్వలేదు. తాను అనవసరంగా ఇందులో ఇరుక్కున్నానని అతడు భావిస్తున్నాడు. వాళ్ళు పదిమంది ఉన్నారు. పైగా బయట కూడా వాళ్ళు నానాబాధలు పడి వచ్చారు. వారికిదో లెక్కకాదు. తాను హత్యలు చేయగలడు. కాని ఇలాంటి బాధలు భరించడం సాధ్యంకాదు. అలాగని బతిమాలి ప్రాధేయపడటం అతడికి సిగ్గనిపించింది. అందువల్లే ఎటూ మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

"వీడికి కూడా కారం అంటించండి!"




వరుసగా తొమ్మిది గదులు తిరిగాడు. వారిలో ఖాసిం తప్ప ఎవరూ జవాబివ్వలేదు. ఖాసిం మాత్రం తనను విడవమని ప్రాధేయపడ్డాడు. ఉదయం చూద్దామని తిరిగివెళ్ళాడు. అతడికి మాత్రం కారం పూయడం నుంచి మినహాయింపు దొరికింది.

రాత్రి ఏడుగంటలు కావచ్చింది. వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. ఉదయం నుండి కూడు లేదు. వచ్చిమంచినీళ్ళుకూడా లేవు. దెబ్బలకు పూసిన కారం భగ భగ మంట మండుతున్నది. ఆ కారం పూతకు తట్టుకోలేక అందరూ భయంకరంగా అరుస్తున్నారు. వారి అరుపులు వింటూ హెడ్డు పైశాచికంగా నవ్వసాగాడు.

"ఒరేయ్! జైలు అధికారుల మీదే తిరుగబడతార్రా! మీ బతుకెంతరా! మిమ్మల్ని ఖైమా చేసి ఖైదీలకే తిరిగి వండిపెట్టగలంరా! తిండి కావాల్రా? మంచి తిండి... తినండి తినండి" అన్నాడు.

అతడి నవ్వుకు ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది.

వాళ్ల ఎదురుగానేవున్న అవరణలో కుర్చీ వేసుకున్నాడు. చలికోటు తొడుక్కుని చెవులకు మఫ్లర్ చుట్టుకున్నాడు. అయినా చలి చంపేస్తున్నది. మిగిలిన గార్డులు కూడా చలికోట్లు వేసుకొని ట్యూబులైటు వెలుతుర్లో పేకాట ఆడుకుంటూ కూర్చున్నారు. జైలు గోడ మీదున్న సెంట్రీ రూం నుండి సెంట్రీ అప్పుడప్పుడు కేకలేస్తున్నాడు. అతడి కేకకు ప్రతిగా, మిగిలిన పోస్టుల నుండి కూడా కేకలు వినబడుతున్నాయి. జైలులో అనేకమందికి ఆ పూట నిద్రపట్టక మత్తుగా పొర్లాడుతున్నారు. నజీం తన విలువకు తానే మురిసిపోతూ నిద్రపట్టక బల్లిలా కరుచుకుని పడుకున్నాడు.

కారంమంట చల్లారిందో, లేక ఖైదీలు మగతలో వద్దారోగానీ మూలుగు పెద్దగా వినిపించడంలేదు. ఒకరిద్దరు కొద్దికొద్దిగా మూలుగుతున్నా చాలామంది మూలగడంలేదు. హెడ్డు అనుమానంగా తలుపుల దగ్గరికి వెళ్ళి లాఠీలతో వూచల మీద కొట్టి చూశాడు. ముగ్గురు తలలెత్తి చూశారు. కానీ ఐదుగురు తలలు కూడా ఎత్తలేదు.

అనుమానంతో గార్డుల్ని కేకవేసి—"కాంపౌండర్‌ను పిలు" అన్నాడు హెడ్డు అదుర్దాగా. చచ్చారేమోనని అతడి భయం. ఖైదీలు చస్తే, అందులో గంజిరూంలో చస్తే, తాము తిన్నగా పోలీసు లాకప్‌లోనికి వెళ్ళి, మరికొద్దిరోజుల తర్వాతయినా ఇదే జైలులో ఖైదీల రూపంలో అడుగుపెట్టవలసి వస్తుందని భయం.

కాంపౌండర్ అదరబాదరాగా వచ్చాడు "క్యాసాబ్?" అన్నాడు.

"అందరినీ పరీక్షించండి... ఏ గాడిదకొడుకయినా చచ్చాడేమో"

గార్డులు తాళాలు తీసి తలుపులు తెరిచారు. అందరూ బతికే ఉన్నారు. ఎవరూ చావలేదని చెప్పాడు కాంపౌండర్.

"చచ్చే అవకాశం ఏమయినా ఉందా?" అన్నాడు హెడ్డు.

"గూటాల్లా ఉన్నారు. వాళ్ళెందుకు చస్తారు"

"పాణీ మార్‌రే!" అన్నాడు హెడ్డు అరుస్తూ. తొట్టిలో నీళ్ళు చల్లగా ఉన్నాయి. చెయ్యి పెడితే జివ్వుమంటున్నాయి. ఇంజన్ స్టార్ట్ చేశారు. గొట్టం చేతపట్టుకుని ఒక గార్డు ఖైదీల మీదకు తిప్పాడు. చల్లని నీళ్ళు వారి శరీరంమీద పడుతుంటే జివ్వుమంటున్నాయి నరాలు. అసలే చలి! వణికిస్తున్న ఆ చలిలో చల్లటి నీరు నెత్తిమీద నుండి, కిందిదాకా కారుతుంటే ఖైదీలు భయంకరంగా అరుస్తున్నారు. కొందరయితే హెడ్డుకు దండం అని అరుస్తూ తమను విడిచిపెట్టమంటూ కేకలేస్తున్నారు.

పోతాలు కండ్ల నుండి నీరు కారసాగింది. అరవడానికి బదులు పండ్లు అదిమిపట్టాడు. వెచ్చని నీరు దవడల మీదుగా కిందకు సాగింది.

పక్కనున్న హనుమంతు మూలుగుతూ అరుస్తున్నాడు. కానీ అతడు లొంగిపోయి అరవడంలేదు. సబ్‌జైలర్‌నూ, హెడ్డునూ, వారి కుటుంబాల్ని బూతులు తిడుతున్నాడు. బయటకు వస్తే పొట్టలో కత్తి దించుతానంటున్నాడు.

అరగంటసేపు అలా ఆ చన్నీళ్ళలో వారిని

ముంచారు. రూంలలో నుంచి నీరు బయటకు పారి ఆ ప్రాంతమంతా పారుతున్నది.

తెల్లవారుఝాము కావస్తున్నది. నీళ్ళు చల్లిన కొంతసేపు తరువాత చలి అనిపించలేదు. తర్వాత మాత్రం బయటి చలికి తోడు, తడిసిన బట్టలు కూడా కలిపి శరీరాన్ని తొలచి వేస్తున్నాయి. కాని ఒకందుకు వారికి ఆనందంగా ఉంది. ఈ నీళ్ళు చల్లడంవల్ల గాయాలలో ఇరుక్కున్న కారం కొట్టుకుపోయింది. చలివల్ల గాయాలు సలుపుతున్నా కారం తగిలినప్పుడు ఉన్నంత బాధలేదు. వారిలో మత్తు ఆవేశించింది. ఆ మత్తులో చల్లటి ఆ బండల మీద, చల్లని గుడ్డలతో నేల మీద పడి నిద్రపోయారు.

పోతాలుకు మెలకువ వచ్చేసరికి సూర్యుని వేడిమి తలుపుగుండా లోనికి పడుతోంది. వంటగదిలోంచి అరుపులు, వాసనలు వస్తున్నాయి. గార్డులు ఎవరూ ఆ ప్రాంతంలో లేరు. బయట భూమి తడి ఇంకా ఆరలేదు. మంచు తుంపరలు ఇంకా పడుతూనేవున్నాయి.

ఇంతలో గార్డు అక్కడికొచ్చాడు. లోపలకు చూసి "లేచావా?" అన్నాడు కళ్ళెగరేసి.

పోతాలు పలుకలేదు. గార్డువైపొకసారి చూసి తలతిప్పుకున్నాడు.

"మీరుకూడా అనవసరంగా రెచ్చిపోయారయ్యా" అన్నాడు గార్డు. "జైలర్‌ను కొట్టడం మంచిదికాదు. ఆయనను కొట్టకుంటే పరిస్థితి ఇంత తీవ్రంగా ఉండేదికాదేమో?" పోతాలు పలుకలేదు. తనను కాదన్నట్లు గోడవైపు చూస్తుండిపోయాడు. పక్క సెల్లువరకూ వచ్చి ఆగి- "ఏం హనుమంతూ! నువ్వా తొందరపడ్డావేం?" అన్నాడు.

హనుమంతు పండ్లు పటపట కొరికాడు- "తొందరా! కత్తి ఒకటి ఉంటే ఇంకో ఖూనీచేసేవాణ్ని! కానీ సమయానికి లేకపోయింది" అన్నాడు.

"ఇది జైలోయ్ హనుమంతూ... జైలు! మీ వూరనుకున్నావా అందర్నీ చంపడానికి" నవ్వాడు గార్డు. చిన్నగా- "మొత్తానికి సబ్‌జైలరుగాడిని చిత్తుగా తన్నారు. ఏం తన్నులయ్యా, మహామంచి తన్నులు! వాడిని తన్నాలనే గార్డులు చూస్తూ కూడా కొంతసేపు కలుగచేసుకోకుండా నిల్చారు" అన్నాడు ముసిముసిగా నవ్వి.

హనుమంతు అతడివైపు చూశాడు. గార్డు ఎందుకామాట అంటున్నాడు? సహజంగా పై అధికారిమీద కింది ఉద్యోగులకు కోపం ఉంటుంది. ఇతగాడు కూడా అదే చూపిస్తున్నాడా?

"అయితే సమయం, సందర్భం చూడకుండా తన్నారు. అదే మీకు చెరుపుచేసింది" అంటుండగా మరో గార్డు అక్కడికి వచ్చాడు. ఇద్దరూ చెక్‌పోస్టువైపు కదిలారు.

ఉదయం రెండుకు సబ్‌జైలర్ వచ్చాడు. అందరినీ వరుసగా చూశాడు. ఖాసింను లోపలకు పంపించమని చెప్పాడు. "ఏమంటున్నారు?" అన్నాడు హెడ్డుతో.

"ఇంకేం మాట్లాడుతారు సాబ్! నరకానికి దగ్గర్లో నిలబడ్డారు"

హెడ్డు మాటలకు ముఖం కందగడ్డలా మార్చి గార్డులవైపు చూశాడు జైలర్!

"వీళ్ళసంగతి తర్వాత చూద్దాం!" అంటూ ఆఫీసువైపు సాగాడు.

"సాబ్! ఈ గాడిదలకు కూడు పెట్టించమంటారా... వద్దా?"

జైలర్ వెనుతిరిగిచూసి, ఒక్కక్షణం నిలబడి "పెట్టించు" అన్నాడు.

హెడ్డు వంటగదివైపు అడుగులేశాడు. నజీం సలాం చెప్పాడు.

"ఒరేయ్ దద్దమ్మా! వండే అన్నం కొంచెం బాగా వండకూడదేంరా! మరీ అంత నీళ్ళకూడుచేస్తే ఎట్లా తినిచస్తార్రా?" అన్నాడు టోపీ కిందపెడుతూ.

నజీం ప్లేటులో బాగా వేగిన రొట్టె, మసాలా పచ్చడిలో నెయ్యివేసితెచ్చి అతడి ఎదురుగా పెట్టాడు. "సాబ్! అన్నం మంచిగాచేస్తే చాలదని మీకు తెలుసుగదా! మేం ఏం చేస్తాం చెప్పండి"

ఎదురుగానున్న రొట్టెపై దాడిచేసిన హెడ్డు అయిదు నిమిషాలవరకూ జవాబివ్వలేదు. "అబేక్ రోటీదాల్!" అన్నాడు గ్లానుతో నీళ్ళు దట్టిస్తూ. మరొక రొట్టె తెచ్చి పళ్ళెంలో వేశాడు.

 

రొట్టెను, అటు ఇటు తిప్పి విరిచి "అన్నం కొంచెం తగ్గించి పెట్టండ్రా! అన్నం మంచి గుంటే అడగరుగదా!"

"అదేంలేదు సాబ్! అన్నం తగ్గినా జుట్టువ ట్టుకుంటారు. రూల్స్ తెలిసిన దున్నలు జైలు కొస్తే ఇదేతంటా! ఇందులో మేం తినేదేము న్నది" అన్నాడు నజీం.

హెడ్డు తలూపుతూ రొట్టె దట్టించాడు. ఆ రెండు రొట్టెల్లో మరింత తౌడు కలిపితే మూడు రొట్టెలయ్యేవి. ముగ్గురి రేషన్ హెడ్డు ఒక్కడు మింగేస్తున్నాడని అక్కడున్న మిగిలిన ఖైదీలు గుటకలు మింగుతూ చూస్తున్నారు. ఈవి ధంగా వీళ్ళు తింటే ఖైదీలకు నీళ్ళుగాక దొరికేదేమిటి అనుకున్నారు బాధగా.

"వాళ్ళవరకు మంచి అన్నం పెట్టండి. లేదా గంజిరూంలోనే గొడవచేస్తారు. ఈ గొడవ కే చిన్న జైలరు సాబ్ వీపు సావయింది. రేపు పైనుండి ఏం గూటింపు వస్తుందోనని హడలి పోతున్నాడు. పెద్దసాబ్ రేపు డ్యూటీలో చేరుతు న్నాడు. ఆయనవచ్చి ఈ తతంగంచూస్తే గంజిరూంలో నిన్ను పడేస్తాడు" అన్నాడు హె డ్డు నజీంతో.

నజీం ఇచ్చిన సోలెడుపాలూ, పంచదారా కలుపుకుని తాగి తేపుతూ లేచి నిల్చున్నాడు. బయటకువచ్చి తన స్టాఫ్‌రూంలోనికి నడిచా డు.

ఖైదీలను చూడటానికి బంధువులు వచ్చా రు. ఎవరెవరిని కలుసుకోవాలనుకుంటున్నారో వివరాలు రాస్తూ కూర్చున్నాడు. చిన్నగుమస్తా అక్కడికి వచ్చాడు.

తలెత్తి చూసిన హెడ్డు "ఏం?" అన్నాడు.

"ఈరోజు మొత్తం ఎనిమిదిమంది వచ్చారు సార్! అందులో ఇద్దరు ఇచ్చుకోలేమని వదిరూ పాయలే ఇచ్చారు. అరుగురు ఇరవైరూపాయ లచొప్పున నూటఇరవై, ఇద్దరు ఇరవై. మొత్తం ఇదీ" అంటూ డబ్బులు లెక్కపెట్టి టేబుల్ మీద పెట్టాడు.

ఆ డబ్బులు జేబులో పెట్టుకుని- "ఏమేం సరుకులు తెచ్చారో చూడు" అన్నాడు. గార్డు లేచి వచ్చినవారిదగ్గరున్న పండ్లు, బిస్కట్లు తీసిచూశాడు. అందులో గార్డుల వాటా మొ త్తం పక్కనపెట్టారు.

"ఇందులో చిన్నమ్మగారివాటా ఇచ్చి రండ్రా" అంటూ ఒక గార్డుకు బుట్టలో పండ్లు, బిస్కట్‌పాకెట్స్ పెట్టి పంపాడు హెడ్డు. మిగిలి నవి డ్యూటీలోని గార్డులకు వాటాపంచి, తన వాటా నంచిలో వేసుకున్నాడు. టోపీ చేతికి తీసుకుని తలకు తగిలించి లేచాడు.

తాముతెచ్చిన వస్తువులు భాగాలు పంచు కుంటున్నవారిని ఖైదీల బంధువులు చూస్తూ గుడ్లు తేలేశారు. డబ్బుకు డబ్బా లాగారు, వస్తువులూ గుంజుకున్నారు. బయటి పోలీసు లకూ, వీళ్ళకూ తేడా ఏమయినా ఉందా? దొందు దొందే అనుకున్నారు వాళ్ళు.

వీరి ఆలోచనలను తెంచేస్తూ, ఎదురుచూ స్తున్న ఖైదీలు వచ్చారు.

* * *

జైలర్ సెలవు పూర్తిచేసుకుని తిరిగి డ్యూటీకి హాజరవుతున్నాడని తెలియడంతో గార్డు లంతా హాజరయ్యారు. వారి దృష్టిలో పెద్దబా బు కంటే చిన్నబాబే కర్కోటకుడు. జైలర్ కరకుగా వ్యవహరించడు. ఎవరికయినా తగిన గౌరవం ఇస్తాడని వారి ఉద్దేశం! ఆఫీసర్లు కిందనుండి పైస్థాయికి వెళ్ళేవాళ్ళంతా పైకి ముందున్నంత కర్కోటకంగా కన్పించనిమాట నిజమే! కానీ, ఆచరణలోనే అది కనిపిస్తుంది. సబ్‌జైలర్‌స్థాయినుండి ప్రమోట్‌అయి సంవ త్సరం కూడా పూర్తికాని జైలర్ గార్డులదృష్టిలో మర్యాదస్తుడుగా కనిపిస్తాడు. ఎక్కువ మాట్లా డకపోవడం, అవసరమైతే కఠినంగా ప్రవ ర్తించడం అతని సుగుణాలని వారి నమ్మిక! వారిమీద అజమాయిషీ ఎక్కువగా సబ్‌జైలర్ కే ఉండటంవల్ల, తమమీద జులుంసాగించే అతడంటే వారికి మహామంట. ఖైదీలు మీదప డి తంతున్నా వారు పట్టించుకోవడంలేదంటే కారణం అతడిమీదున్న కక్షే!

జైలర్ రామయ్య క్రాస్‌బెల్ట్ సరిచేసు కుంటూ జైలుమెట్లు ఎక్కి ప్రధానద్వారం దగ్గ రికి వచ్చాడు. ద్వారందగ్గర గుమిగూడివున్న గార్డులు అటెన్షన్‌లో నిలిచారు. చిరునవ్వుతో వారిని తేరిపారచూసి, లోపలకు వచ్చాడు. ఆఫీసువద్ద సబ్‌జైలర్ విష్‌చేశాడు. తలవూపి లోనికివచ్చి తన కుర్చీలో ఆశీనుడయ్యాడు.





హెడ్డు ముందుకువచ్చి- "సాబ్! కొందరు ఖైదీలు మన చిన్నదొరమీద తిరుగుబాటు చేశారు" అంటూ జరిగింది వర్ణించి లేనిది కూడా కలిపిమరీ చెప్పాడు.

జైలర్ టేబుల్‌మీద రెండుమోచేతులు మోపి, అతడు చెప్పేదంతా సావధానంగా విన్నాడు. ఊపిరివిడిచి వదిలి లేచి నిలబడ్డాడు. "మిష్టర్ ప్రభాకరరెడ్డీ! రౌండుకు వెళ్ళివద్దామా?" అన్నాడు ముందుకు కదుల్తూ.

అతడివెంట సబ్‌జైలర్, తర్వాత హెడ్డూ కదిలారు. అంగరక్షకుల్లా ఇద్దరు గార్డులు ముందు కదిలారు. వెనుక మరో నలుగురు లాఠీలు ఊపుతూ నడిచారు. సెల్‌వైపు వెళ్ళడానికి అడ్డున్న గేటును తెరచి ఆవరణలోనికి ప్రవేశించారు. ఒక్క ఖైదీకూడా ఆవరణలో లేడు. గార్డులు ఒక్కొక్కడూ ఒక్కొక్క సెల్ ముందు కాళ్ళు కదలకుండా నిలబడివున్నారు. నిశ్శబ్దంగా ఉంది వాతావరణం. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ నవారునేసే మగ్గాలు అప్పుడప్పుడు టకటక మంటున్నాయి.

మొదటి సెల్‌లోనికి అడుగుపెట్టాడు. ఆ సెల్‌లో పదిమంది ఖైదీలు కూర్చునివున్నారు. అందులో ఒకడు పడుకొనివున్నాడు. కూర్చున్నవాళ్ళు లేచి దండంపెట్టారు. పడుకున్నవాణ్ని చూసి "ఏమిటి?" అన్నాడు జైలర్ సబ్‌జైలర్‌ను చూస్తూ.

ప్రభాకరరెడ్డి ముందుకువచ్చి అతనిదగ్గర నిలిచి- "రెండు రోజులుగా జ్వరంసార్! మందులు ఇప్పిస్తూనేవున్నాం. నిన్నటికంటే కొంచెం తేరుకున్నాడు" అన్నాడు.

అతడి చెయ్యి చూడకుండానే ఆరోగ్యం మెరుగయిందని చెబుతున్న సబ్‌జైలర్‌వైపు మిగిలిన ఖైదీలు ఆశ్చర్యంగా చూశారు. వారంరోజులనుండీ అతని ముఖాన కాస్త రంగునీళ్ళయినాపోయలేదు. కాగా రెండురోజులనుండి మాత్రమే జ్వరమంటున్నాడు. అతను ఏ స్థితిలో ఉన్నాడో చూడకుండానే నిన్నటికంటే మేలని చెబుతున్నాడు. వీడు కర్కోటకుని మించిపోయాడని ఖైదీలు అనుకున్నారు.

జైలర్ ఎదురుగానున్న కిటికీవద్దకు వెళ్ళాడు. కిటికీని లాఠీతోతట్టి ఊచలు సరిగా ఉన్నాయో లేదో చూశాడు. బయటకు చూస్తూ నిముషం నిలబడ్డాడు. పాయలుగా పారుతున్న నదిలో ఎండిన ఇసుక తళతళ మంటున్నది.

అక్కడినుండి వెనుతిరిగాడు. అయిదు సెల్లులు చూసి, ఆరో సెల్‌లోకి నడిచాడు. గేటువద్దనే గార్డు అటెన్షన్‌లో నిలిచాడు. ఆ గదిలో వరుసగా గుడ్డలునేసే మగ్గాలున్నాయి. ప్రతి మగ్గం ముందూ ఒక ఖైదీ నిలబడివున్నాడు. టోపీలు తలకుపెట్టుకుని చేతులు కట్టుకున్నారు.

మరికొంత ముందుకుసాగారు. నవారుమగ్గాలు నాలుగు ఉన్నాయి. వాటిమీదున్న మనుసులు లేచి నిలబడ్డారు. దారంకండెలు చుట్టే యంత్రంవరకూ వెళ్ళిచూశాడు.

"పని బాగా సాగుతోందా?" అన్నాడు అక్కడి ఖైదీవార్డర్‌ని.

"బాగా సాగుతున్నది సార్! మా ఖైదీలు ఒళ్ళు దాచుకోకుండా పనిచేస్తున్నారు" అన్నాడు. ఇతగాడిని పొగిడితేనే మార్కులువచ్చి, కొన్నిరోజులు శిక్ష తగ్గించుకోడానికి అవకాశం ఉందని అతడికి తెలుసు.

అక్కడ ఏపాటి పని జరుగుతుందో అందరికీ తెలుసు. అక్కడ తయారయ్యే నవారు సంవత్సరం గట్టిగా వాడితే తుంపులుమాత్రమే మిగులుతాయి. అయినా ఎవడి సొమ్ము నష్టమవుతున్నది? ఎవడు పట్టించుకుంటాడు? ఎవరికీ బాధ్యత భరించడానికి ఇష్టంలేని పని అది.

అక్కడినుండి రిమాండ్‌రూంకు వచ్చారు. అది చాలా పెద్దది. దాదాపు రెండువందలమంది ఆ హాలులో పడుకుని కొందరు, కూర్చుని కొందరు ఉన్నారు. శిక్షపడని రిమాండ్ ఖైదీలకు పనిచెప్పరు. శిక్షపడేవరకూ వారిని కదిలించడానికి కూడా గార్డులకు అవకాశంలేదు.

ముందుకు నడుస్తున్న జైలర్‌నుచూసి ఒక వ్యక్తి "సార్" అన్నాడు చేతులుచాచి

జైలర్ అతడిముందు నిలబడ్డాడు.

"సార్! నేను సంవత్సరంనుండీ ఇక్కడ మగ్గిపోతున్నాను. ఇంతవరకూ నా కేసు విచారణకే తీసుకోలేదు. దయచేసి తమరయినా నా

కేసు విషయంలో తగినచర్య తీసుకోవలసింది గా మనవిచేస్తున్నాను సార్!''

''అందుకు మేమేం చేస్తామయ్యా? నీవు చెప్పుకోవలసింది కోర్టులోనే! మావని మీకు తిండి పెట్టడం, పారిపోకుండా కాపలాకా యడం'' అన్నాడు జైలర్.

''నిజమేసార్! అయినా ఇన్నిరోజులనుండీ ఖైదీ ఒకడు ఇక్కడ పడివున్నాడని మీరు తెలుపవచ్చుకదా సార్!''

జైలర్ ముసి ముసి నవ్వులు నవ్వాడు.

''మేం చెప్పకున్నా మేజిస్ట్రేటు ఆఫీసు రికార్డులో ఉంటుంది. వాళ్ళే నిన్నిక్కడపడేశా రు గదా! మళ్ళీ మేము ఎరుకచేసేదేమిటి? అది మా బాధ్యతకూడా కాదు. కావాలంటే ఒక పిటీషన్ రాసివ్వు... మేజిస్ట్రేటుకు పంపిస్తా ము''

''సార్! నేను రెండు సంవత్సరాలనుండీ ఈ ఖైదులో మగ్గుతున్నాను'' మరొకవ్యక్తి పక్క నుండి అరిచాడు.

జైలర్ అటు తిరిగాడు. ''ఏం కేసు నీది?''

''బాంబులు తయారుచేస్తానని కేసుపెట్టా రు. బాంబులు తయారుచేయడమంటే తమ లపాకులు మడవడం అనుకున్నారు మీ పోలీ సులు! ఆ కేసులో ఇంతవరకూ ఛార్జీషీటు కూడా పెట్టలేదు'' అన్నాడు అతడు.

జైలర్ అతనివైపు ఆశ్చర్యంగాచూస్తూ ''అ దేమిటి? ఆరునెలలలోపల ఛార్జిషీటు పెట్టు కుంటే మేజిస్ట్రేటు నిన్ను విడిచివేస్తాడుగదా! ఆ విధంగా రాసివ్వు... పంపుతాను'' అన్నాడు

''చట్టాలయితే అలాగే ఉన్నాయిసార్! కాని ఆరునెలలకోసారి మేజిస్ట్రేట్‌నన్ను విడిచిపెట్టి నట్లూ , పోలీసులు తిరిగి అరెస్ట్‌చేసి, కోర్టులో హాజరుపరచి రిమాండ్‌కు పంపినట్లూ రిజిష్టర్ లు తయారుచేయడం జరుగుతోంది. నిజానికి ఈ రెండు సంవత్సరాలకాలంలో ఒక్కరోజ యినా నన్ను కోర్టుకు తీసుకుపోలేదు''

''ఈ విషయం న్యాయాధికారికి తెల్పా ల్సిందే! తప్పకుండా తగినచర్య తీసు కుంటాం'' అంటూ ముందుకు కదిలాడు.

వంటగదివద్దకు వచ్చేసరికి వంట ఖైదీలు ఎవరిపనిలో వాళ్ళు తీవ్రంగా మునిగివున్నారు. వీరిని చూసికూడా చూడనట్లు నటిస్తూ పనిచే స్తున్నారు. అన్నంరాశివద్దకు వచ్చి ఓ ముద్ద చేతికి తీసుకున్నాడు. పొడిగా వుంది. ఒక రొట్టె విరిచి చూశాడు. బాగా కాలి వాసనవస్తున్నది. కూరలో గరిటె తిప్పాడు. గరిటెకు గట్టిగా తగిలింది పప్పు. కాంపౌండర్ అక్కడికి వచ్చా డు.

''అన్నం రోజూ నువ్వు పరిశీలిస్తున్నావా? ఎలా ఉంటోంది?''

''బాగానే ఉంటోందిసార్! వంటలో లోపాలే మీ లేవు''

''కొందరు ఖైదీలు తిరుగుబాటు చేశారటక దా! అన్నం ఈవిధంగా ఉంటే ఎందుకు తిరుగుబాటు చేశారు? వారు అడిగినరోజున కూడా ఇలాగే ఉందా?''

''ప్రతిరోజూ ఇలాగే ఉంటుంది సార్''

జైలర్ తలపూపి అక్కడినుండీ గంజి గదుల వద్దకు వచ్చాడు. వరుసగా అందరినీ అడిగితే వంట బాగుండటంలేదనే చెప్పారు వారు.

హనుమంతు వద్దకు వచ్చి నిలబడ్డాడు. రెండు కాళ్ళకు, చేతులకు కలిపి సంకెళ్ళు తగిలించి ఉన్నాయి. బండలమీద పడివున్నా డు అతను.

''అన్నం బాగులేకుంటే మర్యాదగా అడగ వచ్చుకదా! అధికారులమీద తిరగబడటం ఎందుకు?'' అన్నాడు గాంభీర్యంగా.

''మర్యాదగా అడిగితే వింటారన్న నమ్మ కంలేదు సార్''

''పొగరుగా ప్రవర్తిస్తే జరిగే శాస్తి అర్థమ యిందా?''

హనుమంతు మాట్లాడలేదు. గోడవైపు చూ స్తున్నాడు.

పోతాలు గదివద్దకు వచ్చాడు. పోతాలు తలెత్తి జైలర్‌వైపు చూశాడు. అతన్ని చూసి జైలర్ నొసలు ముడివాడు ఆలోచిస్తూ. పోత లు కూడా ఆలోచిస్తున్నాడు.

''ఎవ్వారు నీది?''

''నంద్యాల''




''ఏం పనిచేస్తావ్?''

''రిక్షా లాగేవాళ్ల యూనియన్ ప్రెసిడెంటుని''

''నీ కేసేమిటి?''

''ప్రభుత్వనిర్వహణకు ఆటంకం. ప్రభుత్వ ఆస్తుల ధ్వంసం చేసినట్లు ఆరోపించి ఇక్కడకు తెచ్చారు''

జైలర్ అతనివైపు ఒక నిముషం చూసి- ''ఎందుకిట్లా ప్రవర్తించారు? జైలులో సౌకర్యాలు లేవనుకుంటే మంచిగా అడుగవచ్చుకదా?''

''మంచిగా చెప్పడానికే ప్రయత్నం చేశాం! దానికి ఫలితం మా వీపులు పగిలిపోయాయి. బయట పోలీసుల చేతిలోనూ తన్నులే! ఇక్కడా తన్నులే! బయట తిరగబడినందుకు ఇక్కడికి వచ్చి పడ్డాం! ఇక్కడా అదే జరిగింది''

ఊపిరి పీల్చి వదిలాడు జైలర్ ''మిమ్మల్ని ఇక్కడినుండి బయటకు తీయిస్తాను. ఇక ముందయినా మర్యాదగా ఉంటారా?''

అతడివైపు దీర్ఘంగా చూసి, తలతిప్పు కుంటూ- ''ఉండనిస్తేకదా ఉండటానికి?'' అన్నాడు.

జైలర్-సబ్‌జైలర్‌వైపు, గార్డులవైపు చూసి, తిరిగి పోతాలు వైపుచూసి, చకచక ముందుకు కదిలాడు.

అందరూ అతని వెంట కదిలారు. వెనుకగానున్న గార్డు ఒకడు పోతాలు దగ్గరగా వచ్చి- ''అయ్యగారు చాలా మంచివారు... క్షమాపణకో

రితే విడిచిపెడతారు'' అన్నాడు.

పోతాలు పలకలేదు. గార్డు వడివడిగా ముందుకు కదిలాడు.

ఆఫీసులోనికి వచ్చి కూర్చున్నాడు జైలర్.

''గార్డులమీద, మీమీద తిరుగుబాటు చేసి, దాడిచేసినందుకు ఖైదీలమీద కేసు పెడదామంటారా?'' అన్నాడు జైలర్.

''కేసు పెట్టినా తిరిగి వాళ్ళను ఈ జైలులోనే పడేస్తారుకదా! వారితో ఎలాగయినా తగవుతుం. తగినశాస్తి మనమే మరికొంత మోతాదులో చేస్తే సరి''

''ఖైదీలను రక్షించడానికీ, వారికి సౌకర్యం కలుగచేయడానికీ మనం ఉన్నాం. మనమే ఖైదీల మీద దాడిచేస్తే చట్టరీత్యా నేరమవుతుందికదా!''

''మనల్నిదాటి ఈ చట్టాలు ప్రవర్తిస్తాయా?'' అన్నాడు వెటకారంగా సబ్‌జైలర్.

జైలర్ మాట్లాడలేదు. నిజానికి తనకూ, సబ్‌జైలర్ పోస్టుకూ పెద్ద తేడాలేదు. నిన్నటిదాకా అదే తను నిర్వహించింది.ఇంకా జైలర్ స్థాయికి తన మనస్సు ఎదగలేదు. పైగా ప్రభాకరరెడ్డి ఆ జైలులో గతయేడు సంవత్సరాలుగా పాతుకుపోయాడు. గార్డులు చేతిలో ఉన్నారు. బయట ఆర్థిక, రాజకీయ స్థాయిలో అతడికి బలాబలాలున్నాయి. ఈ విషయంలో అతన్ని వ్యతిరేకించి తాను ఏమీచేయలేడు. పైగా తన్నులు తిన్నది అతడు. అతడు కేసు పెట్టవలసిన పనిలేదంటున్నాడు. అంటే వారి మీద దాడి చేయడానికి అతడు సిద్ధపడుతున్నాడు. తనువారించి అతనితో విరోధం పెంచుకోవాల్సి ఉంటుంది. ఈ జైలు పరిస్థితి అతడికి సంవత్సరం నుండీ తెలుసు.

మధ్యాహ్నం భోజనసమయంలో- ప్రభాకరరెడ్డి తన క్వార్టర్స్‌కు వెళ్ళిపోయాడు. జైలర్ రామయ్య రాసుకుంటూ కూర్చున్నాడు. గార్డును క్యారియర్ తెమ్మని పంపించాడు. మరొక గార్డును పిలిచి, ''పోతాలును ఇక్కడకు తీసుకురా!'' అన్నాడు.

ఆ గార్డు మరో గార్డును తోడుతీసుకుని గుంజుతూ ఈడ్చుకువచ్చారు. పోతాలు చేతీలు తీసి ''పెద్ద దొరగారు రమ్మంటున్నాడురా!'' అన్నాడు.

పోతాలు మెల్లగా లేచాడు. గత రెండు రోజులుగా అలాగే కూర్చోవడం వల్ల కాళ్ళు, చేతులు మొద్దుబారిపోయాయి. నడవడం కూడా సాధ్యంకాలేదు. గార్డు లిద్దరూ చెరొక పక్కా పట్టుకుని తీసుకువచ్చారు. ఆపాటికి జైలర్ అటూఇటూ తిరుగుతున్నాడు. పోతాలును చూసి ''కూర్చోబెట్టండి'' అన్నాడు.

ఆఫీసులో ఒక మూల అతడిని కింద కూర్చోబెట్టారు.

జైలర్ ఊపిరిపీల్చి వదులుతూ ''బాగా కొట్టారా?'' అన్నాడు.

''మీ చేతుల్లో పడటం దెబ్బలు తినకపోవడమా?'' అన్నాడు పోతాలు వెటకారంగా. కదుములు కట్టిన శరీరాన్ని చేతితో రుద్దుకుంటున్నాడు.

''నన్ను గుర్తుపట్టావా?'' అన్నాడు జైలర్ అతడి కళ్ళలోనికే చూస్తూ. చిన్నగా నవ్వాడు పోతాలు. గుర్తుపట్టానన్నట్లు తలవూపాడు.

''నేను ఎవరినో చెప్పు! చూద్దాం!''

''నంధ్యాలలో రిక్షాపుల్లర్ శ్రీనివాస్ కొడుకు రామయ్యవని, ఇంతకుముందే గుర్తించాను'' అన్నాడు పోతాలు తిరిగి. ''శ్రీనివాస్ తన కొడుకు సబ్‌జైలర్‌గా పనిచేస్తున్నాడని నాకు చాలాసార్లు చెప్పాడు. ఇక్కడ ఈవిధంగా తారసపడతావను కోలేదు నేను'' అన్నాడు.

''అక్కడ నేను ఎవరినయినా, ఇక్కడ జైలర్‌గా నా బాధ్యతలు నిర్వర్తించాలి. మిమ్మల్ని చాలాసార్లు చూశాను... మాట్లాడాను. మీ నిజాయితీకి నాకెంతో ఆనందమేస్తోంది. ఈరోజు ఈవిధంగా మనం కలుసుకుంటా మనుకోలేదు. మీరుకూడా తొందరపడ్డా రనుకుంటున్నాను. సబ్‌జైలర్ మీద దాడిచేయకుండా ఉండవలసింది''

''ఆ సమయంలో ఆలోచించడానికి తీరికలేదు. అన్యాయంగా అతడు నామీద దాడిచేశాడు. ప్రతిఫలం అతడు అనుభవించాలనేదే నా ఉద్దేశం''

''దాని ఫలితం ఎంత తీవ్రంగా వుందో ఇప్పటికే అర్థమయిందిగదా! ఇంకా తీవ్రత ఏర్పడే అవకాశం కూడా ఉంది''




"అయినా నా గీటు నేను దాటిరానని మీకూ తెలుసు! ఎదిరించి పోరాడతాను. జైలంటే ఖైదీలకు సత్ప్రవర్తన నేర్పే గృహమనుకున్నాను. తీరా వచ్చి చూస్తే, తప్పుచేయకుండా శిక్షపడి ఇందులోకి వచ్చినవాడు ఇకముందు తప్పులు చేయడం ఎలాగో నేర్చుకొనేలా చేస్తున్నారనిపించింది"

"వంట మీరంటున్నంత ఘోరంగా లేదే! తెప్పించమంటారా?"

తలవూపాడు అడ్డంగా. ఈ రెండురోజులుగా మాకు చాలామంచి అన్నం దొరుకుతున్నది. కానీ అది అందరికీ అంది ఉండదని కూడా మీకు తెలుసు. అలజడి ఒకటి ఆరంభమయింది కనుక నాలుగురోజులు జాగ్రత్తపడతారు. తిరిగి మామూలే! అయినా ఈ విషయాలు మీకు తెలియవంటే నేను నమ్మను"

"తెలుసు. కానీ ఇంత దారుణంగా ఉంటాయని మీరు చెబితే వింటున్నాను. ఇది సహజం పోతాలూ! ప్రతిచోటా ఆవేశం పనికిరాదు. జరిగింది జరిగిపోయింది. క్షమాపణకోరండి అతన్ని! విడిపించే ఏర్పాటు చేయిస్తాను"

తల అడ్డంగా ఊపాడు పోతాలు "మిష్టర్ రామయ్యా! ఇప్పుడు జైలర్‌వే అయినా ఒకనాడు ఒక రిక్షా కార్మికుడి కొడుకుగానే నేను నిన్ను గుర్తిస్తాను. రిక్షా తొక్కి మీ తండ్రి సంపాదించిన డబ్బుతో డిగ్రీ పూర్తిచేసి, ఉద్యోగం దొరకక బజార్లవెంట తిరిగినరోజు నీవేమన్నావో గుర్తుకు తెచ్చుకో! 'ఈ లంచగొండి ప్రభుత్వాన్ని నాశనం చేయాలి', అంటూ కేకలేశావు. ఈరోజు నీ స్టాఫ్ అంతా లంచగొండులే! అయినా వీరిమీద చర్యతీసుకోడానికి బదులు, క్షమాపణ చెప్పమని నాకు హితబోధ చేస్తున్నావు. ఇదంతా చూస్తే నీకేమనిపిస్తుంది?"

రామయ్య పలుకలేదు. అటూఇటూ తిరుగుతున్నాడు. పైన ఫ్యాన్ తిరుగుతున్నది. బయట గార్డుల గుసగుస వినిపిస్తున్నది.

"మిష్టర్ పోతాలూ! అప్పటి పరిస్థితిలో ఆ ఆలోచనలు సహజం! ఈనాడు ఆస్థాయిలో లేను. నేనున్న స్థాయిని నేను నిలబెట్టుకోవాల్సి ఉంది. ఇక్కడ తప్పు జరిగితే దండించాల్సిన హక్కు నాకుంది. కానీ మూలం పైన ఎక్కడో ఉంది. ఈ తప్పు జరగడమనే మూలాన్ని ఛేదించడం నాకు సాధ్యంకాదు గదా! నేనే నాశనం అవ్వాల్సివుంటుంది. అయినా తెలిసిన వ్యక్తిగా మీకు మంచిచేయడం కొరకు నేను ప్రయత్నిస్తాను. ఈ వంట సరిగా చేయడంలేదంటున్నావుగనుక, వార్డర్‌ను తొలగించి ఆ బాధ్యత నీకు అప్పగిస్తాను. ఇకముందు వంట బాగాచేసి, ఇక్కడి ఖైదీలను సంతోషపరచు. ఆవిధంగా ఇక్కడ కొంతవరకూ అవినీతిని నిర్మూలించగలవు"

తల అడ్డంగా ఊపాడు పోతాలు. వంటవార్డర్ ఎవడయినా ఒకటే. రేషన్ సక్రమంగా రానంతవరకూ! రేషన్ అధికారుల ఇళ్ళకు వెళ్ళకుండా ఉండాలి. ఇక్కడి గార్డులు మింగకుండా ఉండాలి. ఇవన్నీ సక్రమంగా లేకుంటే వార్డర్ ఏంచేస్తాడు? ఇవన్నీ సాధ్యం కావాలంటే ఇక్కడి అధికారులు నిజాయితీగా ప్రవర్తించాలి. ఆ బాధ్యత మీది. ఒక కార్మికుడి కొడుకుగా కనీసం ప్రజలకు-ఇక్కడ ప్రజలంటే ఖైదీలే గనుక-వారికి మేలుచేయడం మీ విధి! ఇక్కడ రేషన్‌లో ఖైదీలకు వచ్చే వస్తువులలో, ఖైదీలను చూడటానికి వచ్చే వారినుండి లాగే మొత్తంలో అధికారులకే ఎక్కువ వాటా అందుతుందంటున్నారు. అది అబద్ధంకాదని కూడా మాకు తెలుసు. ఇక్కడ అధికారులంటే మీరూ, సబ్‌జైలరే! ముందు మీరు నీతిగా ఉండవలసిన అవసరముంది. మీరేనీతిగా ప్రవర్తిస్తే మీ క్రిందివారు మారడం పెద్ద సమస్య కాదు"

"అంటే మీ రేషన్ మేము తింటున్నామని బాధిస్తున్నావా?"

"నమ్ముతున్నాను కూడా! బయట ప్రజల్ని పీడించి వారి డబ్బుతో కొందరు అధికారులు నలుగుతున్నారు. జైలులో కూడా అదే జరుగుతున్నది"

"మాకెంత మాత్రం ఇందులో భాగంలేదు పోతాలూ!"

"నేను నమ్మను జైలర్! కార్మికుడు అధికారంలోనికి వస్తే మేలు జరుగుతుందని కలలు కనే వ్యక్తుల్లో నేనూ ఒకణ్ణి! కానీ ఇక్కడ నువ్వు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నావు. తోటిమానవులని మోయడానికి కండలు కరిగించి, నిన్ను



పెంచిన ఒక కార్మికుని కనీస ఆశలు నువ్వు నాశనం చేశావు. ఒకనాడు మీ నాన్న చెమట తాగి బతికావు ఇప్పుడు ఖైదీల ఆహారం తిని బతుకుతున్నావు. తేడా ఏమీలేదు. నువ్వు ఎప్పుడూ పరాన్నజీవిగానే బతుకదలచుకున్న ట్లున్నావు.''

పోతాలు వైపు కంటగింపుగా చూశాడు జైలర్. అతడి ముఖం రంగులు మారుతున్నది. పోతాలు లొంగిపోతే అతనికి ఇక్కడ ఖైదీల మీద అధికారం ఇద్దామని ఆలోచించాడు. కానీ అతడు బయటి ప్రపంచాన్ని లోపలకూడా ఏర్పరచాలంటున్నాడు. ఏనాడో తన తండ్రి కష్టంచేసి నిజాయితీగా బతికాడు గనుక తననీ నిజాయితీగా పనిచేయమని హితబోధ చేస్తున్నాడు. అది సాధ్యంకాదు. అవకాశం దొరికింది. అందుకుంటున్నాడు. దాన్ని విడిచే స్థితిలో తానులేడు. తెలిసినవ్యక్తి గనుక పోతాలును ఈ బాధలనుండి తప్పిద్దామని ఆలోచించాడు. కనీసం సబ్‌జైలర్‌కు క్షమాపణ చెప్పించడం ద్వారా ఇంతటితో ఈ కథ ముగిద్దామనుకున్నాడు. ఈ నీతులవల్ల లాభంలేదు. తాను ఇంతకుమించి చొరవతీసుకోవడం మంచిదికాదు.

గార్డులతో అతన్ని తీసుకెళ్ళవలసిందిగా ఆర్డరిచ్చాడు. జైలర్‌కూ పోతాలుకూ జరిగిన సంభాషణ ద్వారా వారిద్దరికీ పాత పరిచయం బాగా వుందని గార్డులకు తెలిసింది. అయినా అతన్ని విడిచిపుచ్చమనిగానీ, కనీసం సంకెళ్ళు తీయమనిగానీ జైలర్ చెప్పలేదు గనుక సంకెళ్ళతో తిరిగి లోపల వేశారు.

సెంట్రీ తాళం వేస్తూ- ''దొరగారు నీకు తెలుసా?'' అన్నాడు.

''వాడేకాదు... వాడి బాబు కూడా తెలుసు! కానీ ఈ రూపంలో ఇలా ఎదురవుతాడనుకోలేదు'' అన్నాడు నిరాశగా.

''చాలా మకురుగా మాట్లాడుతున్నావే?'' అన్నాడు గార్డ్ అసహ్యంగాచూస్తూ ''పెద్ద దొర చాలా మంచివాడు. ఖైదీలతో ఎంతో ఉదారంగా ప్రవర్తిస్తాడు''

''నీకేంతెలుసు గార్డూ! అతడెవరో, అతడి బతుకేమిటో, ప్రస్తుతం ఎట్లా బతుకుతున్నాడో నాకుతెలుసు. దొంగసొత్తులో నీకు వాటా వుంది కనుక, వాటా ఇస్తున్నాడు గనుక మంచివాడుగా కనిపిస్తున్నాడు''

గార్డ్ మాట్లాడకుండా చరచరా బయటకు వెళ్ళాడు.

అతడు వెళ్ళినవైపే చూస్తూ ఆలోచిస్తున్నాడు పోతాలు! కార్మికుడి సంతతి అధికారంలోనికి వచ్చినా జరిగేదింతేనా! తాను ఎలా బతికాడో ఒక్క నిముషం ఆలోచించినా, ఈ దగాకోరు బతుకు బతకడానికి అతడు ఇష్టపడడు.

వంట వార్డర్ నజీం ఒక ఖైదీని వెంటపెట్టుకుని అక్కడకు వచ్చాడు. ఆ ఖైదీ చేతిలో ఒక రొట్టె, పళ్ళెంలో అన్నం, పప్పువుంది. అది చూస్తూనే గ్రహించాడు, తనకు ఇద్దరి రేషన్ వస్తున్నదని. అయినా తెలియనట్లు అడిగాడు. ''ఇదేమిటి-అదేమిటి?''

''దొరగారు నీకు ఎక్కువ రేషన్ పంపమన్నారు. తెచ్చాం'' అన్నాడు నజీం.

''నాకివ్వాల్సిన రేషన్ ఇచ్చి, మిగిలిన రేషన్ మీ దొరగారినే తినమన్నానని చెప్పు. పోతాలును కొనడం బయటే కాదు లోపలా సాధ్యంకాదని చెప్పు'' అన్నాడు.

వార్డరు కొరకొర చూస్తూ రొట్టె అతని ముందు పడవేసి, వెనుతిరిగి వెళ్ళాడు.

''బాగా బుద్ధి చెప్పావ్‌గురూ!'' అన్నాడు నీళ్ళు తెచ్చిపెట్టిన ఖైదీ.




దండంపెట్టి క్షమించమన్న నలుగురిని గంజిగదుల నుండి బయటకుతీసి, సెల్‌లోకి తోశారు. హనుమంతుతోసహా మరో నలుగురు క్షమాపణ కోరకపోవడంతో వారినలా గంజిరూ




ములలోనే ఉంచారు. అయితే వారిని కొట్టడం మానారు. కాళ్లకు, చేతులకు వేసిన సంకెళ్ళు తీశారు.

ఒంటరిగా ఎవరిగదిలో వారుండాలి. ఒక రితో ఒకరు సంభాషించుకోవాలంటే గట్టిగా మాట్లాడితేగానీ వినపడదు. గట్టిగా అరిస్తే గార్డువచ్చి తిట్లకు లంకించుకుంటాడు. గంజి రూములకెదురుగా నీళ్లటాంకు చాలా ఎత్తున కట్టారు. ఆ తొట్టికింద భూమిమీద నీటిపంపు లున్నాయి. ఆ పంపులగుండా వంటగదికి రబ్బరుగొట్టం. అవసరమయితే ఆ పంపుకు గొట్టం తగిలించి, లోపలకు నీళ్ళు సరఫరాచే యడం, అవసరం లేకుంటే గొట్టం తీసివే యడం.

పంపులకు పక్కనే వంటగది, వంటగది ఎదురుగా విశాలమైన రస్తా, దాన్ని ఆనుకుని పెద్ద పార్కునిండా చెట్లు! పార్క్‌కు పక్కనే ప్రహరీగోడ చాలా ఎత్తుగావుంది. ప్రహరీగో డకు ఎదురుగా ఆఫీసు, స్టోరుగది మరి ఇతర గదులు, ఆస్పత్రి, చిన్న లైబ్రరీ ఉన్నాయి. ఉదయంపూట, వంటగదివద్దకు, నీళ్లకొరకు, ఆస్పత్రికి వచ్చే ఖైదీలు, గార్డులు అటుఇటు తిరుగుతుంటారు. పదిగంటలనుండి తిరిగి సాయంత్రం మూడుగంటలదాకా ఎవ్వరూ ఉండరు. తిరిగి కలకలం. జనం కన్పిస్తు న్నంతసేపూ వారివైపు చూస్తూ కూర్చుంటారు గంజిరూములోనివాళ్ళు. అయినా వారితో మాట్లాడటానికి వీలుండదు. గంజిరూముల వైపు గార్డులుతప్ప ఎవరూ వెళ్లకూడదు. ఎవర యినా వెళ్ళారా, వారి వీపు చిట్లిపోతుంది. గంజిరూములకు పైగానే గార్డ్‌పోస్ట్ ఒకటుంది. ఆ రూములపక్కనుంచే పోస్టు ఎక్కడానికి మెట్లున్నాయి. మెట్లదగ్గర విశాలమైన బయ లుంది. అక్కడ రాత్రిపూట గార్డులు పేకాడు తూవుంటారు. రాత్రిపూట ఆఫీసర్లు రాదుగ నుక వారికి నిశ్చింత.

పాకీపనిచేసే ఒకడు కసవు చిమ్ముతూ పోతాలు గది దగ్గరగా వచ్చాడు. అతనివైపు చూడకుండానే లోగొంతుకతో గుసగుసగా "పోతాలూ, పోతాలూ" అన్నాడు.

పోతాలు విన్నాడు; కానీ తలెత్తి చూడలేదు. ఎదురుగా గార్డు ఇటేచూస్తున్నాడు. తాను తలతిప్పి అతనివైపుచూస్తే దగ్గరకు వస్తాడు. "ఏం?" అన్నాడు మెల్లగా.

"మీవాళ్ళు నలుగురు ఈరోజు వంటవార్డ రుతో తగవుపెట్టుకున్నారు"

"ఎందుకేమిటి?" ఆసక్తిగా అడిగాడు పోతాలు.

"అందరినీ పారిశుద్ధ్యం పనిలోకి రమ్మని వంటవార్డరు అడిగాడట! అంటే గిన్నెలు, అంట్లుతోమి, నీళ్ళు తోడటానికి. వాళ్ళు ప్రస్తుతం పొలంపనికి వెళ్తున్నారు. వాళ్ళు వంట రూంకు రామన్నారు. దాంతో వార్డరు మండిప డి హెడ్డుతో చెప్పి, వారిని కొట్టించాడు. నిన్న సాయంత్రం మాటామాటా పెరిగింది. ఉదయం వాడిని తన్నారు"

"తర్వాత?"

"గార్డులు ఇంతవరకూ కలుగజేసుకోలేదు. పెద్దదొరకు చెప్పాలనుకుంటున్నారు గార్డులు. పెద్దదొరది మీఊరేనటగా"

"రేయ్! ఏమిరా అక్కడే వంగబడ్డావ్?" అంటూ గార్డు అక్కడికి వచ్చాడు.

"ఊడుస్తున్నానయ్యా" అన్నాడు నడుంలేపి ఆ ఖైదీ.

"నీ తలకాయ్! కానీ తొందరగా" అంటూ వంటగదివైపుగా కదిలాడు.

"మిమ్మల్నందర్నీ ఈ జైలునుండి ఇంకో జైలుకు మార్చుతారంటున్నారు."

"సరే! కానీ" అన్నాడు పోతాలు.

తమమీద మరింత తీవ్ర చర్యలు తీసుకోడానికి జైలర్ ఆసక్తి చూపటంలేదా? కారణం తమమధ్యవున్న గత సంబంధాలా? కావచ్చని పోతాలు అనుకున్నాడు. గతంలోవున్న తమ సంబంధాలు జైలర్‌కు ఆసక్తి కలిగించేపక్షంలో తమని గౌరవంగా విడిచేవాడు. విడువలే దంటే అవి గాలికిపోయినట్లే. అంటే ఖైదీల రేషన్‌లో తన భాగం కాపాడుకోటానికి ఖైదీలను హింసించడానికి నిశ్చయించుకున్నట్లే. అయితే ముందున్నంత తీవ్రంగా తమమీద దాడిచేయకపోవటానికి కారణం తాము మళ్ళీ తిరుగుబాటు చేయగలమనీ, కక్షసాధించగల




మనీ అతడికి తెలుసుకాబట్టే. అంటే జైలర్ తమనిచూచి భయపడుతున్నాడు. ఇక్కడ లేకుండా ఇంకో జైలుకు పంపడంద్వారా తమ పీడ వదిలించుకోవచ్చని ఆలోచించివుండవచ్చు. కానీ ప్రభాకరరెడ్డి మాటేమిటి? తమను ఘోరంగా హింసించాడు. శరీరం జల్లెడలా సూదులతో పొడిపించాడు, చిట్లగొట్టించాడు. కారం రుద్ది వణికించే చల్లనీళ్ళు పోయించి, శారీరకంగా, మానసికంగా హింసించాడు. ఇక్కడున్నా ఇక్కడి నుంచి మరోచోటికి తరలించినా సబ్‌జైలర్ సంగతి తేల్చుకోవాల్సిందే.

''హనుమంతూ'' అన్నాడు పోతాలు. పక్క గదినుండి హనుమంతు పలికాడు.

''మనల్ని ఇంకోజైలుకు మార్చాలనుకుంటున్నారట ఆఫీసరు''

''పిరికినాయాళ్ళు! ఎక్కడికి మార్చినా వీరి సంగతి తేల్చందే నిద్రపోను. దొంగల్ని కొట్టినట్లు బాదాడు సబ్‌జైలర్‌గాడు. ఈ జైలు దాటేలోపల వాడి గుండెల్లో కత్తిదించిగానీ పోను'' అరిచాడు హనుమంతు.

''ఆవేశపడకు హనుమంతూ'' అన్నాడు పోతాలు.

''ఆవేశంగాదు, నేను బయట ఖూనీచేసి వచ్చినవాణ్ణి. లోపల చేయడం అదో ఘనకార్యంగాదు. కానీ, లోపల చిక్కుకుంటానని భయపడుతున్నాను''

గార్డు అటుగా రావడంతో హనుమంతు మాట్లాడలేదు. వీరి దగ్గరగా వచ్చిన గార్డును పిలిచి ''మంచినీళ్ళు కావాలి'' అన్నాడు హనుమంతు.

''నేను నీ నౌఖర్ని కాదురోయ్! మీ సెంట్రీ వచ్చిన తరువాత కావాలంటే అడుగు''

''అదేందయ్యా! దప్పిక అవుతుంటే నీళ్ళు ఇవ్వనంటావు?'' పెద్దగా అరిచాడు హనుమంతు.

అంతకంటే పెద్దగా అరిచాడు గార్డు ''తంతా కొడకా! నాతో మంచిగుంటే మంచిది, లేకుంటే చంపేస్తాను.''

''ఏందయ్యోవ్! మరీ నీలుగుతున్నావేం? నేనడిగింది మంచినీళ్ళుగానీ, తన్నులుకాదే! మంచినీళ్లడిగితే చంపేస్తావా?''

హనుమంతు అరుపులకు ఒళ్ళుమండిన గార్డు వడివడిగా తలుపుదగ్గరకువచ్చి, లోపలకు చెయ్యి చాపాడు. జుట్టు దొరకపుచ్చుకుని. తలను తలుపు ఊచలకేసి కొడుతూ, ''నాకొడకా! నీళ్ళు కావాలా? తాగు, తాగు'' అంటూ బాదాడు.

హనుమంతు అరుపులకు ఆ చుట్టుపట్లున్న ఖైదీలు, గార్డులు పరుగెత్తుకుంటూ వచ్చారు. ఒక గార్డు అతనిదగ్గరగా వచ్చి, గార్డు చేతులు బలవంతంగాలాగి, గార్డును పక్కకు ఈడ్చాడు.

అంతలావు హనుమంతు కుప్పలా లోపల కూలిపడ్డాడు. ఆవేశంతో ఊగిపోతున్న గార్డును ఇద్దరు గార్డులు పక్కకు తీసుకెళ్ళారు.

తలుపు ఊచలగుండా కారుతున్న రక్తం బయట బండలమీదకు ప్రవహించసాగింది. పదిమంది గార్డులు అక్కడికి చేరుకున్నారు. లోపల మనిషి చచ్చాడో బ్రతికాడో తెలియడంలేదు. రక్తం మాత్రం విపరీతంగా కారుతున్నది. తాము ఏంచేయాలో వారికి తెలియడంలేదు. ఆ చుట్టూవున్న ఖైదీలు కొందరు అక్కడకు వచ్చారు. రక్తం చూసి వణుకుతూ నిలబడ్డారు. గార్డులు వారిని కసిరి దూరంగా తరిమారు.

''ఏం చేద్దాం?'' అన్నాడు సెంట్రీ ఒక గార్డుతో.

''ముందువెళ్ళి పెద్దదొరకు ఫోన్‌చెయ్యి వీడు చచ్చాడా, ముందు నీ ఉద్యోగం పోతుంది. సెంట్రీగా వుండి, ఇంకోగార్డు వచ్చి ఇలా కొడుతుంటే ఎందుకు చూస్తున్నావ్?'' అన్నాడు గార్డు.

''నేను వంట రూంలో ఉన్నాను. ఈ పిచ్చోడు ఇట్లా కొడతాడని నాకేంతెలుసు. నానెత్తిమీదకు తెచ్చాడు మూర్ఖుడు'' గొణుక్కుంటూ ఆఫీసు రూంవైపు పరుగెత్తాడు.

ఎదురుగా వస్తున్న హెడ్డుకు నమస్కారంపెట్టి, అతడు పిలుస్తున్నా పలక్కుండా లోపలకు పరుగెత్తి ఫోన్‌చేశాడు. జైలర్ వస్తున్నట్లు చెప్పడంతో బయటకు పరుగెత్తాడు. ఈలోగా హెడ్ కానిస్టేబుల్, ఆ ప్రాంతంలో ఖైదీలు లేకుండా తరిమివేశాడు. ఆవరణలోనికి ఎవ

రూ రాకుండా, ఖైదీల సెల్‌కు వెళ్ళేదారిని మూయించివేశాడు. వంటరూములోవున్న ఖైదీలు బయటకు రాకుండా గార్డును కాపలా పెట్టారు. అంతవరకూ తింటూ, కులాసాగా కబుర్లాడుకుంటున్న గార్డులందరూ, ఎవరి డ్యూటీ వైపువారు పరుగులు తీశారు. జైలర్, అసిస్టెంట్ జైలర్, పరుగెత్తుకుంటూ వచ్చారు. సెంట్రీ వచ్చి తలుపు తెరిచాడు. జైలర్ ముందుకువంగి హనుమంతును కదిపాడు. హనుమంతు మూలుగుతూ పొర్లాడు.

"ఏమిటిది? ఏమయింది?" అన్నాడు కోపంగా సెంట్రీవైపు చూసిన జైలర్.

"నాయక్ అనేగార్డు ఇతని జుట్టు పట్టి తలను ఊచలకు కొట్టాడు సాబ్" అన్నాడు భయం భయంగా సెంట్రీ.

"ఇక్కడ సెంట్రీ ఎవడు?"

"నేనేసాబ్?"

"నీవు సెంట్రీ అయితే మరొకడు ఇక్కడికి వచ్చి కొడుతుంటే నువ్వుచూస్తూ ఎందుకూరున్నావ్? వాడు ఎందుకు కొట్టినట్లు"

"నాకు తెలియదు సార! మంచినీళ్ళు త్రాగుదామని వంటగది వైపు వెళ్ళాను. అరుపులు వినిపిస్తే ఇటువచ్చాను".

"సరిగ్గా తెల్లారలేదు. నీకు మంచినీళ్ళు అవసరమయ్యాయా?" గాండ్రించాడు జైలర్.

మరో గార్డు ముందుకు రాబోతుండగా హెడ్డు అతన్ని పక్కకులాగి, తాను ముందుకు వచ్చి" ఆగార్డు ఇటుగా వెళ్తుంటే, వీడు నోటికి వచ్చినట్లు తిట్టాడు సార్! అందువల్లే కొట్టి ఉండవచ్చు"

"నువ్వు చూశావా?" అన్నాడు ఇవతల గదినుంచి పోతాలు కోపంగా. అందరూ పోతాలువైపు తలలు తిప్పారు.

"ఏందోయ్; అందరూ న్యాయమూర్తులూ, సాక్షులూ అయ్యారు. ఖైదీలంటే మీకో లెక్కే లేనట్లుంది. ఇక్కడ పిచ్చుకలకంటే కూడా హీనమైన ప్రాణంగా మిమ్మల్ని భావిస్తున్నారు. అసలు నువ్వెక్కడున్నావ్? హనుమంతును ఎందుకు కొట్టిందీ నీకు తెలుసు. తెలిసినా దొంగసాక్ష్యాలు చెబుతున్నావ్" అరిచాడు పోతాలు.

అతడి దగ్గరగా వచ్చాడు జైలర్. హనుమంతు రక్తం అక్కడివరకూ పారడంవల్ల జైలర్ బూట్లకు అంటుకుంది.

"ఏం జరిగింది పోతాలూ?"

"ఇక్కడి గార్డులకు కొవ్వెక్కింది. వంటగదిలో పందుల్లామెక్కి, కొవ్వు పెంచుకున్నారు. ఇక్కడ కాపలా ఉండవలసిన సెంట్రీగాడు దున్నలా మేయడానికి వంటరూంలోకి వెళ్ళాడు. అక్కడ పందిలా తిన్న మరోగార్డు ఇటుగా పోతున్నాడు. రాత్రినుండి మా ముఖాన మంచినీళ్ళు పోయలేదు. హనుమంతు మంచినీళ్ళడిగాడు. వాడికి మండుకొచ్చింది. వచ్చి ఇనుప ఊచలకేసి తల పగులగొట్టాడు. ఒకచిన్న పిచ్చికను చంపాలంటే ఆలోచిస్తాం. కానీ, మనిషి తల పగులకొట్టడానికి ఇక్కడ ఎలాంటి ఆలోచన అవసరంలేనట్లుంది"

జైలర్ వడివడిగా తన ఆఫీసువైపు సాగాడు. హాస్పిటల్‌కు ఫోన్‌చేశాడు. సెంట్రీని, కొట్టిన గార్డును పిలిచి వారిని నానాతిట్లు తిట్టాడు. ఇద్దరూ జైలర్ కాళ్ళుపట్టుకున్నారు. వారిని క్షమించేశాడు జైలర్. అంతకంటే అతడు ఏమీచేయలేడు. వారిని సస్పెండ్ చేయాలంటే, గంజిరూంలో ఖైదీలు ఎందుకున్నారో వ్రాయాలి. గంజిరూంలో ఖైదీలుండటానికి కారణం సబ్‌జైలర్ మీద తిరుగుబాటు చేయడంవల్లనని రాయాలంటే, వారిమీద కేసుపెట్టాలి. ఇదో తలనొప్పి వ్యవహారంగా తయారవుతుంది. కాబట్టి అంతటితో వారిని క్షమించటం కంటే మంచిపద్ధతి కన్పించడంలేదు. మరోపావుగంటలో అంబులెన్స్ వచ్చి మెట్లవద్ద నిలబడింది. స్ట్రెచర్ తీసుకొని హాస్పిటల్ ఉద్యోగులు పైకివచ్చారు. జైలర్ వారితోపాటు అక్కడికి వచ్చాడు. హనుమంతు శరీరాన్ని స్ట్రెచర్‌లో చేర్చారు. వెళ్ళిపోతున్న హాస్పిటల్ ఉద్యోగుల్ని చూస్తూ, పోతాలు బండబూతులు తిట్టాడు గార్డుల్ని.

"ఒరేయ్! కుక్కల కొడుకుల్లారా! అన్యాయంగా ఒక వ్యక్తిని నాశనం చేశార్రామీరు. ఒకనిండు ప్రాణం తీస్తున్నారురా! మీకు నిజాయితీ లేదు, నీతి లేదు. నిజం ఒప్పుకునే ధైర్యం కూడా లేదురా. మిమ్మల్ని కూడా ఇలాగే







పగులకొస్తే కానీ బుద్ధిరాదురా! మంచినీళ్ళడిగినందుకు ఒకమనిషిని కొట్టడమే శిక్ష అయితే, ఖైదీలరేషన్ తిని బతికే కుక్కలు మిమ్మల్ని నడిబజారులో గొంతుకోయాలిరా''

అతని అరుపుల్ని ఎవరూ పట్టించుకోవడం లేదు. ఊచలు పట్టుకుని అరచి, అరచి సొమ్మసిల్లి ఊచల వెంట చేరగిలబడ్డాడు. అతడి కండ్లనుండి కారిన నీరు బండలమీద పడుతున్నది. వెళ్ళిపోతున్న గార్డులు అతడికి మసకమసకగా కనిపించారు.

ఊపిరి పీలుస్తూ అలా ఎంతసేపున్నాడో ''అన్నా'' అన్న పిలుపుకు మెలకువ వచ్చింది. ఇద్దరు ఖైదీలు ఆ గదిని తుడిచి శుభ్రం చేస్తున్నారు. గార్డు దగ్గరకు రాకుండా దూరంగా నిలబడ్డాడు. పోతాలు వారివైపు చూశాడు.

''పాపం, హనుమంతు చచ్చినట్లేనా?''

''చచ్చాడా?'' అన్నాడు బాధగా పోతాలు.

''మాకు తెలియదనుకో! గార్డులనుకుంటున్నారు ఛస్తాడనే! బతకడం నమ్మకం లేదట. బయట పోలీసులకంటే వీళ్ళు మరింత భయంకరంగా ఉన్నారు. వాళ్ళను అందరూ అసహ్యించుకుంటారు వారి సంగతి తెలిసి. కానీ, వీరి సంగతి బయటవాళ్లకు తెలియదు. అందుకే వీరి రంగుబయటపడటం లేదు.''

వారు మాట్లాడుతున్నది వింటూ ఊచలకు తల ఆన్చి ఆలోచిస్తున్నాడు పోతాలు.

సాయంత్రానికి హాస్పిటల్‌నుండి జైలు ఆఫీసుకు వార్త వచ్చింది, హనుమంతు ప్రాణం గాలిలో కలిసిపోయిందని. యాభై మంది గార్డులు పార్కు ఆవరణలో భయం భయంగా నిలబడి ఒకరితో ఒకరు గుసగుస లుపోతున్నారు. ధైర్యంగా ఎవరూ ఏమీ మాట్లా డటం లేదు. వంటరూంవైపు ఒక్క గార్డూ పోవడంలేదు. వంట మనుషులు ఏం చేయడా నికీ చేతులు సాగక బాధపడుతున్నారు. గంజి రూంలోవున్న మిగిలిన ముగ్గురికీ ఈ విషయం తెలిసింది. పోతాలు వలవల ఏడుస్తూ తల ఇనుప ఊచలకేసి కొట్టుకున్నాడు. జైలుకు వచ్చిన తర్వాత, ఏమీ తెలియని జైలు వాతావ రణంలో ధైర్యం చెప్పిందీ, జైలును గురించి వివరాలు చెప్పిందీ అతడే. హనుమంతు లేకుంటే తనకు ఈ రహస్యాలు తెలిసినా అంత తీవ్రంగా తిరుగబడేవాడేకాదు. బయట అలా తిరుగబడటంవల్లనే లోపల తెచ్చివేశా రు. తీరాచూస్తే బయటకంటే భయంకరంగా లోపలి పరిస్థితి ఉంది. తిరగబడటానికి ప్రా ణంపోశాడు హనుమంతు. తన కళ్లముందే అంతలావు మనిషి ఒక అర్భకప్రాణి గార్డుచే తిలో కుక్కచావు చచ్చాడు. మిగిలిన ఇద్దరు ఖైదీలు నోటికి వచ్చినట్లు తిడుతున్నారు. పై నుండి ఖైదీలను బయటకు రానివ్వడంలేదు. తోటలో చెట్లకు నీళ్ళు పోయవలసిన వాడిని కూడా కిందకురానివ్వలేదు.

జైలర్ రిపోర్టు రాయడంలో మునిగాడు. ఏం రాయాలి? ఎలా రాయాలి? అర్థంకావ డంలేదు. సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి వచ్చాడు.

"ప్రభాకరరెడ్డీ! ఖైదీ చనిపోయిన వివరం రిపోర్టు రాయాలి. ఎలా రాద్దామంటావు? జరి గిందిరాస్తే అందుకు బాధ్యులయినవారేకా దు ఇక్కడున్న మనకూ ఈ ఖర్మ చుట్టు కుంటుంది ఎలా?" అన్నాడు పెన్నుతో టకటక మంటూ టేబుల్‌మీద కొడుతూ జైలర్.

సబ్‌జైలర్- జైలర్ టేబుల్ ముందు కుర్చీ వేసుక్కూర్చున్నాడు. జైలర్ ముందున్న కాగితా లలో ఏం రాశాడో చూద్దామని తీశాడు. మూడు కాగితాలనిండా పిచ్చిగీతలు మాత్రమే ఉన్నాయి.

"ఒకపని చేద్దాంసార్" అన్నాడు సబ్‌జైలర్.

చెప్పమన్నట్టు అతనివైపు చూశాడు జైలర్.

"వాడు పారిపోవటానికి ప్రయత్నంచేస్తూ, పైనుండి కిందికిపడి చచ్చాడని రిపోర్టురాస్తే సరిపోతుందనుకుంటాను"

జైలర్ అనుమానంగా అతడివైపు దీర్ఘంగా చూశాడు.

"రెండు సంవత్సరాలకిందట కూడా ఇలాగే మన గార్డులు ఒకడిని కొట్టి చంపారు. అయితే అప్పుడు ప్రాణం ఇక్కడేపోయింది. వెంటనే శవాన్ని సెల్‌పైనుండి కిందికితోసి ఆత్మహత్య చేసుకున్నట్లు చిత్రించాం. అంతటితో గడిచిపో యింది. ఇప్పుడు కూడా అంతకంటే మార్గం కన్పించడంలేదు"

"ఇప్పుడు అలా చేయాలంటే శవం మనవ ద్దలేదు. ఆస్పత్రిలో ప్రాణంపోయింది"

"కావచ్చు. వాడు పారిపోవడానికి ప్రయ త్నంచేసి, సెంట్రీ అవుట్‌పోస్ట్ ఎక్కుతుండగా, పైనున్న సెంట్రీచూచి కేకవేశాడు. ఆ కేకతో తబ్బిబ్బయిన ఖైదీ కిందికి పరుగెత్తబోతూ కాలు మడతపడి పైనుండి గంజి గదులమీద పడి, అక్కడినుండి కిందపడ్డాడు. కథ అలా ముగిస్తేసరి"

"మరి ఈ పోతాలుగాడూ, మరి ఇద్దరు ఖైదీలున్నారు. వారు సాక్ష్యం చెప్పవచ్చుగదా." అన్నాడు జైలర్ అనుమానంగా.

"వారిని అక్కడనుంచి తీసి, పాత సెల్ లోపలకు తోస్తాం. అప్పుడు అక్కడ ఎవరూలేనట్లే. గంజి గదులలో ఎవరూలేరు గనుక, అక్కడ సెంట్రీకూడా ఎవరూలేరు. అందువ ల్ల అక్కడ మనిషి పడిన తర్వాతనే మిగిలిన వారు వచ్చారు"

ఈ ఆలోచన జైలర్‌కు నచ్చింది. వెంటనే గార్డులను పిలిచి, గంజి రూంలలోవున్న ము గ్గురినీ తిరిగి వారి పాతసెల్‌లో పడేయమని ఆర్డరు జారీచేశాడు. గార్డులు ఇద్దరూ అక్కడికి వెళ్ళారు.

"పోతాలూ! మిమ్మల్ని సెల్‌లోనికి పంప మని దొరగారు చెప్పారు." అన్నాడు సెంట్రీ తలుపులుతీసి.

"ఎందుకూ? ఇక్కడే మాకు బాగుంటుంది.




ఎలాగయినా మమ్మల్ని చంపేస్తారు. అక్కడ చంపడమెందుకూ? ఇక్కడే చంపేయండి'' పోతాలు అరుస్తున్నాడు.

''అదంతా మాకు తెలియదు. లోపలికి పంపమని దొరగారి ఆర్డరు''

''నేను లోపలకు వెళ్ళనని మీ దొరగారికి చెప్పుకోవెళ్ళి''

సెంట్రీ తిరిగివెళ్ళాడు. ఒక గార్డు అక్కడే నిలబడ్డాడు. వెళ్ళిన సెంట్రీ పదిమంది గార్డులతో వచ్చాడు. వచ్చినవారు మాట్లాడకుండా పోతాలును ఒడిసిపట్టుకున్నారు. అతని చేతులు వెనుకకు విరిచి కట్టేసి, మిగిలిన ఇద్దరినీ బయటకుతీసి, చేతులుకట్టారు. పోతాలూ, మిగిలిన ఇద్దరూ గింజుకుంటున్నా కేకలేస్తున్నా అరుస్తున్నా తిడుతున్నా గార్డులు లెక్కచేయకుండా పైకి మోసుకెళ్లారు. సెల్ ఆవరణలోని వసారాలో పడేశారు. ఐదు సెల్‌లలోని ఖైదీలు మూసిన తలుపు ఊచల్ని పట్టుకొని గార్డులను తిడుతున్నారు, కేకలేస్తున్నారు. బయటికివస్తే గార్డుల కుత్తుకలు పిసికేస్తామంటున్నారు. గార్డులు వారిమాటలు పట్టించుకోవడంలేదు. జైలు సిబ్బంది నిండా పనిలో మునిగిపోయారు. ఈ సమయంలో ఖైదీల మాటలు పట్టించుకునే ఓపికలేదు. పట్టించుకుని ఏమయినాచేస్తే మళ్ళీ నెత్తికి వస్తుంది. ముందు గండం గడిచిగట్టెక్కాలి. అంతవరకూ ఖైదీలు కూసే బూతుకూతలకు తలలు వంచుకునేవుండాలి.

హెడ్డు పైకివచ్చాడు. వారి కట్లు విప్పమని ఆదేశించాడు.

''పోతాలూ! ఆవేశపడితే లాభంలేదు. జరిగిందేదో జరిగిపోయింది. ఇక తర్వాత కార్యం ఆలోచించాలి. మీరు మంచిగావుంటే తొందరగా శిక్ష పూర్తిచేసుకుని బయటకుపోతారు''

''ఈ నీతులు ఎవరికి కావాలి! నీ చరిత్రలో ఏ ఒక్క ఖైదీనయినా సరిగా చూశావా? మీకు ఖైదీల ప్రాణాలు తీయడం ఇది కొత్తకాదు గదా! మీ నీతులూ అలవాటే. ఆ తర్వాత ఖైదీలను బాదడమూ అలవాటే. ఇప్పుడయినా మేం చేసేదేమిటి? కానియ్... నీయిష్టం వచ్చినట్టు''

''సరే! మీతో మాట్లాడే తీరిక మాకులేదు.'' అంటూ సెల్ తలుపువద్దకువెళ్ళి ''రేయ్! మర్యాదగావుండకుంటే తోలుతీస్తాం! కూతలు కూయకండి'' అంటూ హెచ్చరించాడు.

హెడ్డు ముఖంచూచి ముందున్నవారు అరవడంలేదు. తమ ముఖాలు గుర్తుపట్టి రేపు నలగగొడతారన్న భయంతో. కాని వెనుకనున్నవాళ్ళు కేకలేస్తూ, హెడ్డూ, అతని భార్యాపిల్లల్ని బండబూతులు తిడుతున్నారు. తలుపులు తెరవమని అరుస్తున్నారు.

సబ్‌జైలర్ లాఠీ తీసుకుని భీకరంగా చూస్తూ పైకి వచ్చాడు. ఒక సెల్ ముందుకువెళ్ళి ''లోపల కేకలేసేది ఎవర్రా! రేయ్ సెంట్రీ తలుపుతీయ్! ఈ నాకొడుకులకు బాదితేగాని తెలివిరాదు'' అనేసరికి లోపల అరుపులు సద్దుమణిగాయి. సెంట్రీ తలుపు తీయడానికి రాలేదు. ఒకవేళ తలుపుతీస్తే, ఖైదీలు మీదికి ఉరుకుతారని వారి భయం. రెండోసారి కూడా సబ్ జైలర్ ఆజ్ఞాపించేసరికి సెంట్రీ అక్కడికి వచ్చాడు. అపాటికి మనసు మార్చుకుని, అన్ని సెల్ తలుపులవద్దకు తిరిగాడు సబ్‌జైలర్. ఆవరణలో గార్డుల దగ్గరికి వచ్చాడు.

''ఏయ్ పోతాలూ! మర్యాదగా లోపలకు వెళ్లండి'' అంటూ హూంకరించాడు.

''ఏం! హనుమంతులాగా మమ్మల్ని చంపేస్తావా! అంతకంటే నువ్వేం చేయలేవు. అయినా ఖైదీల రేషన్ తిని బతికే మీకు మనిషి ప్రాణం విలువ ఎలా తెలుస్తుంది? ఒక్క విషయం మాత్రం నువ్వు గమనించలేదు. వడ్లగింజలుతినే ఎలుకల గతేమిటో నీకు తర్వాత తెలుస్తుంది''

''నోరుముయ్‌బే! అతిగా నీల్గుతున్నావ్! మరీ మాట్లాడితే నీవూ అదే గతికివస్తావ్ బే!'' అరిచాడు హెడ్డు.

''ఒరేయ్! దొంగసాక్ష్యం చెప్పే వెధవ్వే నువ్వా ఒక మొగోడివేరా?'' అన్నాడు గంజి ఖైదీలలో ఒకడయిన సలీం.

''తంతాన్‌రేయ్'' అంటూ దూకుడుగా వెళ్ళాడు హెడ్డు. కాని చెయ్యి చాపడానికి ధైర్యం చాలడంలేదు.

''మా కట్లు విప్పిచూడరా, ఎవరు ఎవరిని

తంతారో తెలుస్తుంది'' అన్నాడు మరో ఖైదీనా రాయణ.

సబ్‌జైలర్ అతడి వీపుమీద లాఠీతో బాదా డు. గార్డులువచ్చి తన్నుతూ అతన్ని కిందపడ వేసి సెల్‌లోనికి తోశారు. మిగిలిన ఇద్దరినీ తోసుకుంటూ లోపలకు తీసుకెళ్ళారు.

పోతాలు పండ్లు పటపటకొరికాడు. ''ఒ రేయ్! యూనిఫాం వేసుకున్నంత మాత్రాన నీవు మొనగాడిననుకోకురా! నీ రక్తం త్రాగిన తర్వాతే ఈ జైల్‌విడుస్తాను నేను'' పిడికిలి బిగించి చెప్పాడు.

''నోరుముయ్యి నువ్వర్!'' అన్నాడు హెడ్డు.

ముగ్గురినోళ్ళూ మూసి ఒక సెల్ తలుపులు తెరిచారు లోపలవేయడానికి. లోపలున్న ఖైదీ లు ముందున్న ఖైదీలను నెట్టడంతో బయ టకు పడ్డారు. దాదాపు వందమంది ఖైదీలు ఒక్కుమ్మడిగా బయటకు పరుగెత్తడంతో గార్డు లు దిక్కుతోచక లాఠీలు చేతికి తీసుకుని గాలిలో తిప్పసాగారు.

ఇద్దరు గార్డుల్ని కిందపడవేసి కాళ్ళతో తన్నసాగారు ఖైదీలు. పదిమంది గార్డుల్లో మిగి లిన ఎనిమిదిమంది ఇకసాధ్యంకాదని బయ టకు పరుగెత్తసాగారు. వారి కంటేముందే సబ్ జైలర్ పారిపోయాడు. కిందపడిన గార్డు దగ్గరి నుండి ఒకఖైదీ తాళాలు తీసుకుని మిగిలిన సెల్ తలుపులు కూడా తెరవడంతో నాలుగు వందల మందిదాకా ఉన్న ఖైదీలు, రిమాండ్ ఖైదీలు బయటకు పరుగెత్తి దొరికిన ఇద్దరు గార్డుల్ని చిత్తుచిత్తుగా కొట్టి ఒక సెల్‌లో పడేసి తాళం వేశారు. ఆవరణలో ఖైదీలు గార్డులనూ, జైలర్‌లనూ బండ బూతులు తిడుతూ బయ టకు పోవడానికి ప్రయత్నించడంతో, బయట రెండోతలుపును తాళంవేసిబిగించారు గార్డు లు. దూరంగావున్న మహిళా ఖైదీల సెల్ తలుపునుండి ఆసక్తిగా తొంగిచూస్తున్నారు వాళ్ళు.

పావుగంట గడిచింది. సెల్‌లపైగా పోలీసు లు వచ్చారు. అందరిచేతులలో తుపాకులు న్నాయి. సబ్‌జైలర్ ముందుకు వచ్చి అరిచా డు.




''మర్యాదగా లోపలకు వెళ్ళండి, లేకుంటే కాల్చివేస్తాం''

రెండుకాళ్ళ మధ్య చూపిస్తూ ''ఇక్కడ కా ల్చుకో'' అన్నాడు ఒక ఖైదీ. మరొకడు చొక్కా విప్పిగాలిలోకి ఆడిస్తూ ''కాల్చుకో'' అన్నాడు. సబ్‌జైలర్ మాటవినే పరిస్థితిలేదని గార్డులు అర్థం చేసుకున్నారు. తుపాకులుగురి చూసు కుంటున్నారు ఆర్డర్ కొరకు ఎదురుచూస్తూ.

హెడ్‌కానిస్టేబుల్ ఒకసెల్‌పై నుండి ముందుకు చూస్తూ ''బచ్చే! అందర్ జావ్! లేకుంటే మీకూ హనుమంతుగాడిగతే పడు తుంది'' అన్నాడు.

కిందినుండి ఎవరో ఒక ఇటుక గడ్డతీసి హెడ్డుకు గురిచూచి విసిరాడు. హెడ్డు ముక్కు పగిలింది. బొలబొలమని రక్తం కారుతూ కిందకు జారి గుడ్డలమీద పడింది.

సబ్‌జైలర్ ఆజ్ఞమీద పైనుండి కాల్పుల వర్షం ఆరంభమయింది. ఒకరికి భుజంలో తూటా దిగింది. మరొకడి చేతికి, ఇంకొకడికి తొడలో. అంతవరకూ ఆవేశంగా అరచినవారు ఏడుస్తూ లోపలకు పరుగెత్తారు. లోపలకు ఖైదీ లందరూ వెళ్ళిన తర్వాత కూడా ఖాళీ ప్రదే శంమీద కాల్పులు సాగించారు. ఆవరణలో అక్కడక్కడా నలుగురు పడివున్నారు. వాళ్ళు చచ్చారో బతికారో తెలియదు. సబ్‌జైలర్ ఆజ్ఞ మీద ఇరవైమంది గార్డులు కిందికి దిగారు. పైన ఇరవైమంది తుపాకులతో నిలబడ్డారు. దిగిన ఇరవైమంది సెల్ తలుపులు బిగించి తాళాలు వేశారు. పైనుండి మిగిలిన వారు కిందకిదిగారు. వారి చేతిలో ఉన్నతమ గార్డుల ను విడిపించుకోవాలి. అందరూ ఒకసెల్ దగ్గరకు వెళ్ళి తాళం తీశారు. తుపాకులు బారుచేసుకొని కొందరు నడుస్తుంటే, మరి కొందరు ఖైదీలను లాఠీలతో బాదుతూ సెల్ మొత్తం వెతికారు. ఎవరూ దొరకలేదు. ఖైదీ లందరినీ లోపలవడవేసి సెల్ తాళం వేశారు. మరోసెల్ అలాగే వెదికారు. మూడోసెల్‌లో ఇద్దరు గార్డులు స్పృహలేకుండా దొరికారు. మూ డో వార్డులో ఉన్న దాదాపు ఎనభైమంది ఖైదీల ను కిందపడవేసి, లాఠీలతోబాదారు. గార్డుల ను తీసుకొని ఆవరణలోనికి వచ్చారు. ఆవర ణలో పడివున్న నలుగురిని కిందకు తీసుకవ చ్చా<sup></sup> జైలర్ ఆఫీసుముందు వరుసగా పడుకో

బెట్టారు. వారు మూలుగుతున్నారు.

జైలర్ అక్కడికి వచ్చాడు. ఈతతంగం చూచి అతడికి ఒకవైపు విసుగూ, కోపమూ, మరోవైపు భయం వేస్తున్నది. ఖైదీలమీద కాల్పులు జరిపినందుకు పైఆఫీసర్లకు రిపోర్టు రాయకతప్పదు. చచ్చిన ఖైదీ విషయంలోనూ ఎంక్వయిరీకి వస్తారు. కాల్పుల విషయంలోనూ విచారిస్తారు. ఇదంతా అనవసరంగా జరిగింది. వారిని గంజి రూములనుండి బయటకు ఏనాడో తీయవలసింది. ప్రభాకరరెడ్డి పట్టుదలవల్ల తీయలేక పోయాడు. చివరకు ఒకదానికొకటి గొలుసులాగా సంఘటనలు ఆరంభమయ్యాయి. బయట నిజాయితీగా ప్రవర్తించిన పోతాలు ఇక్కడ లొంగి ఉంటాడని తాను ఆశించాడు. కానీ అతగాడు చెలరేగాడు. బయట రిక్షా వాళ్ళను రెచ్చగొట్టాడు. ఇక్కడ ఖైదీలను రెచ్చగొడుతున్నాడు. బయట అతడికి తాను సహకరించాడు. ఈ రోజు లోపల అతన్ని ఎదుర్కోవలసి వస్తున్నది.

నలుగురి నాడీ చూశాడు. హాస్పిటల్‌నుండి అంబులెన్సు వచ్చింది. డాక్టర్ దిగి వారిని పరిశీలించి "ఒకేరోజు ఇదేమిటి ఇలా జరిగింది?" అన్నాడు.

అతడికి చెప్పుకోవలసిన అవసరం తనకు లేకున్నా వారితో చీకాకెందుకన్నట్లు "ఖైదీ చనిపోతే తోటి ఖైదీలు తిరుగుబాటు చేశారు. తత్ఫలితంగా ఇది తప్పదు" అన్నాడు జైలర్. వారిని అంబులెన్సుకు చేర్చుకుని వెళ్ళిపోయారు.

జైలర్ పైఆఫీసర్లకు. ఫోన్ చేయడానికి రింగ్‌చేశాడు. రిపోర్టు రాయడానికి సబ్‌జైలర్ కూర్చున్నాడు. హెడ్డు అటూఇటూ తిరుగుతూ చేతులూపుతున్నాడు.

వంట వార్డర్ నజీం హెడ్డు దగ్గరికి వచ్చాడు. "సాబ్! ఆరుగంటలయింది. ఖైదీలకు పైకి అన్నం తీసుకెళ్ళాలి" అన్నాడు చేతులూపుతూ. హెడ్డు శరీరం కింది నుంచి పైకి ఊగింది. ఖైదీలు తిరుగుబాటు చేస్తే ఇంతదాకా వారితో పోరాటం చేసి లోపల త్రోసివచ్చారు. ఇప్పుడు వారిని కూటికోసం బయటకు తీస్తే మళ్ళీ యుద్ధం తప్పదు. అందరి కోపం వార్డరు మీద చూపించాడు హెడ్డు. మెడమీద చెయ్యివేసి తోస్తూ "జావ్‌రే బేవకూఫ్" అన్నాడు గర్జిస్తూ. నజీం ఒక్క ఉరుకుతో అక్కడి నుండి పరుగెత్తాడు. హెడ్డు ఆలోచించాడు. తననెత్తిన ఆ బరువెందుకు పెట్టుకోవాలి. జైలర్ అన్నం పెట్టమంటాడేమో? అని లోపలకు వెళ్ళాడు. ఏమిటన్నట్లు అతడివైపు చూశాడు జైలర్.

"వంట అయిందటసాబ్! పైకి తీసుకెళ్ళమంటారా?"

"ఈపూట తిండిలేదూ, బండిలేదూ ఫో" కసురుకున్నాడు.

హెడ్డు బతుకుజీవుడా అనుకుంటూ బయటకు వెళ్ళాడు. తిరిగి ఖైదీలదగ్గరకు వెళ్ళి వారి ముఖం చూడటానికి గార్డులకు కూడా సిగ్గుగా ఉంది. ఈపూట ముఖం తప్పించడం మంచిదనుకున్నారు. వంట ఇక తమవరకూ రాదని ఖైదీలకు తెలును. ఇంతరాద్ధాంతం జరిగాక ఇంకా తిండి తెచ్చిపెట్టడం అసంభవమే! అయినా కొందరు చీకటి పడేవరకూ ఎదురు చూశారు. లైట్లు వెలిగాయి, బండిమాత్రం రాలేదు. ఆ సంఘటనతో భయవిహ్వలులైన ఖైదీలు దుప్పట్లు కప్పుకుని వణకుతూ పడుకున్నారు.

కింద వంటరూంలో పదిమంది ఖైదీలు, యాభైమంది గార్డులు తృప్తిగా తిన్నారు. జైలర్ కిందికి దిగివెళ్ళాడు.

సబ్‌జైలర్ హెడ్‌కానిస్టేబుల్‌ని పిలిచి "వండిన అన్నం గార్డులను ఇంటికి తీసుకెళ్ళమను" అంటూ ఆర్డర్ జారీచేశాడు. గార్డులు బిలబిలమంటూ వంటరూంలో జొరబడ్డారు. దినపత్రికలు చింపి, యాభైపొట్లాలు కట్టారు. ఒక గిన్నెనిండా హెడ్‌కానిస్టేబుల్ కొరకు ఉంచారు. గార్డులు తినగా మిగిలిన అన్నం ఇళ్ళకు తీసుకెళ్ళారు. రాత్రి తొమ్మిది గంటలదాకా గార్డుల కోలాహలం వంటరూం వద్ద సాగుతూనేవుంది. పైన నాలుగు వందలమంది ఖైదీల కడుపులు ఆకలితో నకనకలాడుతున్నాయి. తమకొరకు వండిన అన్నం ఏమయిందో వారికి తెలియదు. గార్డులు చిత్తం వచ్చినట్లు తింటారని తెలును. ఖైదీల రేషన్ ఇళ్ళదగ్గరున్న గార్డ్ ఖైదీలకు కూడా తీసుకెళ్ళా





రని వాళ్ళు ఊహించలేదు, ఊహించలేరు.




జైలులో ఓ ఖైదీ ఆత్మహత్య, మిగతా ఖైదీల తిరుగుబాటు గురించి విచారణ జరపడానికి పై అధికారి వస్తున్నట్లు వార్తలందాయి.

ఆవార్త తెలిసిన జైలర్ రామయ్యా, సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి ఆలోచనలో పడ్డారు. వచ్చే అధికారి, అన్నీకూలంకషంగా చర్చించడానికే ప్రయత్నిస్తాడు. ఖైదీలతో చర్చసాగిస్తాడు. వారందరినీ విచారణ జరపడమే జరిగితే, అన్నివిషయాలూ బయటపడతాయి. ఆ తర్వాత తాము అపరాధులుగా నిర్ధారించబడతారు. అందువల్ల పోతాలుతో రాజీపథకం ఆలోచించారు. పోతాలును ఒక్కడినీ లొంగదీసుకుంటే, మిగిలిన ఇద్దరు ఖైదీలు అతని మనుషులేగనుక, వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పరు. ఆ ముగ్గురే ప్రత్యక్షంగా చూసిన వ్యక్తులు. మిగిలినవారు పుకారుతో తిరుగుబాటు చేసిన వాళ్లు.

పోతాలును ఆఫీసుకు పిలిపించారు. వారు పిలిచింది ఎందుకో తెలియకున్నా రాననే అవకాశంలేదు. తాను అక్కడ ఖైదీ. అధికారి పిలిచినచోటికి రావలసిన బాధ్యత తనది.

పోతాలు ఆఫీసులో అడుగుపెట్టేటప్పటికి జైలర్ రామయ్యా కుర్చీలో కూర్చునివున్నాడు. సబ్‌జైలర్ చేతులువెనక్కు కట్టుకుని అటుఇటు తిరుగుతున్నాడు. బయట నలుగురు గార్డులు పచార్లుచేస్తున్నారు.

''ఆ కుర్చీలో కూర్చో పోతాలూ.'' అన్నాడు జైలర్.

''ఏమిటీ? జైలులో ఖైదీలకు ఇంత మర్యాద ఇస్తారని నాకు తెలియదే?'' అన్నాడు పోతాలు నవ్వి.

''అందరికీ దొరకకపోవచ్చు. ఖైదీలయొక్క స్థాయి, ప్రవర్తనను బట్టి కొందరికి మర్యాద ఇవ్వాల్సి ఉంటుంది కదా.''

''అయితే నేనెంత మర్యాదస్థుడినో అందరికంటే తమరికి బాగాతెలును. బయట రిక్షాతొక్కుకుని తిరిగే వ్యక్తిని. జైలులో అధికారుల మీద తిరుగబడిన వ్యక్తిని. ఇటువంటివాళ్ళకు ఇక్కడ మర్యాదనేది ఉంటుందా?''

''మనిషి నిజాయితీని బట్టి ఉండటంలో తప్పులేదనుకుంటాను''

''నానిజాయితీని గుర్తించినందుకు థాంక్స్. నేను నిలబడే మాట్లాడగలను. ఏం మాట్లాడాలనుకున్నారో చెప్పండి వింటాను''

జైలర్ ఊపిరి పీల్చి దీర్ఘంగా శ్వాసవిడిచాడు. తర్వాత ఎడమచేతితో తల గీరుకుని, క్రాపుసరిచూసుకున్నాడు. కిటికీగుండా బయటకు చూసి, తలత్రిప్పి సబ్‌జైలర్‌వైపు చూశాడు.

సబ్‌జైలర్ గంగిరెద్దులా అటూఇటూ తిరుగడంలో మునిగిపోయాడు. వీరివైపుచూడటంలేదు.

''సరే... విషయానికొస్తాను. నీతో మాకు అవసరంపడింది. అంటే నీసహాయంమాకు కావాలి. దానికి ప్రత్యుపకారం నీవు కోరేదేదైనా ఇస్తాము''

''న్యాయమయిన సహకారమయితే తప్పకుండా ఇస్తాను''

''న్యాయాన్యాయాలు తీసిపారెయ్యి. సమాజంలో అన్నీ నీతితోనూ, న్యాయంగానూ జరగడంలేదు. అనుకోకుండా జరిగే కొన్నింటివల్ల అన్యాయంకూడా జరగవచ్చు. అంతమాత్రాన అతడు కావాలని అన్యాయంచేశాడని భావించలేంకదా''

పోతాలు మాట్లాడలేదు.

''మొన్నజరిగిన హనుమంతు మరణం గురించి రేపు ఇక్కడికి సూపరింటెంట్ ఎంక్వాయిరీకి వస్తున్నాడు. ఈవిషయంలో నీ సహకారం కావాలి. నువ్వు ఒక్కడివీ మాకు అనుకూలంగా మాట్లాడితేచాలు''

''ఇంకా కొందరు స్వయంగా చూసినవారున్నారు కదా''

''ఆవిషయం మేంచూసుకుంటాం. నీవు ఒక్కడివీ చూడలేదనీ, ఆ సమయంలో గంజి రూములో నిన్ను ఉంచలేదనీ తెల్పితేచాలు.''

''జైలర్‌గారూ! హనుమంతు హత్య స్వయంగా చూశాను. అతడు ఎంత మరణవేదనతో అరిచాడో స్వయంగా విన్నాను. దాన్ని కప్పిపుచ్చి చెప్పటం కంటే నీచమైంది ఇంకొకటుంటుందా?''

''ముందే చెప్పాను, అవసరాన్నిబట్టి మనం మారుతూ ఉండాలని''

''నిజమే! కానీ... నేను అలామారే వ్యక్తిని కాదని మీకుబాగా తెలుసు.

''దానివల్ల మాకు నష్టం ఉంటుందని నీకు తెలుసు. మేము నష్టపోవడమనేదే జరిగితే ఆతర్వాత నీవిషయంలో తీవ్రపరిణామాలు ఏర్పడతాయి''

''ఇటువంటి బెదిరింపులకు బయట లొంగకపోవడంవల్లే రెండు సంవత్సరాలపాటు జైలు లోపలకు తోశారు. ఇక్కడ కూడా అదే బెదిరింపయితే దాన్ని ఎదుర్కోడానికే సిద్ధంగా ఉంటాను''

టేబుల్‌సొరుగునుండి రెండు వందరూపాయల కట్టలుతీసి, టెబుల్‌మీదవేశాడు. ''ఇరవైవేలు! నీ జీవితమంతా రిక్షా త్రొక్కినా సంపాదించలేవు. నీవు మాకోసం సాక్ష్యం చెబుతానంటే ఇప్పుడే బ్యాంకులో నీపేర అకౌంటుతెరచి, అందులో ఈ డబ్బు వేస్తాను''

''నన్ను కొనడం మీచేత కాదు. ఆ విషయం బయటే నిరూపించాను. ఇటువంటి అనవసర ప్రయత్నాలతో మీకాలం వృథాచేసుకోకండి. జరిగిన నిజం చెబుతాను. అబద్ధంగానీ, కల్పించిగానీ చెప్పదలచుకోలేదు''

''దీనివల్ల వచ్చే పరిణామాలు తీవ్రంగా ఉంటాయి''

పోతాలు పలుకలేదు.

సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి పోతాలు దగ్గరగా వచ్చాడు. ''మూర్ఖుడు అంది వచ్చేదాన్ని కాలదన్నుకుంటాడు పోతాలూ. మూర్ఖంగా ప్రవర్తించి వచ్చింది పోగొట్టుకోవద్దు. సరే... ఆఖరి మాట లక్షరూపాయలు''

''వేలం పాటా ఏమిటి?'' అన్నాడు పోతాలు. ''ఖైదీల రేషన్‌దోచి మీరిద్దరూ చాలా సంపాదించినట్లున్నారు. ఆ డబ్బుతో నన్ను కొనాలని ప్రయత్నిస్తున్నారు. కానీ... అది సాధ్యంకాదని నేనుకూడా ఆఖరిసారిగా చెబుతున్నాను''

''సరే... వెళ్ళు'' అన్నాడు జైలర్.

పోతాలు వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

''వీడు లొంగడని ముందే చెప్పాను. ఇప్పుడేం చేయాలి?'' అన్నాడు జైలర్. ప్రభాకరరెడ్డి ఆలోచిస్తూ, కుర్చీలో కూర్చుని టేబుల్‌మీద తలవాల్చాడు.

బయట గార్డులు గుసగుసలాడుతున్నారు. వంటయినట్లుంది. ఖైదీలు పైకి వంటలు తీసుకెళ్తున్నారు.

''రేపు వీడ్ని లేకుండా చేయాలి?'' అన్నాడు సబ్‌జైలర్.

''ఏదోఒకటి చేయగలం. కానీ అందువల్ల సమస్య తీరదు. వాడి మనుషులు కొందరు లోపలున్నారు. వారు విషయం చెబుతాఋ ఆ తర్వాతయినా వీడి సాక్ష్యం నమోదుచేయకతప్పదు''

''తొలగించడంవల్ల తాత్కాలికంగా కొంతలో కొంతమేలు. ఆ తర్వాత సమస్య అప్పుడే ఆలోచిద్దాం!'' అన్నాడు సబ్‌జైలర్.

తల ఊపాడు జైలర్.

గార్డులు పైన వంటవడ్డించే చోటుకు వెళ్ళారు. ఈ నాలుగురోజులుగా మంచి భోజనం వస్తున్నది. కూరలు బాగుంటున్నాయి. మాంసం కూడా ఆదివారం మంచిదే దొరికింది. ఇన్ని తగవులూ, తతంగమూ జరిగాక పోతాలు చేసిన పనివల్ల చాలామంచి జరిగిందని ఖైదీలు నమ్మారు. వారి దృష్టిలో పోతాలుకు గౌరవమేర్పడింది. అంతకుముందు కిలో అన్నమని తూస్తే సగం కడుపుకు కూడా రాదు, ఇప్పుడు సామాన్యఖైదీ తినలేకపోతున్నాడు. మిగిలిన అన్నం వృధా అయిపోతున్నది. ఇంతకుముందు ఈ రేషన్ ఎవరెవరు తింటున్నారో పోతాలు సోదాహరణగా రోజూ






వివరిస్తుంటే ఖైదీలు ఆశ్చర్యంగా వింటున్నారు.

పదకొండు గంటలయింది. భోజనాలు పూర్తయ్యాయి. వంటమనుషులు కిందికిదిగారు. గార్డులు కూడా ఎవరిత్రోవన వాళ్ళు వెళ్ళారు. ఖైదీలు సుష్టుగాతిని తమతమ సెల్‌లోనికి వెళ్ళారు.

ఖాసిం టోపీతో నోరు తుడుచుకుంటూ పోతాలు సెల్‌లోనికి వచ్చాడు. ఆ పాటికి పదిమంది అక్కడికిచేరి మాట్లాడుకుంటున్నారు. పోతాలును ఏపనికి పంపించాలో అధికారులు నిర్ణయించుకోలేదు. అందువల్ల ఖాళీగానే ఉంటున్నాడు.

"రా ఖాసిం" అన్నాడు సలీం.

సలీంపక్క చతికిలబడ్డాడు ఖాసిం. గంజాయి చేతిలో పోసుకుని నలుస్తూ కూర్చున్నాడు.

"ఇది కూడా దొరుకుతుందా?" అన్నాడు పోతాలు ఆశ్చర్యంగా. ఖాసిం తలపైకెత్తి పగలబడి నవ్వాడు.

"అయ్యా! ఇది-అది అనేది ఏమీలేదిక్కడ. అన్నీ దొరుకుతాయి"

"అన్నీఅంటే!" రెట్టించాడు.

"ఆడదానితోసహా" ఒత్తిపలికాడు ఖాసిం.

"ఇది జైలు కాదా"?

"ఎవరికీ? నీకూ నాకూ జైలు. అందరికీ అవసరంలేదు. హెడ్డుగానికి నెలకు పంప

సమర్పించుకుంటే, సారాయి సీసాలు చంకలో పెట్టుకుని తిరుగొచ్చు! మరో నాలుగొందలు వెరసి అయిదొందల రూపాయలు ముడుపుకట్టి ఇచ్చావనుకో, ఆడవాళ్ళుకూడా దొరుకుతారు'' చిలుం గొట్టంలో గంజాయి దట్టించి వెలిగించి, ఒక్కదమ్ములాగాడు.

''ఎవరయినా పీల్చేవాళ్ళుంటేరండి, తోడుంటేనే మజా!''

నలుగురు చేరారు. ఒకరి తర్వాత ఒకరు గొట్టం అందుకుంటున్నారు.

''ఆడవాళ్ళు ఎక్కడనుండి వస్తారని అడగొచ్చు సలీం! ఈపాటికే నీకా అనుమానం వచ్చి ఉంటుంది. నీవు అడక్కముందే చెబుతున్నాను విను. వ్యభిచారం కేసుల్లో వచ్చిన ఆడఖైదీలు కొందరు ఇక్కడున్నారు. ఇప్పుడేకాదు, ఎప్పుడూ వస్తూపోతూ ఉంటారనుకో! రాత్రి ప్రొద్దుపోయిన తరువాత, ఈ హెడ్డుగాడు, కావలసిన ఖైదీకి, వాళ్ళను సెల్‌నుంచి తెచ్చి గంజిరూముల్లో తారుస్తారు. గంజిరూముల్లో మీలాంటివాళ్ళు ఎప్పుడో ఉంటారుతప్ప మిగిలిన సమయాలలో ఖాళీగానే ఉంటాయి. అవి వాటికి ప్రధానకేంద్రాలు.''

పోతాలు మాట్లాడలేదు.

''ఈ జైలుగురించి నీకు చాలా తెలుసే!'' అన్నాడు నారాయణ గంజాయిదమ్ము లాగుతూ.

''భయ్యా! సంవత్సరానికి పదినెలలు నేను ఈ జైలుకు అతిథిని. ఈ జైలేమిటి? ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జైళ్ళూ చూశాను!. అందులో ఇదెంత? కోన్‌కిస్కా''

తర్వాత ఎవరూ మాట్లాడలేదు. కిటికీగుండా వస్తున్న చల్లగాలికి ముడుచుకుని కూర్చున్నారు. అసలే అది కొండప్రాంతం. ఎత్తయిన కొండమీద ఎప్పుడోకట్టిన కోటను జైలుగా మార్చారు. ఎత్తుమీద ఉన్న కారణాన ఎంత ఎండాకాలమయినా చల్లటిగాలి వస్తుంటుంది. చలికాలం భయంకరంగా ఉంటుంది.

''పోతాలూ! ఇక్కడో ఘోరం జరిగిపోతున్నది. దీని విషయం నువ్వేమయినా కలుగచేసుకోగలవా?''

ఖాసిం మాటలకు పడుకున్న పోతాలు లేచి కూర్చున్నాడు.

''ఏమిటో చెప్పు''

''ఈ జైల్లోనే కొంతమంది బాలఖైదీలను ఒక సెల్‌లో వేశారు. వారితోబాటు వంటఖైదీలు ఆ రూంలోనే ఉంటారు. ఈ వంటవార్డరు నజీంగాడు ఆ పిల్లలను తన కామానికి వాడుకుంటున్నాడు. వారికి కడుపునిండా కూడుపెడతాడు. వంటగదినుండి రూంకు వచ్చేటప్పుడు కూడా వారికి అన్నం తెస్తాడు. కడుపునింపుకోడానికి ఆ పిల్లలు ఆత్రపడుతుంటే వీడు ఆ అవకాశం ఉపయోగించుకుని, వారిని నానాబాధలు పెడుతున్నాడు. ఇంతకుముందు జైలర్ ఉన్నప్పుడు ఈ విషయం తెలిసి, నజీంగాడిని తన్ని వేరే సెల్‌లో వేశాడు. అతడు ట్రాన్స్‌ఫర్ అయిన తరువాత సబ్‌జైలర్ తిరిగి వాడిని అదేరూంలో పడేశాడు. వాడిని అణచకుంటే ఈ పిల్లలు చెడిపోవడం ఖాయం''

పోతాలు లేచి ఖాసిం దగ్గరగావచ్చి ''నిజమా?'' అన్నాడు ఆశ్చర్యంగా. జైలులోనే ఆవిధంగా జరుగుతున్నదంటే అతడు నమ్మలేకపోతున్నాడు.

''పచ్చినిజం! కావాలంటే ఆ పిల్లల్నే పిలిపిస్తాను, మాట్లాడండి'' అంటూ లేవబోయాడు. పోతాలు వారించాడు.

''వారి విషయం తర్వాత చూద్దాం. రేపు జైళ్ళ సూపరిండెంట్ ఈ జైలులో జరిగిన హత్య, ఖైదీల తిరుగుబాటు గురించి విచారణకు వస్తున్నాడు'' అంటూ అంతవరకూ తనకూ జైలర్‌కు జరిగిన సంభాషణ ''వివరాలన్నీ చెప్పి, రేపు వచ్చే సూపరిండెంట్ ముందు ఈ విషయాలన్నీ ఆధారాలతో బయటపడితే, ఈ అధికారులిద్దరూ ఇంటికెళ్ళి కూర్చోవలసి వస్తుంది... ఈ విషయంలో ఖైదీలందరూ ఐక్యంగా నిలబడి జరిగింది చెప్పాలి'' అన్నాడు.

''తప్పకుండా చెప్పాలి. ఈ ఇద్దరు అధికారులు ట్రాన్స్‌ఫర్ అయ్యారంటే, వచ్చేగాడిదలయినా, భయంగా నీతిగా ఉంటారు. నాసామిరంగా! ఈ నాలుగు రోజులుపెట్టే తిండి రోజూ పెడితే సంవత్సరానికి మూడొందలా అరవై

అయిదురోజులూ నేను లోపలే వుంటాన య్యా'' ఖాసిం మత్తుగా మాట్లాడుతున్నాడు.

ఈ మత్తుగాడితో ఏంమాట్లాడినా లాభంలేదని పోతాలు బయటకు వచ్చాడు. వసారాలో నిలబడ్డాడు.

పక్కసెల్‌నుండి నరహరి పోతాలును చూసి నవ్వి అక్కడికి వచ్చాడు.

''ఏమిటి విశేషాలు?''

పోతాలు చెప్పాడు.

''ఇంకేం! జరిగింది చెప్పడానికి ఎవడు భయపడతాడయ్యా! రానీ... ఆ వచ్చే వాడయినా నీతిమంతుడయితే జైలు పరిస్థితి మారిపోతుంది. వాడూ నీతిపరుడు కాదనుకో చేసేదేముంది?''

''దెబ్బలు తగిలిన వారి గురించి వివరాలేమైనా తెలిశాయా?''

''అందులో ఒకడు బతకడం ఖాయం. మిగిలిన ముగ్గురి గురించి గుస గుసలుసాగుతున్నాయి. ఏదయినా ఆ గార్డుగాళ్ళు మనకు ఇచ్చే వివరాలనిబట్టే వుంటుంది''

వీళ్ళు మాట్లాడుకుంటుండగానే ఎనిమిది మంది ఖైదీలు కొత్తవారు లోపలకు వచ్చారు. అందరికీ చంకల్లో కంబళ్ళు, ఒక చేతిలో పళ్ళెం, గ్లాసు, నెత్తికి టోపీలు ఉన్నాయి. తొడుక్కున్న జత తప్పరెండో జత గుడ్డలు ఎవరికీలేవు. వారిని తీసుకొచ్చిన గార్డులు, 'రేయ్ ఇటు ఇటు,' అంటూ సెల్ వైపు నడిపిస్తున్నారు. వారిని చూసిన పోతాలు ఆనందంతో గట్టిగా ''అరే పుల్లయ్యా'' అంటూ అరిచాడు.

ఖైదీలు ఇటు తిరిగిచూసి- గార్డులు అరుస్తున్నా వినకుండా, పోతాలు వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చారు. పుల్లయ్య పోతాలును గట్టిగా కౌగలించుకున్నాడు. ''ఎన్నాళ్ళు శిక్ష పడింది మీకు?''

''మాకూ మీతోపాటే రెండు సంవత్సరాలు పడింది. మిమ్మల్ని సెంట్రల్‌జైలుకు తీసుకెళ్ళి ఉంటారేమో అనుకున్నాం. మీరు ఇక్కడే ఉన్నారన్నమాట''

పోతాలు తల ఊపాడు.

''మా సెల్ లోపలికి వెళ్దాం రా'' అంటూ పోతాలు కదిలాడు.

''అరే! వీరిని నాలుగో సెల్‌లో వేయాలి'' అన్నాడు ఒక గార్డు.

''ఒకటో సెల్ అయినా బాగానే ఉంటుంది లేవయ్యా ఆ సెల్‌లో యాభైమందికి స్థలం లేదు. ఇప్పటికే వందమందిని కూర్చారు. ఒకటో సెల్‌లో పదిహేనుమంది కూడా లేరు''

పోతాలుతో పోట్లాట పెట్టుకోడానికి గార్డులు సిద్ధంగాలేరు. ఏదో ఒక సెల్‌లో చావనీ లెమ్మని లాఠీలు ఊపుకుంటూ వెనక్కి తిరిగారు.

పుల్లయ్య ఆశ్చర్యంగా చూసి- ''ఈ గార్డులు నీ మాట బాగానే వింటారే'' అన్నాడు.

''అదంతా పెద్ద కథ'' అంటూ ఒకటో సెల్‌లోనికి వచ్చాడు. అక్కడున్న మిగిలినవారు కూడా వీరిని చూసి ఒకరినొకరు ఆనందంతో కౌగలించుకున్నారు.

సాయంత్రం నాలుగు గంటలయింది. పొలం వెళ్ళిన ఖైదీలు కూడా తిరిగి వచ్చారు. అందరూ ఆవరణలో చేరారు. దాదాపు నాలుగొందల వరకూ ఉన్నారు. ఆ సమయంలోనే వారికి కొంచెం తీరిక. తిరిగి ఐదున్నరకు అన్నం తినడం ఆరంభిస్తే, లోపలకు వెళ్ళిపడుకునే వరకూ ఒకరినొకరు తోసుకోవడంతో సరిపోతుంది. అందరినీ మధ్యకు పిలిచి పరిస్థితి చెప్పాడు.

''ఖైదీలంటే ఇక్కడ ఈగల్లాంటి వాళ్ళు. ఆ ఈగలు ఇప్పుడు దోమలయ్యాయి. ఇంతవరకూ ఈగలకు కదలని ఏనుగులు, ఇప్పుడు దోమల దెబ్బకు బెదిరిపోతున్నాయి. రేపు ఇదే ఆవరణలో విచారణ జరుగుతుంది. మీరందరూ తలో పద్ధతి కాకుండా, జరిగింది జరిగినట్లు వివరంగా చెప్పండి. రేపేం చేస్తారోనన్న భయంతో మీరు ఏమాత్రం తెలివితక్కువగా ప్రవర్తించినా మిమ్మల్ని కుక్కల్ని తన్నినట్లు తంతారు ఆ తర్వాత.

''నిజం చెబితే మాత్రం గార్డులు'', జైలర్లు ఊరకుంటారా? ఆ తర్వాతయినా తంతారు. వీళ్ళ చేతుల్లో దెబ్బలు తినడంకంటే నోరు మూసుకుని ఉండటం మంచిది కదా?'' అన్నాడు ఒక ఖైదీ.

'నిన్ను ఎలాగూ నోరు మూసుకోనివ్వరు. అటో ఇటో చెప్పాలి. నిజం చెప్పినా, అబద్ధం చెప్పినా వీళ్ళు తర్వాత వడ్డిస్తారు. ఎలాగూ తప్పని వడ్డనకు భయమెందుకు?'' అన్నాడు మరో ఖైదీ.

వీళ్ళు ఇక్కడ ఇట్లా చర్చిస్తుంటే, ఆఫీసులో జైలర్, సబ్‌జైలర్ తీవ్రంగా ఆలోచిస్తున్నారు. వారి చుట్టూ గార్డులు, హెడ్డు వారు చెప్పేమాటలు ఆలోచిస్తూ నిలుచున్నారు. ఏవిధంగానయినా పోతాలును అక్కడినుండి తప్పించాలని వారి ఆలోచన. అది ఎలా చేయాలన్నదే వారికి సమస్యగా ఉంది. అతన్ని బయటకు లాగి ఎక్కడయినా బంధిద్దామని ఒకరి ఆలోచన. ఆ విధంగా చేస్తే మిగిలిన ఖైదీలు సూపరిండెంట్‌కు చెబితే, అప్పుడు పరిస్థితి మరింత తీవ్రంగా తయారవుతుందని ఒకరి ఆలోచన.

చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. పోతాలును ఈడ్చుకెళ్ళి హాస్పటల్లో పడవేయదలచుకున్నారు. డాక్టర్లతో ఎలాగూ సంబంధాలుంటాయి. కనుక అతడికి ఏదో ఒక రోగం వున్నట్లు ఇన్‌పేషెంట్‌గా చేర్పి, తర్వాత తీసుకురావడానికి నిర్ణయించుకున్నారు. చివరికందరూ అదే బాగుంటుందని నిశ్చయించుకున్నారు. ఈ సమయంలో తీసుకెళ్తే ఖైదీలు మళ్లీ తిరుగుబాటుచేసినా చేస్తారని ఆలోచించి, రాత్రి అందరినీ సెల్‌లో తోసినతర్వాత తీసుకెళ్ళాలని నిశ్చయించారు. గార్డుల్ని అన్నంతిన్న తర్వాత అందరూ హాజరుకావాలని ఆదేశించారు.

సాయంత్రం ఐదున్నరనుండి వంటలు పైకితెచ్చారు. ఈ నాలుగురోజులుగా నజీం ముఖం తోకతెగిన నక్కలాగుంటున్నది. ఎప్పుడూ ముఖంమీద ధుమధుమలు, కసరుకోవడం, ఈగలుతోలినట్లు తన వంటమనుషులను అదిలించడం చేస్తున్నాడు. ఖైదీలనేమయినా అంటే తంతారని భయం! వారిమీద కోపం తన అసిస్టెంట్ల మీద చూపిస్తున్నాడు.

భోజనాలు పూర్తయ్యేసరికి ఆరున్నర అయింది. అందరినీ లోపలతోసి తలుపులు తాళాలు బిగించేసరికి ఏడు అయింది. ఖైదీలను లోపలవేసిన వెంటనే గార్డులు ఇళ్లకు కదిలారు.

ఖైదీలు లోపల పాటలు పాడటంలో మునిగారు. ఈ నాలుగురోజులుగా పాటలు పాడే జోరు ఎక్కువయింది. వారిలో ఒకవిధమైన ధైర్యం ఏర్పడింది. ఇంతవరకూ గార్డులను చూసి, ఏనరరూప రాక్షసులో అన్నట్లు బెదిరేవారు. తిరుగుబాటు సంఘటన చూసిన తరువాత, తాము తలుచుకుంటే వీళ్లు పిల్లుల్లామారతారని నిర్ణయించుకున్నారు. దానికి తగినట్లే- ఎప్పుడూ లాఠీలతో వీపునబాది పలుకరించే గార్డులు- ఈ నాలుగురోజులుగా గమ్మున నోరు మూసుకుని నిలబడిచూస్తున్నారు.

ఖైదీలు తొమ్మిదిగంటలకే నిద్రపోవాలి. నిద్రరాకున్నా పడుకోవలసిందేగానీ, కూర్చోకూడదు, లేవకూడదు. ఇద్దరు గార్డులు డ్యూటీలో ఉన్నవారు అటుఇటు తిరుగుతూ, హెచ్చరికలు చేస్తున్నారు. ట్యూబ్‌లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఆ వెలుతురు సరిపడనివారు నిద్రపోవడం సాధ్యంకాక కళ్లు మూసుకుని ఒక వైపుకు తిరిగి పడుకున్నారు.

దాదాపు పదకొండుగంటల సమయంలో జైలర్, సబ్‌జైలర్‌తోసహా ఇరవైమంది గార్డులు, హెడ్డూ పైకివచ్చారు. సెంట్రీలు అటెన్షన్‌లో నిలబడ్డారు.

"ఎలా ఉంది?'' అన్నాడు జైలర్ వారిని చూస్తూ.

వారికి ఏమీ అర్థంకాకున్నా "బాగానేవుంది సార్!'' అన్నారు.

ఒకటో సెల్‌దగ్గరికి వస్తూనే సెంట్రీ తాళంతెరిచాడు. జైలర్ అతనితోపాటు మిగిలిన వాళ్ళు లోపలకు వెళ్ళారు. అందులో చాలామంది నిద్రపోతున్నారు. కొత్తగా వచ్చినవారిలో కొందరు నిద్రపట్టక వీరిని చూసి ఆశ్చర్యంగా లేచికూర్చున్నారు.

జైలర్ పోతాలు దగ్గరకు వచ్చి తట్టిలేపాడు. పోతాలు కళ్లుతెరిచి వీరిని చూసి ఆశ్చర్యంగా లేచి కూర్చున్నాడు.

"పోతాలూ... బయటకుపద'' అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్లు.

"ఈ సమయంలో బయటకు ఎందుకు?''





చొక్కాపట్టుకొని పైకిలేపాడు జైలర్. గార్డులు వచ్చి చేతులు, కాళ్లుపట్టుకున్నారు. పోతాలు గట్టిగా కేకలేస్తూ అరుస్తున్నాడు. ఆ అరుపులకు సెల్‌లోని ఖైదీలంతా లేచి, ఏం జరుగుతుందో తెలియక నిర్విణ్ణులై చూస్తున్నారు. పోతాలు కావాలనే గట్టిగా అరుస్తున్నాడు. ఆవిధంగా అన్ని సెల్‌లలోని ఖైదీలు లేస్తారనీ, తనను తీసుకుపోతున్నారని తెలుసుకుంటారనీ అతని ఉద్దేశం! అది నెరవేరింది. ఖైదీలందరూ నిద్రనుండిలేచి తలుపులవద్దకు పరుగెత్తుకుంటూ వచ్చారు. గార్డులు లాఠీలతో ఊచలమీద కొడుతున్నా గార్డులను తిడుతూ నిలబడి బయటకు చూస్తున్నారు. పోతాలును గార్డులు చేతులమీద ఎత్తుకెళ్ళారు. ఖైదీలు బండబూతులు తిడుతుంటే గార్డులు లాఠీలతో వారిని పొడుస్తూ లోపలకు నెడుతున్నారు.

పోతాలును ఆఫీసురూం వద్దకు తెచ్చారు.

పోతాలు అరవడంలేదు. అరవవలసిన పని అయిపోయింది. తన్ను ఏదో చేయడానికి వీళ్లు అర్ధరాత్రి దాడిచేసి తెచ్చారు. ఏం చేస్తారనేది ఇంకా తెలియలేదు. ఈవిధంగా వీళ్లు చేస్తారని ముందుగా కనీసం ఆలోచనవుంటే తనూ అందుకు సిద్ధపడేవాడే! కానీ, ఆవిధంగా చేస్తారన్న ఆలోచనలేదు. వీళ్లు ఏంచేయదలచుకున్నారు? హనుమంతులాగా చంపేస్తారా? చంపేస్తే మిగిలిన ఖైదీలు చెప్పరా? ఏమో... ఈ ఖైదీలంతా ధైర్యంగా చెప్పగలవాళ్లుకాదు! ఇప్పుడు ఏదో మాట్లాడుతున్నారు గానీ, ఒంటరిగా అయితే గార్డుల కాళ్లు పట్టుకుని "నీ బాంచెన్ కాల్మొక్తా దొరా" అనేవాళ్లే! రేపు ఉదయం వీళ్లందరినీ బెదిరించి తమ వైపు తిప్పుకోవచ్చు.

"పోతాలూ! నీకు మర్యాదగా చెప్పాం! మా మర్యాదను నీవు చెవినపెట్టలేదు. ఇప్పటికయినా చివరి ఛాన్స్! మా మాట వింటావా?" అన్నాడు జైలర్.

"నీకు లొంగడంకంటే ఇలాగే నిలువునా చావడానికయినా నాకు సమ్మతమే!"

మెడపట్టి ముందుకు తోశాడు జైలర్! ఆ ఊపుకు కిందపడ్డాడు పోతాలు! మోకాళ్ళపైన్నుంచి రక్తం కారసాగింది.

మెట్లుదిగి జీప్‌దగ్గరకు తెచ్చారు. ముందు జీపు, వెనుక వ్యాను హాస్పిటల్ దగ్గరకు వచ్చాయి. కాళ్లు, చేతులు కట్టి హాస్పిటల్ ఎమర్జన్సీ వార్డులోనికి తెచ్చారు. అక్కడ డ్యూటీలో ఉన్న డాక్టర్, జైలర్‌ను చూసి, లేచి దగ్గరగావచ్చి చిరునవ్వుతో విష్‌చేశాడు.

"డాక్టర్! ఇతడు మా జైలులో ఖైదీ! ఇతడికి మెంటల్‌షాక్ వచ్చింది. విపరీతంగా అరుస్తూ కేకలేస్తూ గార్డులను తిడుతున్నాడు. తట్టుకోలేక ఇక్కడకు తెచ్చాం" అన్నాడు.

"బల్లపై పడుకోబెట్టండి" అన్నాడు డాక్టర్. అతన్ని పరీక్షచేశాడు. ఏమీ పలుకరించలేదు. తర్వాత డాక్టర్‌తోపాటు జైలర్ పక్కగదిలోకి వెళ్లాడు.

"ఇతన్ని రేపుసాయంత్రం వరకూ స్పృహలో లేకుండా చేయవలసిన బాధ్యత మీది" అన్నాడు జేబులో చేయిపెడుతూ.

"ఆ మాత్రం సహకారం అందించకపోతే మన స్నేహమెందుకు?" అన్నాడు డాక్టర్-స్నేహంకొరకే చేస్తున్నానని చెప్పుకోడానికి.

"ఈరాత్రి డ్యూటీ నాది. రేపు ఉదయం డ్యూటీ డాక్టరుకు ఇతగాణ్ణి అప్పగిస్తాను. ఉదయం బాధ్యత అతడు చూసుకుంటాడు. రేపు సాయంత్రం ఆరుగంటల తర్వాత మీరు ఉంచకూడదు"

"ఆల్‌రైట్! వీలుంటే అంతకులోగానే తీసుకెళ్తాం"

జైలర్, అతడితోపాటు అతని గార్డులు బయటకు నడిచారు.

"ఎన్నిరోజులనుండి నీకు ఆరోగ్యం బాగుండటంలేదు" అన్నాడు డాక్టర్ పోతాలును చూస్తూ.

"నాకా? నేను తెలివితెచ్చుకుని పది సంవత్సరాలయింది. ఈ పదిసంవత్సరాలనుండీ నాకు ఆరోగ్యం బాగుండటంలేదు. మరి మీలాంటి గొప్పవాళ్లను చూస్తే అసలే ఆరోగ్యం బాగుండదు" అన్నాడు అతని మొఖంలోనికి చూస్తూ.

డాక్టర్ తబ్బిబ్బుపడ్డాడు.

"ఏమిటి నువ్వనేది? నీకు పిచ్చిపట్టలేదా?"




"మీ జేబునిండా డబ్బులున్నాయిగా! అవే చెబుతున్నాయి నాకు పిచ్చిపట్టిందని! కానీ డాక్టర్! నిజం ఏనాడో ఒకనాడు బయటపడక పోదు, కానీండి... నన్ను ఏంచేయదలచుకున్నా రో" అంటూ బల్లపైన పడుకున్నాడు.

అక్కడ అల్లరిచేయడం వల్ల ఒరిగేదేమీ లేదు. అంతమంది గార్డులుండగా తనకు మత్తుఇంజక్షన్ ఎక్కించడం కష్టంకాదు. అనవ సరంగా ఒంట్లో శక్తిని పోగొట్టుకోదలచుకోలేదు. బల్లపై పడుకున్న పోతాలుకు సిరంజిగుచ్చి మత్తుఇంజక్షన్ ఇచ్చాడు. దాదాపు పదినిముషా లకు స్పృహతప్పిన పోతాలును వార్డుకు తీసు కెళ్లారు.



5

తుప్పుపట్టిన పాత తుపాకుల బూజు దులిపి, గార్డులు భుజాలమీదకు తీసుకున్నారు.

జైలు సిబ్బందికి తగిన శిక్షణ ఉండదు. తాత్కాలిక అవసరాలకొరకు మూడునెలల శిక్షణ అని పేరేగాని, మూడు నెలలూ అత్త గారి ముద్దుల అల్లుళ్లలాగా మేసిరావడమే గానీ గురిచూసి పదిగజాల దూరంలో వస్తువు ను పేల్చగల సత్తా ఒక్కడికీ ఉండదు. అలా గని అసలు ఏమీ చేతగాదనీకాదు. ఖైదీలను బెదిరించి, పీల్చి పిప్పిచేయడంలో అందరూ ఆరితేరినవారే! ఖైదీల బంధువులొస్తే బిచ్చగాళ్ళలాగా వారిదగ్గర డబ్బు సతాయించి లాక్కోగలరు. ఒకోసారి గార్డులు వారిలో వారే ఒకరినొకరు బెదిరించుకొని తినసాగలరు.

ఆరోజు సూపరింటెంట్ విచారణకు వస్తున్నాడు. కనుక శుభ్రంగా ఉతికిన గుడ్డలు వేశారు. నూనెతెచ్చి తుపాకులకు మెరుగుపెట్టారు. ఎంతమెరుగు పెట్టినా పేరుకుపోయిన మట్టి ఇంకా వదలలేదు. తుపాకీమొనలు తుప్పుపట్టి ఉన్నాయి. చింతపండు తెచ్చి రుద్ది రుద్ది వాటిని ఓమాదిరిగా చేశారు. కాళ్ళకు చిరిగిపోతున్న పాతబూట్లనే ఆ ఒక్కరోజు పనిగడపడానికి గట్టిగా కట్టుకున్నారు. ఎవడి ముఖంలోనూ కళలేదు, మెరుపులేదు, ఆనందంలేదు. వచ్చేవాడు ఎలాంటివాడో వాళ్ళకు తెలియదు. ముక్కుమీద కోపం గలవాడయితే వీరి గతి కుక్కల గతే అవుతుంది. ఖైదీలనుంచి పోతాలును వేరుచేసినా, మిగిలిన వాళ్ళునోరెత్తరన్న నమ్మకంలేదు. అయినప్పటికీ అందరికీ ఇంతకుముందే హెచ్చరికలు చేశారు, ఆశచూపించారు. చివరకు తమ బతుకు వారిచేతుల్లో ఉందని బతిమలాడుకున్నారు. పోతాలును మెంటల్‌హాస్పిటల్‌లో చేర్పినట్లు రాత్రే రికార్డయి ఉంది. అతగాడి మెంటల్ బాగయిన తర్వాత విచారణ చేస్తానంటాడేమోనని వీరి భయం. ఆఫీసర్లు తలతిక్క మనుషులు. బయలుదేరేటప్పుడు ఇండ్లవద్ద పెళ్ళాలు నవ్వుతూ వీడ్కోలిస్తే, ఇక్కడా నవ్వుతూ పనిజరిపేస్తారు. ఇళ్ళవద్ద నాలుగు దులిపి సాగనంపితే, ఇక్కడకు వచ్చి వీరిని దులిపేస్తారు. ఇళ్ళవద్ద ఎక్కిన తిక్కరోగం ఇక్కడివరకూ వచ్చి చేరుతుంది. అందుకే గార్డులకు భయంగా ఉంది. ఖైదీలను గంజిలో వేసినట్లు రికార్డులుండాలి అవి లేనేలేవు. వాడు ఎట్లా చచ్చాడో విచారిస్తే పరిస్థితి మారిపోతుందని వీరికీ తెలుసు.

జైలర్ రామయ్య క్రాస్‌బెల్టు వేళ్ళతో రాపాడిస్తూ ఠీవిగా వచ్చాడు. అందరూ పొజిషన్‌లో నిలిచి సెల్యూట్ చేశారు. అందరివైపూ చూసి "గుడ్... ఇలావుండాలి" అన్నాడు. "సిద్ధంగా ఉండండి. ఆఫీసరుగారు వచ్చే టైమైంది. నేను పైకి వెళ్ళివస్తాను" అంటూ మెట్లవెంట చకచకసాగాడు.

అతడి వెంట హెడ్డూ, ఇద్దరు గార్డులూ వెళ్ళారు. ఆఫీసులోనికి వెళ్ళి లాఠీ చేతికి తీసుకుని, "సెల్‌వైపు పదండి" అన్నాడు.

ముందు హెడ్డూ, వెనుక గార్డులూ కదిలారు. సెల్‌ముందుభాగం తలుపుతెరచి ఆవరణలోనికి అడుగుపెట్టారు. సెల్‌లలో ఖైదీలు

బయటకు చూస్తున్నారు. ఇంతవరకూ తలుపులు తీయలేదు. తలుపుతీస్తే వారితో ఏం తంటా వస్తుందోనని భయం.

ఒక్కొక్క సెల్ తలుపువరకూ వచ్చి, "మేం చెప్పింది జ్ఞాపకం వుందా?" అంటూ హెచ్చరించాడు.

ఖైదీలు ఒక్కడూ నోరెత్తలేదు. కాని గంగిరెద్దులలాగా తలలు మాత్రం ఊగాయి.

అదే అంగీకారంగా భావించిన జైలర్ ఆవరణలోని గార్డ్ రూంవద్దకు వచ్చాడు. కిందికి వంగి బీడీముక్క ఒకదాన్ని తీసి చేతపట్టుకొని గార్డులవైపు తిరిగి "ఇదేమిటి?" అన్నాడు కోపంగా.

గార్డులు దానివైపు వొంగి చూసి, గుటకలు మింగుతూ నిలబడ్డారు. హెడ్డు కోపంగా ముందుకు వచ్చి "ఆఫీసర్స్ విజిట్ చేసేటప్పుడయినా శుభ్రంగా ఉండక్కర్లా! మీకు బుద్ధిలేదర్రా" అన్నాడు ముక్క చేతికి తీసుకుని! ఆ ముక్క అక్కడ ఉండటానికీ, తమకు బుద్ధిలేకపోవడానికీ లంకె ఏమిటో గార్డులకు తెలియకున్నా ఎదిరించి మాట్లాడటం అలవాటు లేదు గనుక మాట్లాడలేదు.

"ఈ ఒక్కరోజయినా పరిశుభ్రంగా ఉంచండ్రా!" అన్నాడు జైలర్ ముందుకు సాగిపోతూ. ఖైదీలకు బీడీలు తాగవద్దని గట్టిగా చెబుదామనుకున్నారుగానీ, వారితో ప్రస్తుతం అవసరముంది గనుక, వారిని కదిలించలేదు.

కోట గోడమీదున్న సెంట్రీపోస్టు నుంచి గార్డ్ పరుగెత్తుకుంటూ వచ్చి "సాబ్! కింద కారువచ్చి నిలబడింది" అన్నాడు ఆదుర్దాగా.

జైలర్ ప్యాంటు సరిచేసుకుంటూ కిందికి పరుగెత్తాడు. వారివెంట హెడ్డు, అతడి వెంట గార్డులూ ఓపిక లేకున్నా మెట్లు గబగబ దిగుతూ కిందికివచ్చారు. ఇంత తొందరగా పరుగెత్తి వస్తే కిందవున్నది సూపరింటెంట్ కాదు స్థానికంగావున్న యం.యల్.ఎ.గారు దయచేశారు. జైలు భాగోతమంతా పేపర్లలో పడుతుందిగనుక, ఈరోజు విచారణ ఉందని తెలిసి, ఆ విచారణలో పాల్గొందామని ఆయన కూడా బయలుదేరాడు. జైలర్ మింగలేక, కక్కలేక అతడిని ఆహ్వానించాడు. అతన్ని పైన ఆఫీసులో కూర్చుండబెట్టమని హెడ్డును ఆజ్ఞాపించాడు.

సరిగ్గా పదకొండుగంటలకు సూపరింటెంట్ వచ్చాడు. ఆపాటికి ఖైదీలు భోజనానికి కూర్చున్నారు. సరాసరి వంట రూందగ్గరికి వచ్చి అన్నం, కూరలు చూశాడు. అక్కడి నుండి పైకివెళ్ళి తింటున్న ఖైదీల పళ్ళేలలో ఉన్న అన్నం, కూరలు చూశాడు. రెండింటిని శాంపిల్ పాకెట్లుగా కట్టి తన ప్యూన్‌కు అందించాడు. సూపరింటెంట్‌ను చూసిన గార్డులు అస్తవ్యస్తంగా అటుఇటు ఖైదీలను అదిలిస్తూ తిరుగుతున్నారు. సబ్‌జైలర్-అతడు కడుతున్న పాకెట్లను చూశాడు. వంటవార్డర్ నజీంను పిలిచి, "వంట గదిలో అన్నం ఉందా?" అడిగాడు.

"ఉంది సాబ్! వంటచేసిన ఖైదీలు, మరి కొందరు గార్డులు ఇంకా తినలేదు, వారికొరకు ఉంచాముసాబ్"

"ఆ అన్నం కూడా ఇలాగే ఉందా? లేక తేడా ఏమైనావుందా?"

నజీం తలగోక్కుంటూ నిలబడ్డాడు.

"ఏరా కొడకా! చెప్పవేం?"

"ఈ అన్నంకంటే అది బాగుంటుంది సాబ్"

"నాకొడకా! మా కొంపలు ముంచావ్‌గదరా" అన్నాడు హూంకరిస్తూ. అక్కడినుండి బిరబిరా ఆఫీసుకు పరుగెత్తాడు.

ఆఫీసులో జైలర్ ముందు కూర్చున్న యం.యల్.ఎ. గోవిందం కోతలు కోస్తున్నాడు. అతడి ప్రగల్భాలు వింటూ కూర్చున్న జైలర్ మనసులో, పైన ఏం జరుగుతుందోనన్న ఆందోళన మొదలయింది. సబ్‌జైలర్ హడావిడిగా రావడంతో "ఏమిటి?" ఆదుర్దాగా ప్రశ్నించాడు.

అతడు చెప్పింది విని ఆగ్రహోదగ్రుడయ్యాడు. "వాణ్ణి పిలువ్!" అంటూ హూంకరించాడు.

బయటున్న గార్డు పరుగెత్తాడు. గార్డు వచ్చేసరికి, ఇంకా అన్నం కాటావేస్తున్నాడు నజీం. గార్డు వచ్చి చెప్పిన వెంటనే త్రాసు మరొకరికి







అందించి వెళ్లబోయాడు. సూపరిండెంట్ అతన్ని చూసి ఆగమన్నాడు.

"ఎక్కడికి?" అడిగాడు సూపరింటెండెంట్.

"జైలర్‌గారు రమ్మని గార్డును పంపించారు సాబ్!"

"పోదువుగానిలే! పంపకం పూర్తిగానివ్వు!"

నజీం నోరెత్తలేదు. తిరిగి వచ్చి కూర్చున్నాడు త్రాసు తీసుకుని. భోజనాలయ్యేలోగా పెరుగు శాంపిల్ తీసుకున్నాడు. ఖైదీలందరూ తిని లోపలకు వెళ్ళిన తరువాత, వంటమనుషులు కిందికి దిగివెళ్ళారు. వారితోపాటు వంటరూంలోనికి వచ్చాడు సూపరింటెండెంట్.

"ఇంకా ఎందరున్నారు?" అడిగాడు అన్నం వైపు చూస్తూ.

"వంటమనుషులు ఎనిమిది మంది, గార్డులు పదిమంది"

"మొత్తం పద్దెనిమిదిమంది... ఔనా! పద్దెనిమిది భాగాలు తూకంవెయ్యి!"

నజీం గుక్కతిప్పుకోలేకపోతున్నాడు. అతని జైలు వార్డర్ జీవితంలో ఇన్‌స్పెక్షన్ ఇలా చాలాసార్లే జరిగింది కాని ఇంత సూటిగా అడిగినవాడు లేడు. వచ్చినవారు కూడా మామూలు ఇన్‌స్పెక్టర్ స్థాయివాళ్ళు. ఈరోజు ఏకంగా సూపరింటెండెంట్ వచ్చి ఎదురుగా

నిలుచుంటే మాట్లాడే దమ్ము నజీంకేకాదు అక్కడ ఎవరికీలేదు.

పద్ధెనిమిది భాగాలు తీయగా అన్నం ఇంకా చాలా మిగిలింది. కూరలు రొట్టెలు మిగిలాయి.

వాటిని చూపుతూ— "ఇదంతా సాయంత్రం పంచిపెడతారా?" అన్నాడు సూపరింటెండెంట్.

అక్కడున్న వంటమనుషులతోసహా, గార్డులెవరూ నోరెత్తలేదు. తన వెంటనున్న ప్యూన్ ద్వారా అదంతా పెద్ద గిన్నెలో ఎత్తించి దాని మీద మూత బిగించాడు. అక్కడినుండి ఆఫీసుకు వచ్చాడు.

అతన్ని చూసి, యం.యల్.ఎ.తో సహా లేచి నిలబడ్డారు. వారందరినీ కూర్చోమంటూ తనూ కూర్చున్నాడు.

జైలర్- గోవిందాన్ని పరిచయం చేశాడు. కరచాలనం చేసిన తర్వాత కూర్చుంటూ— "పేపర్లో ఈ జైలునుగురించి చాలా తీవ్రంగా వార్తలు వచ్చాయిసార్! అందువల్ల జరిగిందేమిటో తెలుసుకుందామని వచ్చాను" అన్నాడు గోవిందం.

"మంచిదే!" అన్నాడు సూపరింటెండెంట్.

జైలర్‌వైపు తిరిగి— "నేను ఎందుకొచ్చిందీ మీకు తెలుసుకదూ! పదండి చూద్దాం!" అన్నాడు లేస్తూ.

జైలర్ ముందుకు సాగాడు. అతడివెంట సూపరింటెండెంట్, అటు తర్వాత మిగిలినవారు బయలుదేరారు. గార్డులందరూ ఎవరి డ్యూటీలో వాళ్ళు ఉండటంవల్ల అక్కడ కొద్ది మందిమాత్రమే వున్నారు.

అందరూ సెంట్రీపోస్టు దగ్గరికి వచ్చారు. "ఇక్కడే పడ్డాడు సార్!" అన్నాడు జైలర్.

సూపరింటెండెంట్ కిందికి వంగి చూశాడు. రక్తంమరకలు లేవు. శుభ్రంగా కడిగివేయబడి వున్నాయి. అంతా నల్లరాయిపరచిన ప్రాంతం! తల పైకెత్తి చూశాడు. దాదాపు ఎనిమిది అడుగుల ఎత్తున్నది గోడ! గోడకు ఒకపక్కగా పోస్టు దగ్గరకు వెళ్ళడానికి మెట్లున్నాయి. జైలర్ వివరించి చెప్పాడు. ఉదయం ఖైదీల నందరినీ విడిచాము. హనుమంతు అనే ఖైదీ వంటశాలలో పనిచేసేవాడు. అందువల్ల ఇక్కడ తచ్చాడుతున్న గార్డులు పెద్దగా పట్టించుకోలేదు. సాయంత్రం ఎనిమిది గంటలకు అందరినీ లోపలవేస్తూ లెక్కిస్తే ఒకరు తక్కువ వచ్చారు. అతడికోసం గాలింపు ఆరంభమయింది. మెట్లవెనుకనున్న స్థలంలో అతడు నక్కివున్నాడు. సద్దుమణిగిన తర్వాత పారిపోదామని ఆలోచించినట్లుంది. గార్డులు వెతకడం చూస్తూనే ఇక దాక్కోవడం సాధ్యంకాదనుకున్నాడేమో, మెట్ల మీదుగా సెంట్రీపోస్టు వైపు ఎక్కడం సాగించాడు. పోస్టులోనున్న సెంట్రీ కేకలేసేసరికి తొందర తొందరగా పరుగెత్తుతూ పక్కనేవున్న గంజి గదులమీదికి ఎక్కాడు. అప్పటికే గార్డులు చుట్టుముట్టివున్నారు. అతడు పైనుంచి కిందికి పడ్డాడు. వెంటనే హాస్పిటల్‌కు తరలించాం! కాని వెంటనే ప్రాణంపోయింది"

సూపరింటెండెంట్- జైలర్ చెబుతున్నంత సేపూ చుట్టూ చూస్తున్నాడు.

"గంజి గదుల ఎత్తుఎనిమిది అడుగులు. అంత ఎత్తునుండి కిందపడితే అంత తీవ్రమైన ప్రాణంపోయేటంత దెబ్బలు తగలడం సాధ్యమేనా?" అన్నాడు గోవిందం.

జైలర్ జవాబు చెప్పలేదు. వీడొకడు పానకంలో పుల్లలాగా అనుకున్నాడు.

"అతడు కిందపడకుండా మీరు అభయమిచ్చి దిగమనవచ్చుకదా!"

"అంత సమయం లేదు సార్! హఠాత్తుగా దూకాడు. చావడానికి ప్రయత్నిస్తాడనీ, అంత తక్కువ ఎత్తునుండి దూకుతాడనీ మేమసలు భావించనేలేదు".

సూపరింటెండెంట్ మాట్లాడలేదు. మాప్ వేసుకున్నాడు. గుర్తులు పెట్టుకున్నాడు.

"అతడు కిందపడుతుండగా ఖైదీలెవరైనా చూశారా?"

"ఆ సమయంలో ఖైదీలెవరూ బయటలేరు సార్! అందరూ లోపలేవున్నారు. అందువల్ల ఎవరూ చూసేఅవకాశం లేదు"

"కనీసం అతడు పడి అరచినప్పుడు వేసిన కేకలైనా విన్నవారున్నారా?"




"మాతో ఎవరూ ఆ విషయం చెప్పలేదు సార్!"

"గంజి గదులలో ఖైదీలను వేయక ఎన్ని రోజులవుతుంది?"

"మూడు నెలలుగా ఎవరూలేరు సార్!"

అక్కడినుంచి అందరూ వెనుతిరిగి వచ్చారు. పైకివెళ్ళి సెల్ ఆవరణలో నిలబడ్డారు. గార్డులు ఖైదీలను తరిమివేసి, తలుపులు బిగించారు బయటకు రాకుండా. జైలర్ ముందుకు వచ్చి గార్డులు కాల్చగా నలుగురు ఎక్కడెక్కడ పడ్డారో గుర్తులు చూపించాడు. గార్డులు ఎక్కడనుండి కాల్పులు సాగించారో, ఖైదీలు ఎందుకు తిరుగుబాటు చేశారో చెప్పాడు. గార్డులు చివరకు ఖైదీలను ఎన్ని గంటలకు లోపలకు తోశారో చెప్పాడు. ఆ మ్యాప్‌ను కూడా రాసుకుని, ఆఫీసులోకి వచ్చి కూర్చున్నారు.

"నేను ఇక్కడికి రెండు సమస్యలమీద వచ్చాను. ఒకటి— హనుమంతు అనే ఖైదీ మరణం; రెండు— ఆ మరణంవల్ల తిరుగుబాటు చేసిన ఖైదీలు, — వారిమీద కాల్పులు. కానీ నేనిక్కడకు వచ్చిన వెంటనే కనిపెట్టిన విషయం— భోజనం గురించి. ఇక్కడ రెండు రకాల భోజనాలు తయారుచేస్తున్నారు. కాగా వండిన భోజనం అందరికీ పంపకాలుకాగా చాలా మిగులుతున్నది. ఈ మిగిలిన అన్నం ఏమిచేస్తారన్నది మీరు చెప్పాల్సివుంది. పెరుగు పేరుతో పోస్తున్నవి నీళ్ళు. ఇది చాలా ద్రోహం! ఖైదీల రేషన్ చాలా అన్యాక్రాంతమవుతున్నదనడానికి ఇది ఉదాహరణ!"

సూపరింటెండెంట్ మాటలకు ఎవరూ నోరెత్తలేదు. జైలర్ నకిలించాడు. క్రాస్‌బెల్ట్‌పైకీ కిందకూ చేతితోరుద్ది "ఇంతకుముందు ఎప్పుడూ ఇలా జరిగేది కాదు సార్! ఎప్పుడూ ఖచ్చితంగా రేషన్ ఖైదీలకు సరిపోయేది. రెండురకాల వంటలు కూడా ఎన్నడూలేవు"

"ఈరోజు ఎందుకు జరిగిందంటున్నాను?"

"మేం ఆఫీసు విషయాలు చూసుకుంటుంటే అక్కడ వంటవాళ్ళు తారుమారు చేసినట్లుంది"

సూపరింటెండెంట్ నిరసనగా నవ్వాడు. "చెక్‌చేయడానికి ఇక్కడ డాక్టర్‌లేడా? ప్రతి జైలులో వంట చెక్‌చేయడానికి నియమిస్తారు గదా!"

"ఇక్కడ కాంపౌండర్‌ను నియమించారు సార్! ఆయన నాలుగురోజులుగా సెలవులో ఉన్నాడు"

"అంటే ఖైదీలు తిరుగుబాటుచేసిన తరువాత ఆయన వెళ్ళిపోయారా?"

"అవును సార్!"

"అయితే ఖైదీలకు భయపడి పారిపోయినట్లేకదా! ఇక్కడ విచారణకు కమీషన్ వేయబడిందనీ, అధికారి వస్తున్నారనీ తెలిసి ఎందుకు హాజరుకాలేదు?" సూపరింటెండెంట్ గాండ్రింపుకు ఎవరూ నోరెత్తలేదు.

"అసలు ఖైదీ ఆత్మహత్య చేసుకున్నాడంటే నేను నమ్మడంలేదుసార్! ఎనిమిది అడుగుల మీదనుండి ఒక యువకుడు పడితే మహా అయితే కాలో చెయ్యో విరుగవచ్చు. ఏకంగా ప్రాణంపోయిందంటే నమ్మశక్యంగాని విషయం" అన్నాడు గోవిందంవైపు చూసి.

"మీరిచ్చిన వివరాలు బాగానేవున్నాయి. వీటిని గురించి ఇక ఖైదీలను కూడా విచారిస్తాం. వారిచ్చే సమాధానాలేమిటో!"

"ఖైదీలను ఇక్కడకు పిలిపించమంటారా?"

జైలర్ మాటలకు సూపరింటెండెంట్ నవ్వాడు చిన్నగా. "మీముందు వాళ్ళేంచెప్పగలరు? సింహంముందు తోడేలు కూతకూస్తుందా? పైకివెళ్ళి నేనే విచారిస్తాను. మీరిక్కడే ఉండండి. మీ హెడ్‌కానిస్టేబుల్‌ను నాతోపాటు పంపించండి"

"ఆల్‌రైట్‌సార్ అన్నాడు.!"

సూపరింటెండెంట్ పైకివెళ్ళాడు. ఆవరణలోని గార్డురూంలో కూర్చున్నాడు. "ఒక్కొక్క సెల్‌వాళ్ళను పంపించు. వారిని విచారించిన తర్వాత మరొక సెల్‌నుంచి పంపించవచ్చు. అందరూ ఒకేసారివస్తే తొక్కిడిగా ఉంటుంది" హెడ్డువైపుచూస్తూ చెప్పాడు.

హెడ్డు తల ఊపి ముందు అయిదో నంబరు సెల్‌వద్దకు వెళ్ళి వారిని బయటకుతీశాడు.



వరుసగా వందమంది నిలబడ్డారు.

తానెందుకొచ్చిందీ సూపరింటెండెంట్ చెప్పాడు. "మీకేం భయంలేదు. నిర్భయంగా చెప్పదలచుకున్నది చెప్పండి. మీ మంచికొరకే నేను వచ్చాను" అన్నాడు.

ముందున్న ఖైదీ "హనుమంతును చంపారని ఎవరో నాకు చెప్పారు. చూద్దామని బయటకువచ్చాను. ఆపాటికి ఖైదీలంతా ఆవరణలో కేకలేస్తున్నారు. అంతలో పైనుండి 'లోపలికి వెళ్ళమని' సబ్‌జైలర్ హెచ్చరించారు. ఎవరూ వినడంలేదు. కిందినుండి రాళ్ళు విసరసాగారు. ఆ తర్వాత పైనుండి కాల్పులు వినిపించాయి. నేను లోపలకు పారిపోయాను"

"ఈ ఆవరణలో రాళ్ళున్నాయా?" అడిగాడు సూపరింటెండెంట్.

ఖైదీ మాట్లాడలేదు.

-"ఎవరయినా చచ్చారో, లేదోనని నీవు తలుపుగుండా తొంగిచూడలేదా?"

"లేదు... భయంతో దుప్పటికప్పుకుని పండుకున్నాను"

"ఆ దుప్పటి తెల్లారేదాకా తీయలేదా? నీ తోటి ఖైదీలతో ఏమీ మాట్లాడలేదా?"

ఖైదీనుండి జవాబులేదు.

"హనుమంతు చావుగురించి నీ ఉద్దేశమేమిటి?"

"నాకు తెలియదు సార్!"

రెండో ఖైదీని పిలిచాడు. అందరూ కొంత తేడాతో తమకేమీ తెలియదని చెప్పసాగారు.

రెండో సెల్‌వాళ్ళను తీసుకురమ్మన్నారు. "మీ అందరినీ అడగడంకంటే, చెప్పదలచుకున్నవాళ్ళు ఒకరిద్దరు ముందుకురండి. ప్రతి ఖైదీతోనూ చర్చించాలంటే మాకిచ్చిన ఒకరోజు సమయం చాలదు"

ఖాసిం, సత్తెయ్య అనే ఖైదీలు ముందుకు వచ్చారు. ఖాసింవైపుచూసి- "చెప్పు" అన్నాడు సూపరింటెండెంట్- "హనుమంతు ఎలా చచ్చాడో తెలుసా?"

ఖాసిం టోపీ చేతికి తీసుకుని తల గీరుకుని హెడ్డువైపు చూశాడు.

హెడ్డు దండంపెట్టి సంజ్ఞచేశాడు. సూపరింటెండెంట్‌వైపు తిరిగి "హనుమంతును గార్డులు చంపారని మాకు వార్త అందింది సార్!"

సూపరింటెండెంట్ తల ఎత్తి చూసి "ఆ తర్వాత?" అన్నాడు.

"ఆ వార్త వస్తూనే ఖైదీలు ఆవేశపడ్డారు. ఆవరణలో ఇద్దరు గార్డులు దొరికితే ఖైదీలు తన్నారు. తర్వాత కాల్పులు ఆరంభమయ్యాయి"

"ఎంతమంది చచ్చారు, దెబ్బలు ఎందరికి తగిలాయి?"

"మేం చూసినప్పుడు నలుగురు కిందపడిపోయారు. వారిని బయటకు తీసుకెళ్ళారు"

రెండో ఖైదీని ముందుకు పిలిచాడు.

అతడు తనకేమీ తెలియదని చెప్పాడు. అయిదో సెల్‌వాళ్ళు చెప్పినట్లే చెప్పాడు.

మూడో సెల్‌వాళ్ళను తెచ్చి నిలిపారు. కొందరు తెలియదన్నారు. మరికొందరు నిద్రపోతున్నామన్నారు.

చివరకు మొదటి సెల్‌వాళ్ళను తీసుకువచ్చారు. "మీలో ఎవరు వివరిస్తారు?" అన్నాడు సూపరింటెండెంట్.

"నేను" అంటూ సలీం ముందుకువచ్చాడు. హెడ్డు కొరకొర చూస్తున్నాడు. గార్డులు గుటకలు మింగుతున్నారు. వారినెవరినీ లక్ష్యపెట్టలేదు. సలీం అంతవరకూ జరిగింది వివరంగా. సూపరింటెండెంట్ రాసుకోడానికి కావలసిన సమయం ఇస్తూ చెప్పాడు. పోతాలును రాత్రి ఏవిధంగా తీసుకెళ్ళిందీ చెప్పాడు.

"ఆ పోతాలు ఇప్పుడెక్కడున్నాడో చెప్పగలవా?"

"అది చెప్పాల్సింది జైలర్!"

"మీకు భోజనాలు సక్రమంగా పెట్టడంలేదనీ, సరయిన రేషన్ ఇవ్వడంలేదనీ తెలిసిన తర్వాత మీరు పైఅధికారులకు ఫిర్యాదుచేయవచ్చుకదా!"

"ఎవరికి చేయమంటారు... ఇక్కడి అధికార్లే అందులో భాగస్థులు. అందువల్లనే మమ్మల్ని గంజిగదులలో తోసి చలికాలంలో చల్లనీళ్లతో మా శరీరాలు మర్దిస్తారు. ఇంకా పైఅధికా







## అందాన్ని అందించడం ప్రకృతి సహజం.
## అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.




కొత్త

# కేమియో

బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్త మలుపు ఇస్తుంది కేమియో



జయలక్ష్మి వారి ఉత్పాదన

ACIL/025/86-T

రులకు ఇక్కడినుండి ఫిర్యాదులు ఎలా పంప గలం? ఏది పంపినా జైలర్ అనుమతిలేనిదే బైటకుపోదుగదా! తనమీదవెళ్ళే రిపోర్టును చించివేయక అనుమతిస్తాడా జైలర్!"

"జైలర్‌ది మీ ఊరే అంటున్నారుగదా! అతడికీ, మీకు వ్యక్తిగతకక్షలు ఏమయినా ఉన్నాయా?"

"ఏమీ లేవుసార్! బయట ఉన్నంతవరకూ మాతోపాటు తిరిగి బతికిన వ్యక్తే! ఈరోజు అధికారం దొరికిందిగనుక, సంపాదనలో పడి ఈవిధంగా తయారయ్యాడు"

సలీం ఇచ్చిన స్టేట్‌మెంట్‌మీద సంతకం చేయించుకున్నాడు.

సూపరిండెంట్ వెళ్ళడానికి లేచాడు. ప్యూన్ కాగితాలు సర్దసాగాడు.

"సార్...! ఒక్క విషయం! మేము ఈ విధంగా సాక్ష్యం చెప్పామని రేపు మామీద వీళ్ళు దాడిచేస్తారు. ఆ విషయంలో సందే హంలేదు.అప్పుడు మేం చేయాల్సిందే మిటి?"

"అంత సులభంగా ఏమీ జరగదు. ఇంత జరిగీ ఇంకా ఏదోచేయాలని ప్రయత్నిస్తే ఫలితం వారికీ తెలుసు" అన్నాడేగానీ వారికి ఎలాంటి హామీ ఇవ్వలేదు.

సూపరిండెంట్ కిందికి దిగి ఆఫీసుకు వచ్చే సరికి అధికారుల ముఖాలు ప్రేతకళ వచ్చాయి. జరిగింది జరిగినట్లు గార్డులు ఎప్ప టికప్పుడు చెబుతూనే ఉన్నారు. సలీం, ఖాసిం ఇచ్చిన సాక్ష్యం చాలు, వారికి యావజ్జీ విత శిక్షపడటానికి!

"సరే...! ఖైదీల విషయం స్టేట్‌మెంట్స్ సేకరించాను. మీరుకూడా ఇంకా ఏమయినా చెప్పవలసినవి ఉంటే చెప్పండి" అన్నాడు సూపరిండెంట్.

ఎవ్వరూ మాట్లాడలేదు.

యం.యల్.ఎ గోవిందం లేచి "కొంచెం మాటసార్... ఇటురండి" అంటూ సూప రిండెంట్‌ను బయటకు తీసుకొచ్చాడు.

పార్కులో చెట్లకింద రెండు కుర్చీలు వేయ బడి ఉన్నాయి. ఇద్దరూ అక్కడ కూర్చున్నారు.

"ఖైదీలనేవాళ్ళు ఒట్టి లఫుర్‌జాతివారని మీకూ తెలుసు! అనవసరంగా ఆఫీసర్లను ఇబ్బందిపెట్టడం, తిట్టడం వారిపని. వారి మాటలు నమ్మదగ్గవికావు"

"ఖైదీలందరినీ ఒకే గాటకట్టకూడదండీ! ఆ మాటకొస్తే దోపిడీ దొంగలూ, పిక్‌పాకెట్‌గా ళ్ళున్న జైలులోనే మహాత్మాగాంధీ, మరికొంద రు మహానాయకులున్నారు. వారినీ దొంగల కింద జమకట్టడమేనా?"

"కాదనుకోండి! అయినా సమస్యలుంటే చర్చించక, తిరుగబడి కొట్టడానికి వస్తే గార్డు లుమాత్రం ఊరకుండగలరా? మనవరకే ఆ విషయం జరిగిందనుకోండి మనం ఓర్చు కోలేం కదా! జరిగిందేదో జరిగిపోయింది. వాళ్ళూ మీలాటి ఉద్యోగులే! ఈ జీతం రాళ్ళ మీద బతకాలి. అవి చాలనప్పుడు నాలుగు డబ్బులకోసం చేతులు చాచక తప్పదు. సాక్షా త్తూ ముఖ్యమంత్రుల స్థాయివాళ్ళే కోట్లుకోట్లు సంపాదిస్తుంటే ఇలాంటి బడుగు ఉద్యోగు లెంత? ఆ ఖైదీల స్టేట్‌మెంట్స్ పట్టించుకో కుండా ఈ కేసును ఇంతటితో ముగించండి"

"నా చేతిలో ఏమీలేదు గోవిందంగారూ!"

"అమ్మమ్మా... అదేంమాట! వారికి ఉరిత్రా డు తగిలించాలన్నా తెంచాలన్నా మీ చేతిలో వుంది. మీమేలు వారు ఉంచుకోరులెండి"

సూపరిండెంట్ పలుకలేదు.

"ఉండండి వస్తాను..." అంటూ లోపలికి వెళ్ళాడు.

వారితో ముందే మాట్లాడి ఉంచాడుగనుక బ్యాగ్ చేతికి తీసుకొని బయటకు వచ్చాడు. ఆ బ్యాగ్ చూసిన సూపరిండెంట్ "ఎంత?" అన్నాడు కళ్ళెగరేసి.

"రెండు లక్షలు"

"ఇది చాలా తీవ్రమైన కేసని మీకు తెలు సుకదా?"

"కనికరించండి. ఇప్పటికే వారికి తడిసిమో పెడవుతుంది."

"ఏమీకాదు... పది సంవత్సరాలనుండీ వీరు ఉద్యోగం చేస్తున్నారంటే, ఈ పదిసంవ త్సరాల రేషన్ తింటున్నారనే అర్థం! సంవత్స




రానికో లక్షయినా మిగిల్చివుంటారు. నాలుగు లక్షలయితేనే సాధ్యం'' అన్నాడు ఖరాఖండీగా. గోవిందం లోపలకు వెళ్ళి మరో లక్ష తెచ్చి ఇచ్చి అతన్ని సాగనంపాడు.

జైలర్, సబ్‌జైలర్, గార్డులు మెట్లు దిగి కారుదాకా వచ్చి అటెన్షన్‌లో నిలిచి వీడ్కోలు చెప్పారు. గోవిందం రెండు చేతులతో నమస్కరించాడు చిరునవ్వుతో.

అందరూ ఊపిరి పీల్చుకున్నారు గండంగడిచి పోయినందుకు.

''చాలా సులభంగా పోయిందయ్యా! మీలో ఒక్కొక్కరూ పది లక్షలు సంపాదించారని అంటున్నాడు.మూడు లక్షలతో మొత్తానికి దాటించడం అదృష్టమే! సరే... నాకిస్తామన్నది ఇవ్వండి వెళ్ళిపోతాను'' అన్నాడు గోవిందం నవ్వుతూ.

సబ్‌జైలర్ తన చేతిలోవున్న సంచీ అతడికి అందించాడు. జిప్ లాగి లోపలకు చూసుకుని తలాడించి, వస్తానని చెప్పి కారులో కూర్చున్నాడు. కారు కనిపించినంత వరకూ చూసి ''ఈ ముండా కొడుకు ఊరకవచ్చి డబ్బు తన్నుకెళ్లాడే'' అన్నాడు పండ్లు కొరుకుతూ సబ్‌జైలర్.

''నయం! వాడు వచ్చినందుకు గండం గడిచిపోయింది. వీడు లేకపోతే మనకైమనం లంచం ఇవ్వడానికి భయపడేవాళ్ళం. వాడు అడగడానికి భయపడేవాడు. చివరకు నెత్తిమీదకు వచ్చేది'' అన్నాడు జైలర్ దిగులుగా.

''వస్తూనే అన్నంపాట్లాలు కట్టి పెద్దఫోజు దొబ్బాడు నిజాయితీ పరుడిలాగా! చివరకు మనకు ఉన్నదంతా ఊడ్చుకెళ్ళాడు'' అన్నాడు సబ్‌జైలర్.

''ఎవడయినా అంతే! నిజాయితీపరుడిలా నటిస్తేనేకదా నాలుగు డబ్బులురాలేది'' అంటూ జైలర్ తన బంగాళావైపు సాగాడు.

సబ్-జైలర్ తన బంగాళావైపు సాగాడు.

''ఒరేయ్! ఇక ఈ ఐదులక్షలూ రాబట్టేవరకూ మన నోటిలో దుమ్మేరా! మనకు కూడు పెట్టకుండా, మన రేషన్ కూడా అమ్మేస్తారు'' అన్నాడు ఒక గార్డు.

అది నిజమేనని వారందరికీ తెలుసు. తలో రకంగా మాట్లాడుకుంటూ, డబ్బుపోయినందుకు బాధా, బండనెత్తిన పడకుండా తప్పిపోయినందుకు సంతోషంతో వెళ్ళిపోయారు.

లోపల ఖైదీలు తర్జనభర్జనలు పడుతున్నారు. అబద్ధం చెప్పినవాళ్ళు తమకేమీ భయంలేదని నిశ్చింతగా ఉంటే, నిజంచెప్పినవారు అంతకంటే నిశ్చింతగా ఉన్నారు ఏం జరిగినా సిద్ధమేనని! ఎటొచ్చీ కొంత అబద్ధం, కొంత నిజం చెప్పిన ఖాసింలాంటివాళ్ళు తమకేమి జరుగుతుందోనని గజగజ వణకుతూ కూర్చున్నారు. పక్క ఖైదీలు చెబుతున్న మాటలు మరింత భయపెడుతున్నాయి.

సాయంత్రం ఐదుగంటలకు పోతాలును హాస్పిటల్‌నుండి జైలుకు తెచ్చారు.

అతడి వెంట గార్డులు తప్పఎవరూ రాలేదు. పోతాలు సెల్ ఆవరణలోనికి వచ్చేసరికి వంట పంపకంలో వున్నారు. పోతాలును చూసి వరుసలో నిలబడినవారు ఆనందంగా అరుస్తూ పోతాలు వైపు వచ్చారు. గార్డులు వారిని అదిలిస్తూ, దూరంగా తరిమి కొట్టడానికి ప్రయత్నించినా లెక్కచేయకుండా దగ్గరకు వచ్చారు. వంటపంపకం గందరగోళమయింది. అందులో ఎవరు తీసుకున్నారో, ఎవరు తీసుకోలేదో అర్థంకాలేదు. ఖైదీలందరూ గుమికూడుతూనే రేషన్ పంపకం నిలిపివేశారు. అరగంటసేపు పోతాలుతో మాట్లాడటం, చూడటమే సరిపోయింది వారికి.

సలీం పోతాలు దగ్గరకు వచ్చి జరిగిన వివరాలు చెప్పాడు. తనకు జరిగిన దంతా చెప్పాడు పోతాలు. అంతా సద్దుమణిగి అన్నంతినమని పోతాలు చెప్పిన తరువాత అందరూ వరుసలలో నిలబడ్డారు.

''ఇందులో కొందరు తిన్నారు, కనుక ఎవరికి పెట్టాలో నాకర్థంకావడంలేదు'' అన్నాడు వార్డరు నజీం!

''మేం ఎవరమూ తినలేదు'' అన్నారు ఖైదీలు.

ఈ గొడవ మొదలవ్వడంతో కిందనుంచి హెడ్డుపైకి వచ్చాడు- ఏమిటంటూ.

''ఇందులో చాలామంది తిన్నారుసాబ్! మళ్లీవచ్చి పళ్ళెంపట్టారు. వీరందరికీ మేమె

క్కడనుండి తెచ్చిపెట్టాలి?'' అన్నాడు నజీం.

అతని ముఖం మీద ఆవాలు పోస్తే బాగా వేగుతాయనిపిస్తున్నది చూస్తే! మాటిమాటికీ చెయ్యివూపుతూ ఉన్నాడు. శరీరం ఊగిపోతున్నది. మళ్లీ చెలరేగితే తనను తంతారని భయం.

''నీవు ఎవడెవడికి పెట్టావో చూపించరా?'' అన్నాడు హెడ్డు.

నజీం పదిమందిని ముందుకు లాక్కొచ్చాడు.

''ఇంత మందేనా?''

''ఇంకా ఉన్నారు సాబ్! సగంమందికి పెట్టాను. తలవంచుకుని అన్నం తూకంవేస్తాం! ఎవరని చెప్పాలి. వీరు నాకు గుర్తున్నవాళ్లు''

వారిముందుకు వచ్చాడు హెడ్డు. ''ఒరేయ్! గాడిదకొడుకుల్లారా! అన్నం ఒకసారి తిని రెండోసారి తినడానికి మీకు సిగ్గులేదూ! మిగిలినవారు ఏం తింటార్రా!'' అన్నాడు.

''హెడ్డూసాబ్! వాడు అబద్ధం చెబుతున్నాడు. మేంవరుస వెనుకలో ఉన్నాం. పోతాలు వచ్చేసరికి వరుసపోయింది. మేము వెనుకే నిలబడి ఉన్నాం. మాకు కూడు ఎవడు పెట్టాడు?'' అన్నాడు ఒక ఖైదీ.

నజీం వేలు చూపుతూ బెదిరిస్తూ దూకుడుగా వచ్చాడు ''రేయ్! ఖురాన్ నెత్తిన పెట్టుకుని ప్రమాణంచెయ్యి! నీవు అన్నం తీసుకెళ్ళలేదూ?''

''నిన్నెత్తుకుని ప్రమాణంచేయడానికైనా నేను సిద్ధమే! నాకు అన్నం పెట్టలేదు''

దూకుడుగా అతనిమీదకు వెళ్ళబోతున్న నజీంను హెడ్డు చెయ్యిపట్టుకొని వెనుకకులాగాడు. ఆ విసురులో వెనుకనున్న ఖైదీల మీదపడ్డాడు నజీం. వెనుకనున్న ఖైదీలు అతన్ని తొక్కడంతో గగ్గోలుగా అరచాడు.

పరిస్థితి ముదురుతున్నదని అర్థంచేసుకున్న హెడ్డు ఖైదీలనుండి దూరంగా జరుగుతూ ''అందరూ వరుసలో నిలవండి . పక్కన ఎవరూ ఉండొద్దు'' అంటూ అరిచాడు.

అంతవరకూ చూస్తూ నిలుచున్న పోతాలు హెడ్డు దగ్గరగా వచ్చాడు. అతన్ని చూసిన హెడ్డు నిలువుగుడ్లతో నిలబడ్డాడు.

''ఇంతకూ భోజనాలు పెడతారా? ఇలాగే మాటలతో కాలంగడుపుతారా?''

''పెట్టడానికే కదయ్యా ఇక్కడకు తెచ్చింది. ఖైదీలంతా ఇలా తయారయితే ఎట్లాపెట్టడం? ఎవడుతిన్నాడో, తినలేదో ఎవరికి తెలుస్తుంది?''

''మీరు తెలుసుకొనేలోపల తెల్లారుతుంది. జరిగింది జరిగిపోయింది. తిరిగి అందరికీ పంచండి. ఇప్పటికే సమయం ఏడుగంటలయింది. ఈపాటికి తిని లోపలకు వెళ్ళవలసింది'' అన్నాడు పోతాలు.

హెడ్డు, తన అసిస్టెంటుతో, గార్డులతో ఆలోచించాడు. కాకపోతే మరికొంచెం బియ్యం నష్టం. తక్కువ వచ్చిన ఖైదీలకు వండిపెడితే సరిపోతుంది. వీరితో ఇప్పుడే తగవుపెట్టుకోవడం మంచిదికాదని నిర్ణయించుకున్నాడు.

బిక్కుబిక్కుమంటున్న నజీంను పిలిచి- ''రేయ్... మరికొంత అన్నం వండించి. అందరికీ పెట్టు, తెల్లారి వీరి సంగతి చూద్దాం'' అన్నాడు హెడ్డు.

నజీం ఇద్దరు వంట ఖైదీలను తీసుకొని కిందికి దిగివెళ్ళాడు.

హెడ్డు అన్నం ముందుకు వచ్చి ఒక ఖైదీతో కాటా వేయించడం ఆరంభించాడు. వరుసగా, అందరికీ భోజనంపంపకం జరిగింది. అప్పటికే తిన్నవాళ్లకు రెండోసారి కూడా దొరకడం పరమానందభరితమయింది. రెండోసారి వంటవండి అందరికీ పంపకం పూర్తయ్యేసరికి రాత్రి తొమ్మిది గంటలుదాటింది. అప్పుడు ఖైదీలను వరుసలుగా నిలబెట్టి, ఎవరి సెల్‌కు వారిని పంపించి, గార్డులు క్రిందికి దిగివచ్చారు. ఆపాటికి వారికి నీరసం ఆరంభమయింది. ఎనిమిది గంటలకు హాయిగా భార్యా పిల్లల ముఖాలు చూస్తూ కూర్చునేవాళ్లు ఆరోజు ఇళ్లు చేరేసరికి పన్నెండుగంటలవుతోంది. హెడ్డు ముఖం కందగడ్డలా తయారయింది. ఐదుల క్షలరూపాయలు పోగొట్టుకున్న ఆఫీసర్లు ఏడుస్తూ, పరుపులమీద పొర్లాడుతూవుంటారు. ఈ సమయంలోవారికి ఈ గొడవ విషయం చెబితే మరింత తీవ్రతరంగావచ్చు. వారికి చెప్ప



కుండానే పనిపూర్తిచేస్తే! ఉదయం ఆలోచిద్దామనుకున్నాడు. ఇక ఖైదీలు మాటవినే దశ దాటిపోయింది. వీరికి మళ్లీ ఏదో ఒకశాస్తి జరిగితేనె తెలుస్తుంది- అనుకున్నాడు.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో తలుపు టకటక చప్పుడవుతుంటే కళ్లుతెరచి తలుపువైపు చూశాడు పోతాలు. గార్డు ఒకడు లాఠీతో ఊచలమీద కొడుతున్నాడు. పోతాలు లేచి కూర్చొవడంతో ‘‘ఇటురా పోతాలూ’’ అన్నాడు. ఆపాటికి ఆ సెల్‌లో చాలామందికి మెలుకువవచ్చింది. పోతాలు లేచి తలుపువద్దకు వచ్చాడు. ఆ గార్డును గుర్తించి నవ్వి ‘‘ఏం రంగరాజూ?’’ అన్నాడు.

‘‘భలే పనిచేశారయ్యా మీరు... నిన్ననే ఐదు లక్షలు మాదొరలు సూపరిండెంట్‌ముఖంమీద పోశారు. సాయంత్రం నగంమంది తిన్నాకూడా,రెండోసారి అన్నం వండించారు మీ ఖైదీలు’’ అన్నాడు ‘‘సిగరెట్టుందా?’’

పోతాలు సిగరెట్ ఒకటి అతనికి ఇచ్చాడు. అగ్గిపెట్టె జేబులోనుండి లాగి వెలిగించి, గుప్పున పొగవదులుతూ చుట్టూ చూశాడు. మూడుగంటలకు సెంట్రీఛార్జి తీసుకోవలసిన గార్డు రూంలో గురకపెడుతున్నాడు. పైన పోస్టుల్లో కాపలా ఉన్నవారు ఉండివుండి కేకలతో హెచ్చరించుకుంటున్నారు.

‘‘ఐదులక్షలు లంచమిచ్చారా?’’ అన్నాడు పోతాలు గార్డు గురకవింటూ.

‘‘లక్షణంగా ముడుపుకట్టిఇచ్చారు. ఇవ్వ

కుంటే ఇదే జైలుకి ఖైదీలుగా వాళ్ళు రావలసి వచ్చేది. మొత్తానికి సూపరిండెంట్ అఖండుడయ్యా! ఆ డబ్బు బాంకులో వేసుకుంటే జీతమంత డబ్బు ప్రతినెలా వడ్డీగా వస్తుంది"

పోతాలు పలుకలేదు. లంచం తీసుకోవడమే జరిగితే ఇక విచారణవల్ల ఏమీ లాభంలేదు. కాగా వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన వారిని జమాయించి బాదగలరు. వారికి అడ్డం ఏముంది? ఈ జైలుదాటి రహస్యాలు బయట పోవడానికే లేదు.

"ఖాసిం అని ఉన్నాడు పిక్‌పాకెట్‌గాడు... తెలుసా?"

తలూపాడు పోతాలు.

"రేపు వాని పని పట్టబోతున్నారు. వాడు జేబుదొంగ! సంవత్సరానికి ఐదుసార్లు ఈ జైలుకు వస్తాడు. వాడు తమమీద వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పాడని ఆఫీసర్లు ఉరుముతున్నారు. రేపు ఏమవుతాడో ఏమో?"

నిజమే! నిజం చెప్పిన అందరిలోనూ తక్కువ స్థాయి వ్యక్తి ఖాసిం! వాడిని చంపినా ఏమీ భయంలేదని గార్డులకు తెలుసు. మిగిలిన ఖైదీలలో హత్యకేసులకు చెందినవారు, పోతాలుకు చెందినవారు కొందరున్నారు. వారి మీద తొందరగా చర్య తీసుకోకపోవచ్చని గార్డు ఆలోచన!

"రంగరాజూ! ఇప్పుడు ఐదు లక్షలు పోగొట్టుకున్నారుకదా, ఇది ఎలా సంపాదించుకుంటారు వీళ్ళు? సంపాదించుకోకుండా విడవరుకదా!"

"నిజమే... ఎందుకు వదుల్తారు? ఈ జైలుకు నెలకు ఎనిమిది లక్షల రూపాయలు అలాట్‌మెంట్‌వుంది. అందులో జీతాలు రూపంగా డెబ్భైవేలు పోతే మిగిలిన ఏడు లక్షలా ముప్పైవేల రూపాయలు జైలు ఖర్చులకే! నెలకు రెండున్నర లక్షలు ఇందులో మిగిలించినా రెండు నెలల్లో వారి ఖర్చు పూడ్చివేస్తారు. అంతేగాదు! గార్డుల జీతాల్లోమాత్రం కొంత మొత్తం దిగ్గోయకుండా వుంటారా? ఏమో... పైన పరమాత్ముడికే ఎరుక" అన్నాడు చేతులు జోడించి.

"ఏదేమైనా నువ్వు జాగ్రత్తగావుండు. నీమాద వాళ్ళు కసిగా ప్రవర్తించే అవకాశాలున్నాయి. వాళ్ళ కన్ను నీమీదేవుంది"

"ఏవిధంగా ప్రవర్తిస్తారంటావు?"

రంగరాజు అతడి కళ్ళలోకి చూసి - "చెప్పలేను, నాకుమాత్రం ఏం తెలుసు?" అన్నాడు.

సిగరెట్ ఇనుపచువ్వకు ఒత్తి ఆర్పివేసి గార్డు రూంవైపు కదిలాడు. ఇనుపముక్క తీసుకొని గంటకొట్టాడు రెండు దెబ్బలు. ఆ శబ్దానికి ప్రతిగా పైన ఠాణానుంచి రెండుసార్లు ఖంగున శబ్దం విన్పించింది భూమి దద్దరిల్లేలా! ఆ మోత ఐదు నిముషాలు చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వుంది. శబ్దం అణిగిపోయిన తర్వాత పోతాలు వెళ్ళి తన స్థానంలో కూర్చున్నాడు. పక్కనున్న సలీం లేచి కూర్చుని బీడీ వెలిగించుకున్నాడు.

"ఏం చేద్దాం?" అన్నాడు వినిపించీ వినిపించనంత నెమ్మదిగా సలీం.

"చూద్దాం! మొట్టమొదటిసారిగా ఈ జైలులో అడుగుపెట్టాం. జైలంటే ఏమిటో తెలియని దశ! మనల్ని పీడించడానికి తయారయిన జైలర్ల చేతిలోపడ్డాం! ఏం జరుగుతుందో చూసిన తర్వాత ఆలోచిద్దాం! ఏమయినా ఎదుర్కోక తప్పదు"

ఇద్దరూ ఆలోచిస్తూ కూర్చున్నారు. ఆ ఆలోచనలమధ్య మూడో గంట కొట్టడం, కొత్త గార్డు సెంట్రీగా రావడం, తలుపులు శబ్దం చేసుకుంటూ అరవడం వారికి వినిపించినా ఆలోచనలోనుండి బయటపడలేదు.

ఒకటో సెల్‌వద్దకు వచ్చి "ఎవడ్రా కూర్చున్నది?" అంటూ అరిచాడు.

వాడితో వాదన పెట్టుకోవడం మంచిదికాదని ఇద్దరూ నేలకు జారారు. గార్డు తిట్టుకుంటూ ఆడవారి సెల్‌వైపు నడిచాడు. వాళ్ళు లోపల హాయిగా నిద్రపోతున్నారు. లైటు వెలుతుర్లో చెదిరిన వారి గుడ్డలవైపు, శరీరంవైపు చూస్తూ ఐదు నిముషాలు నిలబడ్డాడు.

తర్వాత టోపీ సవరించుకుంటూ - "లంజలు... తేరగాతిని నిద్రపోతున్నాయి. ఛూ... ఆడది కూడా దొంగతనం చేయడమే" గొణుక్కుంటూ ముందుకుసాగాడు.

ఆడవారి వార్డువైపు వచ్చిన ఏ గార్డూ పది నిమిషాలదాకా కదలడు. వాళ్ళు ఎప్పుడో ఓసా





రయినా అక్కరకు వస్తారని ఆశ! అందుకే అలా చూస్తూపోతుంటారు. ఆ జైలులో స్త్రీలకు ప్రత్యేక ప్రాంతమంటూలేదు. ఐదు సెల్‌ల వెంటనేవున్న ఒక మోస్తరయిన గదిని ఆడవారికి కేటాయించారు. ఆ గది కూడా ఆ ఆవరణలోనే వుంటుంది. అందువల్ల వారు బయటకు వచ్చే సౌకర్యంలేదు. పగలు మగఖైదీలు బయట తిరుగుతుంటారు. అయినా అటువైపు వారిని పోనివ్వరు గార్డులు. వంట మాత్రం వారి గది వద్దకే తీసుకెళ్తారు. వారి శిక్ష పూర్తయ్యేవరకూ వారు ఆ గదినుండి బయటకు రాలేని స్థితి!




ఉదయం ఎనిమిది గంటలకు రౌండుకు వచ్చాడు సబ్ జైలర్. జైలర్ రౌండుకు రావటానికి సిగ్గేసి ఆఫీసులో కూర్చున్నాడు. అన్ని సెల్‌లలోనికివచ్చి అందరినీ చూస్తూ వెళ్ళాడే గానీ ఎవరినీ పలకరించలేదు. అతడి ముఖం ఆముదం తాగినట్లుగావుంది.

మగ్గాలున్న గదిలోనికి వచ్చాడు. గార్డు లేచి నిలబడ్డాడు. అన్ని మగ్గాల్నిచూస్తూ, నవారునేసే ప్రాంతంవైపు వచ్చాడు.

నవారును పట్టి చూస్తూ "ఇదేం నేత? ఇలాగేనా నేసేది?" గాండ్రించాడు.

ఎవరినీ ఏమీ అనకుండా తమమీదకు వచ్చిపడిన అతడివైపు, నిలబడి నిలువు గుడ్లతో చూస్తున్నారు నలుగురు ఖైదీలు.

"రేయ్... ఇలారా!" అంటూ కేకేశాడు గార్డును. గార్డు జారిపోతున్న బెల్టునుపైకి లాక్కుంటూ లోపలకు పరుగెత్తాడు.

"ఏమిటిది... ఇది నవారా? దీన్ని బయట ఏ గాడిదకొడుకయినా కొంటాడా? ఎవడూ కొనకపోతే నీ జీతంలో దిగ్గోస్తాను"

గార్డు నవారును పరికించి చూసి, ఏమీ మాట్లాడలేదు.

"జాగ్రత్త! సరిచూడు. ఎవరినీ బయటకురాకుండాచూడు. టైం ప్రకారం ఖచ్చితంగా పని జరగాలి"

గార్డు తలూపాడు. అక్కడి నుండి బయట పడ్డాడు సబ్‌జైలర్. అతడి వెనుక హెడ్డు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు.

"ఏంసార్! అందర్నీ విడిచి మనమీద పడుతున్నాడు?" అన్నాడు ఒక ఖైదీ గార్డుతో.

"అంతేరా! ఎవడు చులకనగా కనిపిస్తాడో వాడే లోకువ! ఈ జైలులో మనమే అందరికీ చులకన! సరిసరి... కొంచెం బాగా నేయండి" అంటూ తన స్థానంవద్దకు వచ్చి కూర్చున్నాడు.

పొలం వెళ్ళిన ఖైదీలు తిరిగివచ్చారు. ఖాసిం పళ్ళెంలో అన్నం తీసుకుని వంటగది నుండి తన సెల్‌కు వెళ్తున్నాడు. అతన్ని చూసిన జైలర్ గార్డును పంపించాడు తీసుకు రమ్మని.

గార్డు పరుగెత్తుకుంటూవచ్చి ఖాసిం చొక్కా పట్టుకుని లాగాడు. అలా లాగడంతో అన్నం పళ్ళెం చేతుల్నించి జారి కిందపడింది. కింద పడిన అన్నంవైపుచూస్తూ "ఏమిటి?" అన్నాడు ఖాసిం.

"రారా! పెద్ద దొరగారు పిలుస్తున్నారు?" అంటూ లాక్కెళ్ళాడు.

"ఇటు రారా" అంటూ పిలిచాడు జైలర్.

ఖాసిం భయపడుతూనే జైలర్ టేబుల్‌దగ్గరికి వెళ్ళాడు. జైలర్ లేచి టేబుల్ చుట్టూతిరిగి అతడి ముందుకు వచ్చాడు.

"నిన్న నూపరిండెంటుకు ఏమని సాక్ష్యం ఇచ్చావురా?" అన్నాడు.

ఖాసిం పలుకలేదు. తాను ఇచ్చిన సాక్ష్యం అతడికి తెలిసింది. తెలియకుండా ఎలా ఉంటుంది? అయినా తాను అనవసరంగా సాక్ష్యం ఇచ్చానని తర్వాత బాధపడ్డాడు. ఏమో? ఆ ఎమోషన్‌లో నిజం చెప్పాలనిపించింది... చెప్పేశాడు. ఇప్పుడు ఏమనగల

డు- చెప్పలేదనలేదు.

జైలర్ చెయ్యిచాచి ఖాసిం గడ్డం కింద గుద్దాడు.

"యా! అల్లా!" అంటూ కిందపడ్డాడు.

గార్డు ఒకడు వచ్చి లేపి నిలబెట్టాడు. ఖాసిం వణుకుతూ నిలబడ్డాడు.

"సాబ్... తప్పయింది. మాఫ్‌కరోసాబ్" అన్నాడు నెమ్మదిగా.

కాని తొడల మీద బూటుకాలితో తన్నాడు జైలర్. ఖాసిం ఎగిరి ఎదురుగా వున్న గోడకు కొట్టుకున్నాడు. తల గోడకు తగిలి నెత్తురు కారసాగింది. పడుకున్న వాడు లేవలేదు.

"ఉఠ్‌రే!" అంటూ గార్డు వీపు మీద చరిచి నిలబెట్టాడు. ఖాసిం నిక్కరు తడిపేసుకున్నాడు ఏడుస్తూ.

"కొడకా! మీ సాక్ష్యాలు మమ్మల్ని ఏం చేస్తాయిరా? కాకపోతే నాలుగు డబ్బులు ఖర్చు చేయిస్తాయి. ఆ తర్వాత మీ గతి ఏమవుతుందో ఆలోచించారా? మాకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పి ఈ జైలులో ప్రాణాలతో ఉందామనుకున్నావ్‌రా!" అంటూ కాలితో మరో తొడ మీద తన్నాడు.

ఆ దెబ్బకు మరోసారి గోడకు కొట్టుకొని కిందపడ్డాడు. పడ్డవాణ్ణి పిర్రలమీద, వీపున, చేతుల మీద, రొమ్ము మీద ఎడాపెడా బూటుకాలితో తన్నాడు. లాగులోనే మలం చేసుకున్నాడు ఖాసిం.

అయినా జైలర్ కోపం తీరలేదు. లాఠీ తీసుకుని చేతుల మీద, మెడ మీద బాదాడు. ఖాసిం పలుకలేదు. వణుకుతూ బండల మీద పడివున్నాడు.

సబ్‌జైలర్ వచ్చి ముక్కు దగ్గిర వేలు పెట్టి చూశాడు. శ్వాస ఆడుతూనే ఉంది. "దొంగవెధవ! తంతారని కావాలని నటిస్తున్నాడు!" అంటూ లాఠీ తీసుకుని వీపుపై నాలుగుసార్లు బాదాడు.

దెబ్బలతో రక్తం కారి, మలంలోనూ, మూత్రంలోనూ కలిసిపోయింది.

మరో నలుగురు ఖైదీలను పట్టుకొచ్చారు. వాళ్ళంతా నిజం చెప్పిన ఖైదీలే! కింద వున్న ఖాసిం పరిస్థితి చూసి తమకు జరిగేదేమిటో వారికర్థమయింది.

దగ్గరికి రమ్మని లాఠీ ఊపాడు సబ్‌జైలర్! ముందుకు వచ్చినవాడి తలపట్టుకుని ముందుకు లాగి వీపున లాఠీతో బాదాడు. వంగినవాడు వంగినట్లే పడిపోయాడు. ఒక్కొక్కరినే ముందుకు పిలిచి బాదడం ఆరంభించాడు. గార్డులు తలుపువద్ద నిలువుగుడ్లతో చూస్తున్నారు. జైలర్ కుర్చీలో కూర్చున్నాడు.

కొట్టి కొట్టి ఆయాసం వచ్చిన సబ్‌జైలర్ లాఠీ కర్ర కిందపడవేసి ఒగరుస్తూ నిలబడ్డాడు. బురదలో పొర్లి పొర్లి బయటకు వచ్చి ఒగర్చే పందిలా వుంది అతడి పరిస్థితి! ఐదుమంది ఖైదీలలో ఏ ఒక్కడూ పలికే స్థితిలో లేడు.

"రేయ్! ఆ నాకొడుకుల్ని పిలిచి, ఈ నా కొడుకుల్ని తీయించండి" అంటూ అరిచాడు గార్డుల వంక చూసి.

గార్డులు పైకి పరుగెత్తి పదిమంది ఖైదీలను తెచ్చారు. వారు తమను కూడా కొడతారేమోనని వణకుతూ నిలబడ్డారు. వారిని బయటకు ఎత్తుకెళ్ళమని గార్డులు ఆదేశించడంతో, ఒక్కొక్కరినీ ఇద్దరుచొప్పున బయటకు మోసుకెళ్ళారు. తిరిగి వచ్చి నీళ్ళతో ఆ ప్రాంతమంతా శుభ్రం చేశారు. అక్కడ ఏమీ జరిగిన చిహ్నాలు కన్పించలేదు.

"పద్మను తీసుకురారా!" అన్నాడు సబ్‌జైలర్ గార్డుతో.

మరో పదినిముషాలలో పద్మ అనే ఖైదీ, ఆమె వెంట మహిళా గార్డు వచ్చారు.

సబ్‌జైలర్ టేబుల్ మీద విలాసంగా కూర్చుని, "ఏం పేరే నీది?" అన్నాడు. కింది పంటిని వేలితో కొట్టుకుంటూ దీర్ఘంగా కళ్ళలోనికి చూశాడు.

"నా పేరు పద్మండీ"

"ఏం కేసు?"

"హత్య కేసు?"

"ఎంతమందిని చంపావే?"

"ఎవరినీ చంపలేదు. పోలీసులు కావాలని నా మీద ఆరోపణ చేశారు"




# ఆ హత్యకి కారణం ఎవరు?



చక్కటి ఉద్యోగం, అతి చక్కటి సంసారంతో చల్లగా సాగిపోయే శామ్యూల్ జీవితంలో పెనుతుఫాను రేగింది. క్షణికావేశంలో తన ప్రియాతి ప్రియమైన వ్యక్తిని హత్యచేసి జైలుకెళ్ళాడు. హత్య చేసేటంతటి ఆవేశం తెప్పించిన ఆ సంఘటన ఏమిటి? ఆ ప్రియవ్యక్తి ఎవరు?

ఉరిశిక్షపడిన శామ్యూలుకి బాంక్ దోపిడీలుచేసే పరమకిరాతకుడు జగ్గరాజుతో పరిచయం ఏర్పడటంతో తను చేసిన హత్యకు కారణమైన వ్యక్తిపై పగసాధించడానికి అతన్ని పావులా వాడుకున్నాడు శామ్యూల్. ఎలా?

**అడుగడుగునా సస్పెన్స్‌తో నడిచి, పోటీ కథల్లో ఉత్తమకథ**గా రూ|| 1000 గెలుచుకున్న తెలుగుకథ 'శిక్ష'.

## మరెన్నో ఇతర భాషా కథలతో...

మార్చి సంచిక **విపుల** రెండున్నర రూపాయలలో

"ఎవరిని చంపినట్లు ఆరోపించారు"

"నా భర్తను చంపినట్లు ఆరోపించారు. ఎలాంటి ఆడది అయినా భర్తను చంపుకోవలసిన స్థాయికి ఎందుకు వస్తుంది?"

"కావాలని సాక్ష్యాలు చెప్పే నీలాంటి ఆడది, భర్తను చంపడం ఓ లెక్కకాదే!" వెగటుగా నవ్వాడు. అతని నవ్వు చూసి తల వంచుకుంది.

"నిన్న సూపరిండెంట్‌గాడికి ఏమని చెప్పావ్?"

"ఏమీ చెప్పలేదే?"

"బాడ్‌కోవ్!" అంటూ ముందుకురికాడు హెడ్డు. "మీకు భోజనం సరిగా పెట్టటంలేదని నీవు కూయలేదూ? పోతాలుగాడిని ఎక్కడికో ఎత్తుకెళ్ళారని నీవు వాగలేదూ? ఖైదీలు ఏమీ చేయకున్నా కాల్పులు జరిపారని చెప్పలేదూ?"

"జరిగింది చెప్పమన్నారు... చెప్పాను. అందులో తప్పేముందీ?" అంది ఆమె.

మాట ముగించే లోపలే చెంప ఛెళ్ళుమంది. దెబ్బతగిలిన చెంపమీద చెయ్యివేసి కళ్ల నుండి నీరు కార్చింది.

"లంజదానా! మా తిండి తింటూ మా మీద బోగస్ సాక్ష్యం ఇస్తావా? ఎంత పొగరెక్కిందే నీకు? జైలు కూడు తింటే ఇదేనే తంటా!" అంటూ తొడమీద కాలితో తన్నాడు.

అరుస్తూ వెల్లకిలావడింది పద్మ. మహిళాగార్డు భయం భయంగా ఒకవైపు గోడనానుకుని నిలబడింది.

ఆమె దగ్గరగా వచ్చి గార్డు ఒకడు చెయ్యిపట్టిలేపి నిలిపాడు. దగ్గరగా తీసుకొచ్చాడు.

"నీ సాక్ష్యం ఏం చేస్తుందే మమ్మల్ని? నీవూ వాడూ మా ఈకె కూడా పెరకలేరు"

మరోసారి ఆమె పొట్టమీద కాలితో తన్నాడు.అరుపుతో పాటు చీర తడుపుకుంది. దగ్గరగా వచ్చి బూటుకాలితో డొక్కల్లో, వీపున ఇష్టంవచ్చినట్లు తన్నాడు. ఆయాసపడుతూ టేబుల్ దగ్గరగా వచ్చి "ఇటురా!" అన్నాడు ఒక గార్డును. ఆ గార్డు దగ్గరగావచ్చి స్టడీలో నిలిచాడు.

"దాని చీర, రవికా లాగివేయ్"

గార్డు తటపటాయించాడు. అలోగానే సబ్ జైలర్ మరోసారి గాంద్రిస్తూ హెచ్చరించాడు. మహిళా గార్డు భయంగా చూస్తూవుండగానే ఆ గార్డు పద్మచీర, రవికా పర్రునలాగి కిందపడేశాడు. పద్మ ఏడుస్తూ రెండు చేతులూ తొడల దగ్గరగా పెట్టుకుంది. బూటుకాలితో ఆ చేతుల మీద తన్నాడు సబ్‌జైలర్. "నీకే శాస్తి జరగాల్సిందేనే! మాకే పంగనామాలు పెడతావా? మాకు పంగనామాలు పెడితే మీకు అడ్డనామాలు పెట్టడం మాకు బాగా తెలుసే" అంటూనే ముఖంమీదకు ఒంగి ఉమ్మివేశాడు.

గార్డును పిలిచి- "దాని నోట్లో ఉచ్చపోయరా" అంటూ ఆదేశించాడు.

"సాబ్!" అంది మహిళాగార్డు ఆశ్చర్యంగా, భయంగా.

"నువ్వు బయటకు వెళ్ళవే... ఫో!" అంటూ కసురుకున్నాడు. ఆ గార్డు బయటకు పరుగెత్తింది. గార్డులు ఇద్దరు ముందుకు వచ్చారు.

"మీరు బయటకెళ్ళండి?" అన్నాడు అంతవరకూ చూస్తూ కూర్చున్న జైలర్. గార్డులు బయటకు వెళ్ళారు.

"నీవు చెప్పిన సాక్ష్యానికి తగినశాస్తి సరిపోయిందా?" అన్నాడు ఆమెను చూస్తూ.

ఆమె పలుకలేదు. లేచికూర్చుంది మోకాళ్ళు దగ్గరకు తీసుకుంటూ.

"దీన్ని ఇంతటితో విడిచిపెట్టకూడదు సార్" అన్నాడు సబ్‌జైలర్.

"అప్పుడే ఏమయింది? ముందుంది ముసళ్ళపండుగ! ఇంతమంది ముందు ఏంచేసినా అది మరోవిధంగా తయారవుతుంది. దీని సంగతి తర్వాత చూద్దాం" అంటూ "లే! ఆ చీర తీసుకొని వెళ్ళు" అన్నాడు జైలర్.

లేచి కిందనున్న చీర తీసుకుని మొలకు చుట్టుకుని ఏడుస్తూ బయటకు పరుగెత్తింది. ఆమె వెంట మహిళాగార్డు కూడా పరుగెత్తడం ఆరంభించింది.వారిద్దరూ పరుగెత్తుతూ రావడం ఆవరణలో ఖైదీలు చూసి, ఏదో జరిగిందనుకున్నారు. మగవాళ్ళను చేసినట్లే ఈమెను కూడా చేసివుంటారని నిశ్చయించుకున్నారు.

''సాక్ష్యం ఇచ్చిన పదిమందికీ రోజుకు ఒక పూటకంటే కూడుపెట్టవద్దని చెప్పండి. గంజి గదుల్లో వేయడంవల్ల మళ్ళీ ఏదో ఒకటి జరుగుతుంది. ఎవరినివారి సెల్‌లోనే ఉంచండి. వీలున్నప్పుడల్లా వడ్డించండి. శిక్ష ముగించుకుని బయటకు వెళ్ళేలోపల, ఏదో ఒకకాలు, చెయ్యి ఊడిపోవాలి. శాశ్వతంగా వారికి గుర్తుండాలి. ఈ ఆడదాని సంగతి కూడా చూడాలి'' అన్నాడు జైలర్ లాఠీ ఊపుతూ.

''ఈ పోతాలుగాడూ, వాడి మనుమల సంగతేమిటి? వాళ్ళు ఇక్కడున్నంత కాలం మనకు అడ్డుపడుతూనేవుంటారు. వాళ్ళను ఏదోఒకటి చేస్తేనే మిగిలిన ఖైదీలు కూడా భయపడతారు'' అన్నాడు సబ్‌జైలర్.

''సలీంగాణ్ణి తీసుకువస్తే?''

''వద్దు!'' అన్నాడు జైలర్. ''వాళ్ళను ఇప్పుడేం కదిలించినా మెడకు ఉరివేసుకున్నట్లుంటుంది. వాళ్ళ సంగతి తర్వాత చూద్దాం! వాళ్ళను బయటకు రాకుండా, కార్ఖానాలో పనికి వేయించండి. ఎవరెవర్ని కలుసుకుంటున్నారో చూస్తూ ఉండమనండి. వాడిమీద ఏం యాక్షన్ తీసుకున్నా మళ్ళీలేవకుండా ఉండాలి'' అంటూ లేచాడు జైలర్. అతడితోపాటు సబ్‌జైలర్ బయటకు వచ్చి మెట్లవైపు సాగాడు.

అంతవరకూ బిత్తరపోయి నిలుచున్న గార్డుల్లో చలనం వచ్చింది. అటుపోతున్న ఖైదీని పిలిచి, ఆఫీసులో చిమ్మమని ఆదేశించాడు హెడ్డు. అక్కడి నుండి వంటగది వైపు నడిచాడు. ఒక్కొక్కరే గార్డులు జారుకుంటున్నారు.

చివరగా పోతున్న గార్డు ''ఏందిది... ఇలా జరిగింది?'' అన్నాడు లోగొంతుకతో. రెండో గార్డు తలెత్తి అతని వైపు చూసి ''ఏం జరిగింది?'' అన్నాడు.

''మొగవాళ్ళవిషయమంటే సరే పోనీ! ఆడమనిషిని బట్టలు ఊడదీయడం! ఎంత సిగ్గుచేటు! ఇదే మన ఆడవాళ్ళను ఇలా తన్ని గుడ్డలు ఊడదీస్తే ఊరుకుంటామా?'' అన్నాడు అసహనంగా.

''నిజమేనయ్యా! కానీ ఏంచేస్తాం? వాళ్ళు అధికారులు! వాళ్ళకు ఇక్కడ ఎదురులేదు. మనం ఏమని మాట్లాడతాం... వారించగలమా?''

''అదేంమాట! వాణ్ణి నిలువునా పాడిచేస్తే మాత్రం ఇప్పుడు తప్పేమిటంటావ్?'' రెండోగార్డు గునగునగా అన్నాడు.

''ఒరేనాయనా! వాడు విన్నాడంటే ఇంకేమన్నావుందా? బజారు గూండాకూ, మన సబ్‌జైలర్‌గాడికీ తేడాఏమీలేదు. అందుకేవాడు ఆ విధంగా బరితెగించాడు. వాణ్ణి గురించి మనం ఏంమాట్లాడినా, అది బయటపడిందంటే రేపు వాడు మనల్నీ ఇలాగే చేస్తాడు. వాడితో మనకెందుకు... పద'' అన్నాడు.

ఆ ఇద్దరి మాటలు వింటూ కసవు చిమ్ముతున్న ఖైదీ- 'వీరిలోకూడా మానవత్వం ఉన్నవాళ్ళు ఉన్నారన్నమాట' అనుకున్నాడు. ఊపిరి పీల్చి వదలి చిమ్మి, చీపురు బయటపడేసి నిల్చున్నాడు. అంతవరకూ బీడీదమ్ము లాగుతూ గోడకు చేరగిలబడిన ఆఫీసు సెంట్రీ ఖైదీని చూసి ''జావ్‌రే!''అంటూ అరచి, తలుపులు దగ్గరకులాగి తాళం వేశాడు. తాళంచెవి నిక్కరు జేబులోనికి జారవిడిచి తుపాకి వీపుకు తగిలించి వంటరూం వైపు నడకసాగించాడు. ఇతడు వంటగది చేరేటప్పటికి గార్డులు అక్కడ ఛలోక్తులతో వందెంవేసుకుంటూ తిండితింటున్నారు. ఇతన్ని చూసి ''ఆవ్'' అంటూ తమలోకి ఆహ్వానించారు.

* * *

ఉదయం ఏడుగంటలకు గార్డువచ్చి, పోతాలును, మరి నలుగురినీ నేతమగ్గాలున్న కార్ఖానాలో ప్రవేశపెట్టాడు. పోతాలు విధిగా అందులోకి వెళ్ళాడు. అక్కడున్నంతవరకూ వారు చెప్పే పనుల్ని వ్యతిరేకించాలనుకోవడంలేదు. ఆ విధంగా కొంత కాలక్షేపంకూడా అవుతుంది. ఖైదీలకిచ్చే సదుపాయాలు సక్రమంగా ఇవ్వాలనే అతని వాదన.

అప్పటికే పదిహేనుమంది అక్కడికి వచ్చారు. కార్ఖానా వార్డరు సీతాపతి ముందుకువచ్చి ''నిన్నుకూడా ఇందులోకే పంపారా పోతాలూ?'' అన్నాడు.

''ఒరేయ్ ముసలోడా! నువ్వు నోర్మూసుకోరా! నీపని నువ్వు చూసుకో'' అన్నాడుగార్డుగద్దిస్తూ.

"అదేంటయ్యా! అతడేమన్నాడు? ఇక్కడ ఒకరితో ఒకర్ని కనీసం మాటలాడుకోనివ్వరా?" పోతాలు తీక్షణంగా అడిగాడు.

"అవసరమైతేనే మాట్లాడటం!' అనవసరంగా మాట్లాడకూడదనేది జైలు రూలు. అంతే.' అన్నాడు గార్డు మరింత గట్టిగా.

"సరే" అన్నాడు పోతాలు నిరసనగా. "నీ రూలూ నీవూ వంటగదిలోనికి వెళ్ళి మెక్కడానికి పనికివస్తాయి. నాకు అప్పుచెప్పవలసిన పనేదో చెప్పావు. ఇహ నీవు వెళ్ళు"

గార్డు ముఖం మాడ్చుకుని విసవిసా అక్కడి నుండి వెళ్ళిపోయాడు. మరికొంతసేపటికి కాస్తానా గార్డు వచ్చాడు. అందరినీ పరికించి చూసి "నిన్ను లోపలికి పంపారా?" అన్నాడు పోతాలుతో.

పోతాలు అవునన్నాడు.

"సరే...సరే... లోపలున్న తరువాత ఎక్కడయినా పనిచెయ్యాల్సిందేకదా! ఏమయ్యా వార్డరూ! పోతాలుకు ఏదో ఒకపనిచూపించు" అంటూ టోపీతీసి బల్లమీదపెట్టి కూర్చున్నాడు. మరో అయిదు నిమిషాలవరకూ బీడీదమ్ము లాగుతూ, ఆ తర్వాత పడుకున్నాడు. మరో అయిదు నిముషాలకు గురక ఆరంభమయింది.

సీతాపతి నవ్వి "ఈ గార్డు ఇంతే. జైలర్ రౌండుకు వచ్చేంతవరకూ నిద్రపోతాడు. వచ్చిపోయినతర్వాత అన్నం తినేవరకూ నిద్రపోతాడు. అన్నం తినివచ్చిన తరువాత తిరిగి ఇంటికి వెళ్ళేవరకూ నిద్రపోతాడు" అన్నాడు.

"ఇతడు మీకు ఏపనీ చెప్పడా?"

"నిద్రతోనే అతనికాలం గడిస్తే ఏం చెప్పగలడు? మేమూ ఒక పక్క కూర్చుని ఓపికవుంటే రెండుసార్లు మగ్గం కుచ్చులు లాగి, తర్వాత మాట్లాడుతూ కూర్చోవడమే. బయటిపనుల కంటే ఇదే చాలా సుఖమైంది" అన్నాడు.

నవారునేసే చేటుకువచ్చి కూర్చున్నారు అందరూ. సీతాపతి బీడీ వెలిగించాడు.

పోతాలు సిగరెట్‌తీసి వెలిగించుకుంటూ "నిన్న కొందరు ఖైదీలను బాగా తన్నారటకదా" అన్నాడు సీతాపతివైపు చూస్తూ.

సీతాపతి బాధగా నవ్వాడు. "ఏం తన్నులు... భయంకరంగా కొట్టారు. ఖాసింగాడు మరో నెలవరకూ కోలుకోలేడు పాపం! ఆడబిడ్డను చీరవిప్పి కొట్టాడంటే ఆ సబ్‌జైలర్‌గాడు ఎంత పరమదుర్మార్గుడో? వాడి పెళ్ళాన్ని ఎవడయినా అలా కొడితే వాడు సహిస్తాడా?"

పోతాలు చిన్నగా నవ్వాడు. "వాడు ఒక స్త్రీని కొట్టాడు గనుక, వాడి పెళ్ళాన్ని మరొకరు కొట్టాలనే వూహరావడమే మంచిదికాదు. ఎవరయితే ఏం! ఏ స్త్రీనయినా కొట్టకూడదు. వాడు ఆమెను కొట్టాడుగనుక, ఏమైనా శాస్తి చేయాలంటే వాడికే చేయాలి"

"ఇక్కడ వాడిని ఎదిరించేవాడెవడు? జైలర్‌కూడా లొంగిపోతుంటే! వాడు కర్కోటకుడు"

"కర్కోటకుడు కూడా చివరకు చస్తాడు"

మగ్గాల దగ్గరినుండి ఒక వ్యక్తి వచ్చి "మామా! తలకు నూనె కావాలి. రా... ఇద్దువుగాని" అన్నాడు.

సీతాపతి కన్నున లేచాడు- "ఏందహె! పొద్దున లేచినప్పటినుండీ"

వచ్చిన ఖైదీ సీతాపతి టోపీలాగి తిప్పుతూ "నీ తాతముల్లె ఉంచినట్లుందేంరా బోసడీ! అదంతా గౌర్నమెంటువాళ్ళదేరా. గౌర్నమెంటంటే మనమేనని నెహ్రూగారు ఏనాడో చెప్పారుగానీ, లే లే" అంటూ చెయ్యిపట్టి లాగాడు.

"నూనె ఏమిటి?" అన్నాడు పోతాలు వారిద్దరి పరాచికాలుచూస్తూ.

"చూడు పోతాలూ! మగ్గాలకు వేయడానికి జైలువాళ్ళు నూనె ఇస్తారు. వీళ్ళు మగ్గాలలో ఒక చుక్కవేసి, మిగిలింది తలకు రాసుకుంటారు. గార్డుగాడు నూనె ఏమయిందని నన్ను నిలదీస్తాడు" అన్నాడు సీతాపతి లేస్తూ.

"ఖైదీలకు తలకు నూనె ఇవ్వాలికదా... ఇవ్వరా?"

చేతితో నుదురు కొట్టుకున్నాడు సీతాపతి, "అన్నీ ఇచ్చారుగనుకనా అది ఇవ్వడానికి" అంటూ, నూనెడబ్బావద్దకు వెళ్ళాడు. నూనెడబ్బా ఖైదీ చేతిలోనికి ఒంచి, యధాస్థానంలో ఉంచి తిరిగి వచ్చేశాడు.







సబ్‌జైలర్ రౌండుకు వస్తున్నాడని తెలియడంతో ఎక్కడివారక్కడ సర్దుకున్నారు. గార్డు లేచి బెల్టులాగి నిలబడ్డాడు. చిన్న తలమీద పెద్దటోపీ చెవులుమూస్తూ దిగింది. లాఠీ చంకలో పెట్టుకున్నాడు.

సబ్‌జైలర్‌వస్తూనే అటెన్సన్‌లో నిలిచి శల్యూట్‌చేశాడు. సబ్‌జైలర్ అతనివైపు చూసి- "కొత్త ఖైదీలు ఎందరు వచ్చారు కార్ఖానాలోనికి?" అడిగాడు.

"నలుగురిని పంపారు సాబ్"

"ఆవ్" అంటూ ముందుకు సాగాడు సబ్‌జైలర్.

అతడివెంట గార్డు, హెడ్డు కదిలారు. పోతాలువైపు ఒక్కక్షణం చూశాడు. పోతాలు కండెలుచుట్టే యంత్రంముందు చేతులు వెనక్కు కట్టుకొని నిలబడి ఉన్నాడు. సబ్‌జైలర్‌వైపు చూడదలచుకోలేదు. అందరినీచూసి సబ్‌జైలర్‌వెనుతిరిగాడు. ఈరోజు నేతను గురించి వంకలు పెట్టలేదు.

అతడు వచ్చివెళ్ళిన వెంటనే వంట పైకి తెచ్చారు. గంట కొడుతూనే బిలబిలమంటూ ఖైదీలు పళ్ళేలు చేతపట్టుకుని పరుగెత్తారు. పావుగంటసేపు కంచాలుకడిగే శబ్దాలతో ఆ ప్రాంతం మార్మోగింది. వరుసగా బారులుతీరి నిలబడ్డారు. తూకం ఆరంభమయింది. ఖైదీలు సణుక్కుంటూ తీసుకుని పక్కకువెళ్తున్నారు. సణిగేవారివైపు మిర్రి మిర్రి చూస్తున్నాడు నజీం. పోతాలు పళ్ళెం కిందపెట్టాడు. కాటావే

సేవ్యక్తి తూకంవేసి అందులో అన్నంవేశాడు.

"ఎంత ఉంది ఈ అన్నం?" అడిగాడు తీక్షణంగా పోతాలు.

"ఏడొందల గ్రాములు"

"కిలో అన్నం తూకంవేయాలి, ఏడొందలు వేస్తే మిగతా అన్నం?"

"మమ్మల్ని అంతే తూచమన్నారు దొరగారు. ఇష్టమైతే తీసుకో! లేకుంటే పక్కకు పో" అన్నాడు వార్డరు నజీం ముందుకువచ్చి.

"మర్యాదగా కిలో తూకం వెయ్యి! లేకుంటే మీ జైలర్ వచ్చేలోగా మిమ్మల్ని వంట వండాల్సి వస్తుంది."

"ఏందోయ్... పెద్ద బెదిరింపు చేస్తున్నావు?" అన్నాడు ఒక గార్డు ముందుకువచ్చి.

పళ్లెంతో ముఖంమీద కొట్టాడు. గార్డు తూలి వెనుకకు పడ్డాడు. సలీం వంటవార్డరు చొక్కా పట్టుకుని, మెడ వంచాడు కానీ, కొట్టలేకపోయాడు. అతడు చేయి ఎత్తేలోపలే ఎన్నో చేతులు నజీం వీపుమీద నాట్యంచేశాయి. నజీం నురగలు కక్కుతూ నేలమీదపడ్డాడు. అయిదు నిముషాలలో హెడ్డు భీకరంగా వచ్చాడు. "నిన్ను జైలర్ పిలుస్తున్నాడురా" అంటూ.

"పదపోదాం" అంటూ పోతాలు అతనితో పాటు కదిలాడు. ఇద్దరూ ఆఫీసుకు వచ్చేసరికి గార్డులంతా బయట వున్నారు. పోతాలును మిర్రిమిర్రి చూస్తున్నారు. వారిలో కొందరు చిరునవ్వు నవ్వుతున్న వ్యక్తులూ వున్నారు చాటుగా! సబ్‌జైలర్‌ముందుకొచ్చి నిలబడ్డాడు పోతాలు.

"ఏమిటి మళ్ళీ గొడవ?" అన్నాడు సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి.

"మామూలే! రేషన్ తగ్గించారు... అడిగితే బెదిరిస్తున్నారు"

"ఎప్పుడూ నీకు అన్నంగొడవ తప్ప ఇంకేం వుండదా?"

"ఉండదు ఇక్కడ" అన్నాడు పోతాలు గట్టిగా "బతకడానికి అన్నం తినితీరాలనేది ప్రాథమికసూత్రం. ఈ జైలులో మా శిక్ష పూర్తిచేసుకుని బయటకు ప్రాణాలతో పోవాలంటే, కనీసం రేషన్ తప్పనిసరిగా అవసరం! జైలులో రేషన్ గురించి కాక, వ్యాపారాల గురించి ఏంగొడవచేస్తాం?"

"ఇప్పుడేం జరిగింది?"

"నేను వచ్చినమొదట్లో ఎనిమిదివందలా యాభైగ్రాములు ఇచ్చారు. ఇప్పుడు అందులో కూడా తగ్గించి ఏడువందలకు మార్చారు"

"తప్పదు మరి" అన్నాడు సబ్‌జైలర్. "నీవు చేసిన ఘాతుకంవల్ల మేము అయిదు లక్షలు వచ్చినవాడికి ముడుపు చెల్లించాం! అది తిరిగి రాబట్టుకోవాలంటే మరో నాలుగు నెలలు రేషన్ కోతకోయాల్సిందే"

"నేను ఒప్పుకోను"

"ప్రాణాలు పోగొట్టుకుంటావు!" అన్నాడు కర్కశంగా సబ్‌జైలర్.

"అవసరమయితే అందుకయినా సిద్ధమే! ఇక్కడ ఖైదీలకు సక్రమంగా రేషన్ వంపకం జరగాల్సిందే"

సబ్‌జైలర్ పటపట పళ్ళుకొరికాడు. "రేయ్ పోతాలూ! ఇంతవరకూ నీకు మర్యాద చూపాను. నీ అహంకారంతో అది పోగొట్టుకుంటున్నావు. నీకిష్టంవచ్చినపని చేసుకో పో! నీకు శక్తివుంటే రేషన్ ఎక్కువ తెచ్చుకో!" అన్నాడు లేస్తూ. క్రాస్‌బెల్ట్ సరిచేసుకుంటూ నిలబడ్డాడు.

"మీరు అన్యాయంగా ప్రవర్తిస్తున్నారు. ఇక్కడ మీకు అడ్డులేదనే భ్రమతో అహంకారంగా ప్రవర్తిస్తున్నారు. మా రేషన్ మాకిచ్చేవరకూ ఆందోళన కొనసాగిస్తూనేవుంటాం"

మాట పూర్తిచేయకముందే పోతాలు వీపున లాఠీ మోగింది.

పోతాలు కళ్ళు ఎర్రగా మారాయి. పళ్ళు కొరికి పిడికిలి బిగించాడు. ఆవేశంగా ఊపిరి పీల్చి వదులుతూ, పెదవి కొరుకుతూ నిలబడ్డాడు! "జైలర్! ఇది రెండోసారి నామీద చేయిచేసుకోవడం! దీని ఫలితం నువ్వు అనుభవిస్తావ్! ఇంతవరకూ పోతాలు మంచితనం చూశావ్! ఇకముందు పోతాలు చెడ్డతనంకూడా చూస్తావ్?"

మరో నాలుగు లాఠీదెబ్బలు పెళపెళ మార్మోగాయి. కిందకుతోసి గొంతుమీద కాలు




పెట్టాడు సబ్‌జైలర్. సమయానికి జైలర్ వచ్చి, చూసి వేగంగావచ్చి సబ్‌జైలర్‌ను పక్కకు లాగాడు.

"ఏమిటీ తొందర?" అన్నాడు.

"వీడికి అహంకారం ప్రబలిపోయింది. ఈ ఖైదీలకందరికీ నాయకుణ్ణనీ, వీడికి అడ్డులేదనీ విర్రవీగుతున్నాడు. హనుమంతుగాడిని చేసినట్లు చేస్తేగానీ వీడికి తెలివిరాదు" సబ్‌జైలర్ బుసకొడుతూ అన్నాడు.

జైలర్ పోతాలును లేపాడు. "పోతాలూ! నువ్వు మరీ బరితెగిస్తున్నావ్! ఇది మంచి పద్ధతికాదని మొదటిసారిగా హెచ్చరిస్తున్నాను. వెళ్ళు... మాట్లాడేదేమైనావుంటే తర్వాత మాట్లాడదాం" జైలర్ రామయ్య తీక్షణంగా చూశాడు.

"ఎప్పుడు మాట్లాడినా ఒక్కటే! రేషన్ సక్రమంగా ఇవ్వాలనేదే మామాట. ఇక కొట్టడంగురించి... మీరిక్కడ కొట్టగలిగారు. ఎందుకంటే కాపలాకుక్కలన్నీ మీకు సాయంవున్నాయిగనుక! ఇదే బయట కొడితే మీ సబ్‌జైలర్‌గాడు ఏమయ్యేవాడో నీకు తెలుసుగనుక బుద్ధిచెప్పాలి. రేషన్ అడిగితే మీరు దౌర్జన్యం చేస్తున్నారు. ఎందుకు? మీ అట్టహాసాలూ, విలాసాలూ మా రేషన్‌తో కొన్నవి. మీ గుడ్డలూ, తిండి, మీ పిల్లల చదువులూ మా రేషన్‌తో సంపాదించేవే. చివరకు మీ పెళ్లాల తల్లోపెట్టుకునే మల్లెపూలుకూడా మా రేషన్‌తో కొన్నవే! ఖైదీ అంటే నీచుడుకాదు. వాళ్ల కేసుల్లో ఎన్నోరకాలు. అందులో అన్యాయంగా లోపలకు వచ్చినవాళ్ళు వుంటారు. వారిని లోపల పడవేసి, వారికివ్వాల్సిన రేషన్ ఇవ్వక, అడిగితే కర్రలతో బాది చంపడానికి మీకున్న హక్కేమిటి? మిమ్మల్ని మాత్రం అవిధంగాచేస్తే తప్పేమిటి?"

జైలర్ అతని మెడపట్టుకుని తలుపుదాకా తీసుకొనివచ్చాడు. "ఇతన్ని పైకి తీసుకెళ్లండి" అన్నాడు గార్డులతో.

పోతాలు గార్డులకంటే ముందే విసవిసా వెళ్లాడు.

"ప్రభాకరరెడ్డీ! మీరు చాలా తొందరపడుతున్నారు. ప్రతిఒక్కరినీ కొట్టడం మంచిదికాదు. ఖైదీలను కొట్టాల్సిందే! కానీ ఎవరిని కొడితే నోరుమూసుకొని వుంటారో చూసికొట్టడం మంచిది. తిరగబడేవాడిని ఎన్నిసార్లు కొట్టినా తిరగబడుతూనేవుంటాడు"

"వాడు మీకు గతంలో తెలిసినవాడుగనుక సపోర్టు చేస్తున్నారు సార్! వాడి తలకాయ అహంభావంతో పేట్రేగిపోతున్నది"

"అదేంకాదు. వాడు నాకు తెలిసినవాడయినంత మాత్రాన నాకు ఎదురుతిరిగితే ఎందుకు ఊరుకుంటాను? ఇక్కడ నాకు వ్యతిరేకంగా జరిగే ప్రతివిషయంలో వాడే ప్రధాన పాత్రధారి! వాడివల్లనే ఇక్కడ అన్నీ వ్యతిరేకంగా మారుతున్నాయి. అయినంతమాత్రాన వాడి స్థాయి ఆలోచించకుండా కొడితే వచ్చే అనర్థం భరించాల్సివుంటుంది. ఇప్పటికే ఒకసారి మనచేతవాడు పెద్దమొత్తం ఖర్చుపెట్టించాడు.

మరోసారి వాడు అందుకు సిద్ధంగా వున్నాడు. వాడిని వేరే పద్ధతిలోనే వంచాలి"

ప్రభాకరరెడ్డి మాట్లాడలేదు. విసవిసా బయటకువచ్చి, మెట్లుదిగిపోయాడు. అతడు కనుమరుగవుతూనే గార్డులను పొమ్మనిచెప్పి, ఒక గార్డును పైకివెళ్ళి పోతాలును తీసుకురమ్మన్నాడు.

మరో ఐదు నిముషాలలో పోతాలు పైకివచ్చాడు. అతడి గుడ్డలు రక్తసిక్తమయి వున్నాయి. జైలర్‌లేచి చేతులు వెనుకకు కట్టుకుని అటుఇటు తిరుగుతున్నాడు. పైన తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ ఇద్దరి శరీరాలమీది చెమటను పోగొట్టలేకపోతున్నది.

"పోతాలూ! జరిగిందేదో జరిగిపోయింది. గతంగతః! ఈ మొత్తం ఖైదీ లందరిమీద ఒకరు సర్కిల్ వార్డర్‌గా వుంటాడు. ఆ పదవి నీకిచ్చేస్తాను. వంట కార్యక్రమాలతోసహా అన్నింటిమీదా అజమాయిషీ అతడికి వుంటుంది. కనుక నీ ఇష్టప్రకారమే వంట చేయించుకోవచ్చు."

పోతాలు తలఅడ్డంగా వూపాడు. "అందులో నేను రెండురోజులు కూడా వుండలేనని నాకేకాదు మీకూతెలుసు. తినమరిగిన మీ గార్డులు ఎవరూ నోరుమూసుకొని వుండరు.

ముందు వారి తిండితింటారు. మిగిలింది ఖైదీలకు పంచలేక ఖైదీల దృష్టిలో నేను తింటున్నట్లుగా చెడ్డపేరు సంపాదించుకోవాల్సి వస్తుంది. ఖైదీల దగ్గర నేను చెడ్డవాడిగా నిరూపించడానికి మీరుచేసే యత్నం ఇది.''

''పోనీ! నీవూ, నీ మనుషులు ఇరవైమందీ నేరుగా వంటగదివద్దకు వచ్చి మీకు కావలసినంత తిని వెళ్ళండి''

''అట్లా అయినా నేను చెడ్డవాడినే అవుతాను. నా ఒక్కడి అవసరంకొరకు కాదుగదా నేను ఇన్ని దెబ్బలుతిని పోట్లాడటం''

''ఏ పద్ధతీ అంగీకరించకపోతే ఏంలాభం? కేవలం ఇక్కడ కూడా నీ నాయకత్వం చూపించడానికి తప్ప మరెందుకూ పనికిరాదు పోట్లాట!''

''ఇందులో పోట్లాట ఏమీలేదు. వారికివ్వవలసిన రేషన్ వారికిస్తే మాట్లాడే అవసరంలేదు. వారికివ్వవలసిన కిలో అన్నం ఈరోజు నుంచే ఇవ్వండి. నేను జైలు నుండి బయటకు వెళ్ళేవరకూ మౌనవ్రతం పాటిస్తానని మీకు రాసిస్తాను''

జైలర్ ఏం మాట్లాడాలో తోచక బయటకు చూస్తూ నిలబడ్డాడు. పోతాలు ఎటువంటివాడో అతడికి తెలుసు. తెలిసీ, అతడివెంట కొంతకాలం తిరిగివచ్చిన తాను ఈరోజు అతనికి వ్యతిరేకంగా ప్రవర్తించక తప్పడంలేదు. అతన్ని లొంగదీయడం ఇక మాటలతో సాధ్యంకాదు. అలాగని తనకు వచ్చే రాబడిని వదులుకొని, అతడు చెప్పినట్లు వినడం అసలు సాధ్యంకాదు. సబ్‌జైలర్ ప్రభాకరరెడ్డి పద్ధతిలో అయితే అతన్ని లొంగదీయడానికి జనులు, తామే దెబ్బతినవలసి వస్తుందేమో? పోతాలు ఇంతటితో ఊరకుండడని తెలుస్తూనేవుంది. మళ్ళీ ఖైదీలు రెచ్చిపోతారు. ఫలితం ఇంతకు ముందే జరిగింది. మళ్ళీ అలాగే వుంటుంది.

ఏమి చేయడానికీ తోచకపోవడంతో ''వెళ్ళు... తర్వాత ఆలోచిద్దాం'' అన్నాడు.

పోతాలు పైకి వెళ్ళేసరికి అందరూ భోజనంచేసి, ఎవరి గదుల్లోవారు కూర్చున్నారు. అతడు కార్ఖానాలోనికి వెళ్ళాడు. కార్ఖానాలోని ఖైదీలు అందరూ ఒకచోట చేరి మాట్లాడుకుంటున్నారు. గార్డు యథాప్రకారంగా నిద్రలో వున్నాడు.

పోతాలును చూసి సలీం కిటికీలోవున్న అన్నం పళ్ళెంతెచ్చి ఇచ్చాడు. అన్నంతింటూ కూర్చున్నాడు పోతాలు. పగిలి రక్తం కారుతున్న అతని వీపునుచూస్తూ విచారంగా కూర్చున్నారు.

అన్నంతిని పళ్ళెంకడిగి నీళ్ళు బయట పారజల్లి, పళ్ళెం తీసుకొని లోపలకు వచ్చాడు.

''ఏం జరిగింది?'' అన్నాడు సీతాపతి.

''మామూలే! రేషన్ ఇవ్వమని అడిగితే మంట! వాళ్ళ పెళ్ళాల ముడ్డిమీద చీరలను లాగినట్లుంటుంది'' అన్నాడు సలీం ఛీత్కారంగా.

పోతాలు పలుకలేదు. వీపును గోడకు చేరగిలవేసి పైకప్పుకేసి చూస్తున్నాడు.

''రేషన్ ఎందుకు ఇవ్వరు?'' అన్నాడు సీతాపతి.

పోతాలు అతనివైపు తిరిగి ''సీతాపతీ! ప్రతిరోజూ జైలర్ ఇక్కడకు రౌండ్‌కు వస్తాడా?'' అన్నాడు నెమ్మదిగా.

సీతాపతి అతని ముఖంలోకి చూడలేక తలదించుకున్నాడు. ''ప్రతిరోజూ సబ్‌జైలర్ వస్తాడు. ప్రతి సోమవారం, అత్యవసరమనుకున్నరోజులలో జైలర్ వస్తాడు. ఆదివారం పని వుండదుగనుక ఎవరూరారు''

''సబ్ జైలర్ ఈరోజులాగే, ప్రతిరోజూ ఇటు నుండి అటు మొత్తం తిరిగివెళ్తాడా?'' అతడు ఎందుకు అడుగుతున్నాడో సీతాపతికి అర్థం కాలేదు. ''మొత్తంచూసి సంతోషంగావుంటే అందర్నీ పలుకరించి వెళ్తాడు. కోపంగావుంటే ఎవరినో ఒకరిని తిట్టో, కొట్టో వెళ్తాడు''

పోతాలు పలుకలేదు. ఎవరి పనుల దగ్గరకువారువెళ్ళి యాంత్రికంగా నిమగ్నమయ్యారు. కిటికీగుండా వస్తున్న చల్లటిగాలికి, లోపల కచుర్లు కదుల్తున్నాయి. వీరి విషయం గాలికి వదలి పడుకున్న గార్డు గురక స్పష్టంగా వినిపిస్తున్నది. బయట రేడియో కార్మికుల కార్యక్రమంలో, కార్మికులకు ఎన్ని హక్కులు వున్నాయో బోధిస్తున్నది.




సాయంత్రం నాలుగుగంటలయింది. నిద్రపోతూవున్న గార్డు ఆవులించి లేచాడు. చేతులు పైకిలేపి మెటికలు విరుస్తూ "సీతాపతీ!" అంటూ కేకవేశాడు. సీతాపతి లోపలినుంచి వచ్చాడు "సాబ్" అంటూ.

"అందర్నీ బయటకు పంపించు" అంటూ లేచి బయటకు వచ్చాడు.

ఖైదీలందరూ కార్ఖానానుండి బయటకు వస్తూనే తలుపుకు తాళంబిగించి, తాళం నిక్కరుజేబులోకి జార్చి నిద్రమత్తుతో అడుగులు వేస్తూ బయటకుసాగాడు. అక్కడనుండి ఒకటో సెల్‌లోనికి అడుగుపెట్టారు సలీం, నారాయణ, జనార్దన్, పోతాలు.

పోతాలు ఒంటిమీద చొక్కాలేదు. బెత్తెడు ఎత్తు వాపుదేలింది. చర్మంచిట్లి రక్తం కారి, గడ్డకట్టింది. ఖైదీలందరూ పోతాలు సెల్‌లోనికి పోతున్నప్పుడు చూశారు. కానీ ఎవరూ పలుకరించే సాహసం చేయలేదు. అతనితో మాట్లాడితే ఆఫీసర్లతో ఏం తంటావస్తుందోనని వారి భయం! గార్డులెవరూ ఆ ప్రాంతంలో లేరు. పగలు డ్యూటీలో ఉండే సెంట్రీగార్డులు కింద ఏచెట్టు నీడనో పేకాడుతూ ఉంటారు. కాపలా ఉండాల్సిన అవసరం వారికి లేదు. ఎప్పుడంటే అప్పుడు తనిఖీచేసేవారు ఎవరూలేరు. ఉదయం ఒంటిగంటకు ఆఫీసర్లు కిందికిదిగి వెళ్తే సాయంత్రం వస్తే వస్తారు. లేకుంటేలేదు. వచ్చినా ఆఫీసునుండి బయటకురారు. అందువల్ల గార్డులు నిర్లక్ష్యంగానే ప్రవర్తిస్తుంటారు.

"ఏదో ఒకటి చేయకుంటే లాభంలేదు పోతాలూ" అన్నాడు జనార్దన్.

"ఏం చేయాలి? ఇక్కడ మనం ఖైదీలం! బయటకు వెళ్ళితే ఒక్కొక్కడినీ ఒక్కోకాలూ విరిచేసేవాళ్ళం! కానీ లోపలుండి వారినేమీ చేయలేకపోగా, వారితో తన్నులు తినాల్సివస్తున్నది" అంటున్నాడు నారాయణ.

"ఈ జైలర్ రామయ్యగాడు మన ఊరికి ఇకరాకుండా ఉంటాడా? ఆరోజు వీన్ని కీళ్లు విరవకుండా మానుకుంటామా?" అన్నాడు సలీం.

పోతాలు వారి మాటలకు జవాబివ్వలేదు. దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. బయట ఖైదీలు కేకలు, అరుపులతో మాట్లాడుకుంటున్నారు- కొందరు నవ్వుతూ, కొందరు తిట్టుకుంటూ.

అన్నం గంట కొడుతూనే ఖైదీలు పళ్ళేల చప్పుడు ఆరంభించారు. "మీరు వెళ్ళండి... నాకు అన్నం అవసరంలేదు" అన్నాడు పోతాలు సలీంతో.

"అదేంటి పోతాలూ! అన్నం తినకుండా మనం ఏంచేస్తాం?"

"నాకు తినాలనిపించడంలేదు. బాధతో ఆకలికావడంలేదు"

★ ★ ★

తెల్లారింది. ఆ రాత్రంతా నొప్పులతో నిద్రపట్టక మూలుగుతూనేవున్నాడు పోతాలు. కొందరు నిద్రపట్టక అటుఇటు దొర్లుతూ కాలం గడిపారు. మరికొందరు కూర్చునే కాలంగడిపారు. ఎలాగయితేనేం తెల్లారింది.

తిరిగి ఎవరిపనుల్లో వారు సర్దుకుంటున్నారు. కింద పొలం పనులకు వెళ్ళే వారిని తీసుకెళ్ళడానికి గార్డులు వచ్చారు. వారు వెళ్ళిపోతూనే, కింద తోటలో నీళ్ళు పోసేవారు వెళ్ళిపోయారు. కార్ఖానా లోపలికి వెళ్ళే వాళ్ళు వెళ్ళారు. ఆ జైలులోవున్న ఏకైక కార్ఖానా అది!

లోపలకు వెళ్లిన తరువాత సలీంను దగ్గరగా పిలిచాడు పోతాలు. ఇద్దరూ కలిసి ఎదురుగా అవుపిస్తున్న కిటికీవద్దకు వెళ్లారు.

బయటకు చూస్తూ నిలబడిన పోతాలు సలీంవైపు తిరిగి- "నాకొకటి అనిపిస్తున్నది సలీం." అన్నాడు చిన్నగా.

"ఏమిటి పోతాలు?" కిటికీనుండి బయటకుచూస్తూ అడిగాడు సలీం.

"సబ్‌జైలర్‌గాడిమీద కసితీర్చుకోవాలి. ఆ కసి నాఒక్కడిదేకాదు... ఇక్కడ అందరికీ చీడపురుగు వాడు. ఆ చీడపురుగుబాధ లేకుండా చేయాలి"

"ఏవిధంగా?" అన్నాడు కనుబొమలు ముడేసి సలీం.

"పూర్తిగా తీసివేయడమే!"

"ఆతర్వాత మనం ఇక్కడవుంటే మన ప్రాణాలు పోతాయి. లేదా యావజ్జీవితశిక్ష తప్పదు. లోపలవుండి మనం చేయలేమని నా

ఉద్దేశం''

పోతాలు ఊపిరిపీల్చి వదిలాడు. ఎదురుగా వున్న నదిని చూపిస్తూ "మనం వాణ్ణి నాశనంచేసిన వెంటనే ఇక్కడనుండి పారిపోవడానికి ప్రయత్నించాలి. బయటపడ్డామా! ఆ కన్పిస్తున్న నది దాటామంటే మనం ఎవరికీ దొరకం! ఆ నదిలో నీళ్ళు వర్షంవచ్చినప్పుడు తప్ప మిగిలిన సమయాల్లో అడుగులోతుకు మించి వుండవు. దాదాపు కిలోమీటరు దూరం! మనం పారిపోవడానికి పదంటే పది నిముషాలు అవకాశం దొరికితే చాలు''

సలీం ఊపిరి తీసుకున్నాడు. ఈ జైలులో ఈ బాధలువడటంకంటే ముందు బయటపడటమే మంచిదని అతడూ ఆలోచిస్తున్నాడు.

"ఏవిధంగా పారిపోగలం? చుట్టూ బలమైన కావలావుందికదా?''

"అవన్నీ ఆలోచించే నీతో చెబుతున్నాను. ఇదే కార్ఖానాలో కదుర్లు సానపెట్టే రంపంవుంది... చూసేవుంటావ్! అది మనకు ఎప్పుడూ అందుబాటులోనే వుంటుంది. దానితో ఈ కిటికీ ఊచలు రెండు కోయగలిగితే— నా దృష్టిలో సులభమే అనుకో- బయటపడతాం. కిటికీకి సరిగ్గా కింద పెద్ద బండరాయి ఒకటి వుంది. అటు సెంట్రీపోస్టుకుగానీ, ఇటు సెంట్రీపోస్టుకుగానీ ఆ రాయి కన్పించదు. ఆ రాతిమీద దిగి, అక్కడినుండి నెమ్మదిగా నలభై గజాల ఆ కొండ దిగివెళ్తే కింద పొలాలున్నాయి. ఆ పొలాల వెంబడి వెళ్ళి నదిని దాటొచ్చు''

"ఇంత వివరంగా చెబుతున్నావుగానీ ఇది జరుగుతుందంటావా?'' అనుమానంగా అడిగాడు సలీం. అతనికి అనుమానమే— దాటలేమేమోనని.

"ధైర్యంగా ముందుకుపోవడమే! ఇక్కడ ఈ నికృష్టపు చావుకంటే, ప్రయత్నించి అందులో చచ్చినా పేరుంటుంది''

"మనం ఇద్దరమే పారిపోతే మనవారి గతేమిటి? వాళ్ళందర్నీ బాదిపారేస్తారు''

"మనవాళ్ళందర్నీ తీసుకెళ్దాం! ఇక్కడినుండి తప్పించుకుని బయటపడితే తలోతోవ చేసుకొని పారిపోవచ్చు''

సలీం తలూపాడు. మధ్యాహ్నం భోజనానికి వెళ్ళినప్పుడు మిగిలినవారితో మాట్లాడారు. రెండు సంవత్సరాలు ఈ జైలులోపడి వుండటమంటే వారందరికీ ప్రాణంపోవడంగానే వుంది. అవకాశం దొరికితే పారిపోదామనే నిశ్చయించుకున్నారు. ఏంచేయవలసిందీ పోతాలుకే బాధ్యత విడిచిపెట్టారు.

ఆరోజు రాత్రంతా దీర్ఘంగా ఆలోచించాడు పోతాలు. పారిపోతూ చిక్కారా, ప్రాణాలు పోయినట్లే. బయటికిపోయిన తరువాత దొరక్కుండా తప్పించుకోవాలి. దానికంటే ముందు ఇక్కడి నుండి బైటపడేటప్పుడు ఎంతో జాగ్రత్త అవసరం. పద్ధెనిమిదిమందిలో నలుగురే కార్ఖానాలో పనిచేస్తున్నారు. మిగిలిన పధ్నాలుగు మందినీ ఏవిధంగా కార్ఖానాలోకి తీసుకెళ్ళాలి? అందరూ కార్ఖానానుండే పారిపోవాలిగనుక, తప్పకుండా లోపలకు వెళ్ళాలి. వార్డరు ఊరుకుంటాడా? పారిపోవడానికి ప్రయత్నమని తెలిస్తే తనూ వస్తానంటాడు. అందులో పనిచేస్తున్న అందరూ పారిపోవడానికే సిద్ధపడతారు. వీరందరూ దాటేవరకూ గార్డులు చూడకుండా వుంటారా?

ఇవన్నీ సమస్యలే! పైగా సబ్‌జైలర్‌ను చంపడానికి సిద్ధపడ్డారన్న విషయం ఏ పిరికివాడికైనా తెలిసి వెళ్ళి చెప్పాడంటే ఇహ పారిపోయే ప్రయత్నం విఫలమవడం అటుంచి లోపలే ప్రాణాలు నిలువునాతోడేసి, హనుమంతులాగే ఆత్మహత్య చేసుకుని చచ్చారని ప్రకటిస్తారు. పారిపోవడానికీ, సబ్‌జైలర్‌ను చంపడానికీ ప్రయత్నించే వార్త జైలర్‌కు తెలిస్తే, ఇప్పుడు చూపిస్తున్న సానుభూతి ఏమాత్రం దొరకకపోగా, అతడి చేతిలోనే దారుణంగా అవమానంపాలు కావలసివస్తుంది. తాము పారిపోతే మొట్టమొదట ఉద్యోగం ఊడిపోయే వ్యక్తి జైలర్ రామయ్యే. అతడికీ, తమకూవున్న పరిచయం గార్డులు పై అధికారులకు వెంటనే తెలుపుతారు. దాని ఫలితంగా రామయ్య సస్పెండ్ అవుతాడు.

తన ఉద్యోగం పోయేటంత పనిచేస్తే అతడుకూడా ఓర్చుకోడు. అందువల్ల ముందు తాము పద్ధెనిమిదిమందీ పారిపోయే ప్రయ

త్నమే చేయాలి. మిగిలినవారు పారిపోవాల న్నా చివరగానే వుంచాలి.

ఈ నిర్ణయం తీసుకున్న తర్వాత బాగా నిద్రపోయాడు పోతాలు.

తెల్లారింది. ప్రతి రోజూలాగా ఆ రోజు కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. శుభ్రంగా తల స్నానం చేశాడు పోతాలు. గాయాలు ఇంకా సలుపుతున్నాయి. అయినా చన్నీళ్లతోనే స్నానంచేసి, గుడ్డలు ఉతుక్కున్నాడు. తెప్పించిన టీపొడి, బెల్లం కలిపి నీళ్ళుపోసి, మరగబెట్టుకురమ్మని సలీంను వంటగదికి పంపించారు. బాగా మరగబెట్టుకువచ్చిన టీ తాగుతూ పద్ధెనిమిదిమందీ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

ఖాసిం కుంటుకుంటూ వచ్చాడు అక్కడికి. "టీ నీళ్ళేమయినా వున్నాయా?" అన్నాడు కూర్చుంటూ.

"ఇప్పుడేగా తాగాము. మరికొంచెం ముందు వచ్చివుంటే సరిపోయేది. పోనీ బెల్లం, టీపొడి వుంది... తీసుకెళ్ళి కాచుకుంటావా?"

"ఈ దొంగనాయాళ్ళు కొట్టిన దెబ్బలకు ఇంకా తలతిరుగుడు తగ్గలేదు. నడిచే ఓపిక లేదులే. బీడీ ఒకటి వుంటే ఇవ్వు"

పోతాలు సిగరెట్ తీసి అతడి చేతిలోపెట్టాడు. ఖాసిం సిగరెట్ వెలిగించుకుని పొగవదులుతూ- "భాయ్! నన్ను చింతపండు వచ్చడి కింద దంచారు. నా కొడుకులు బయట దొరికితేనా?" అన్నాడు పళ్ళు నూరుతూ. ఇంకా అక్కడక్కడా రక్తంకారటం ఆగలేదు.

పోతాలు నవ్వాడు. "వాళ్ళు బయట దొరకరు భాయ్! దమ్ముంటే లోపలే చూడు, అప్పుడే నీధైర్యం అందరికీ తెలిసిపోతుంది"

"లోపల వాళ్లను ఏంచేయగలము భాయ్?"

ఎనిమిదిగంటలు కొట్టారు. పొలంపనికి ఖైదీలను తీసుకెళ్ళడానికి గార్డు వచ్చాడు. తమకు ఆరోగ్యం బాగాలేదనీ, రాలేమనీ చెప్పారు వీళ్ళు. వారిని బెదిరించే స్థితిలో గార్డులు లేరుగనుక వెళ్ళిపోయాడు. పోతాలుతోసహా నలుగురూ ఖార్కానాలోనికి ప్రవేశించారు.

సీతాపతి అపాటికే లోపలచేరి మగ్గాలదగ్గర పడుగులు చూస్తూ నిల్చున్నాడు.

"ఏం సీతాపతీ! దీక్షగా చూస్తున్నావు? మగ్గం నేస్తావా ఏమిటి?" పోతాలు నవ్వుతూ అడిగాడు.

"అది చేతనైతే ఈ జైలులోకి రావలసిన ఖర్మేమిటి? రోజుకో పదిరూపాయలు ఘనంగా సంపాదించుకునేవాడినే" అంటూ వెనుతిరిగి వారితోపాటు నవారునేసే చోటికి వచ్చాడు.

నవారు మగ్గాలమీద నారాయణ, సలీం కూర్చున్నారు. జనార్దన్ రాట్నందగ్గర కూర్చున్నాడు. పోతాలు కండెలుచుట్టే యంత్రంమధ్య నిలబడ్డాడు.

తలవంచి లోపలకు చూస్తూ- "సీతాపతీ! ఈ యంత్రంలో నిన్న నీవు ఇచ్చిన నాలుగు కదుర్లు సరిగా కూర్చోవడంలేదు. రంపం ఇవ్వు" అడిగాడు పోతాలు.

సీతాపతి చిన్న రూంలోనికి వెళ్ళి రంపంతీసుకొచ్చి అతడికి ఇచ్చాడు. పనిచేస్తున్నట్లు అందులోనికి వంగాడు. రంపం బలమైంది. దీనితో ఆ కిటికీ ఊచలు కోయగలగాలి. అవి కోయగలిగితే తాము బయటకు పోగలుగుతారు లేదా తాము ఇలాగే ఎదిరిస్తూ, దెబ్బలు తింటూ, తిండిలేక మాడవలసిందే! ఏది జరిగినా రెండుగంటలలో పూర్తికావాలి. సీతాపతికి తెలియకుండా ఊచలుకోయడం సాధ్యంకాదు. అతనితో చెప్పక తప్పదు. వ్యతిరేకిస్తే అతని నోరు మూయడానికయినా సిద్ధపడాలి.

గార్డు వచ్చాడు. ఆ చివరినుండి ఈ చివరి దాకా చూస్తూవచ్చాడు. అందర్నీ చూసినతరువాత, తన స్థానంలోకివెళ్ళి కూర్చున్నాడు. ఒక బీడీ వెలిగించి దమ్ములాగాడు. మరో పది నిమిషాలలో అతడు పడకవేశాడు.

పోతాలు సీతాపతిని దగ్గరకు పిలిచి వివరంగా చెప్పాడు. అయితే సబ్‌జైలర్‌విషయం తెలియనివ్వలేదు. తాము పారిపోదలచుకున్నామనీ, తాను కూడా రాదలచుకుంటే రమ్మనీ చెప్పాడు. సీతాపతి కొంతసేపు ఊగిసలాడినా చివరకు అంగీకరించాడు. నవారునేసే ప్రాంతానికీ, మగ్గాలకుమధ్య సరిహద్దుగోడ ఉంది. ఆ గోడపక్క రూంలో విడిభాగాలు వుంటాయి.






గోడదాటి నవారు నేసేప్రాంతం రావాలంటే చిన్న తలుపువుంది. దానికి చెక్కలు లేవు. కిటికీదగ్గర ఏంచేస్తున్నదీ మగ్గాలు నేసేవారికి కనిపించదు. నవారునేసే ఇద్దరికి కూడా ఈ విషయం చెప్పవలసి వచ్చింది. దాదాపు వీళ్లు కాక ఆరుమంది. ఈ మొత్తం దాటిపోవలసివ స్తుంది. నారాయణ, జనార్దన్‌ను ఊచలుకోయ డానికి నియమించాడు. ఆయిల్‌పోసి రంపం రాపాడిస్తుంటే శబ్ధంరావడంలేదు. సలీంను బయటకు పంపాడు పోతాలు. గార్డు తలుపువ ద్ద నిద్రపోతున్నాడు. తలుపుతెరుచుకుని ఒకటో నంబర్ సెల్‌వద్దకు వచ్చాడు. మిగిలిన వారిని తీసుకొని కార్ఖానాలోనికి వచ్చాడు. మగ్గా లమీద ఉన్నవాళ్ళు వీరిని చూసినా, పోతాలు మనుమలని తెలునుగనుక వారు ఏమీ మాట్లా డలేదు. అంతకుముందే నిర్ణయించుకున్న ప్రకారం, ఎవరి ప్రాంతంలో వారు నిల్చున్నారు.

సీతాపతి వీరందరినీ చూసి "ఇందరు ఎందుకు?" అన్నాడు. భయంగా అతని గుండెలు గుబగుబలాడుతున్నాయి. తప్పించుకోలేకపోతే జీవితాంతం ఇందులోనే తోస్తారేమో అన్న భయంకంటే పడే దెబ్బలుగు రించి భయపడుతున్నాడు. 'ఖాసింగనుక ఆ దెబ్బలు తట్టుకున్నాడు. నేనైతే ఆరోజే చచ్చేవా ణ్ణి' అనుకున్నాడు. పారిపోవాలనుకుంటుంటే ఖాసిం దెబ్బలు జ్ఞప్తికి వస్తున్నాయి.

"వాళ్ళు మావాళ్ళే! వాళ్ళూ రాకతప్పదుక దా! మావాళ్ళని ఇక్కడ విడిచిపెడితే వారిని

చంపనయినా చంపుతారుకదా!"

సీతాపతి తలూపాడు. ముచ్చెమటలు పోస్తున్నాయి. లెట్రిన్‌కువెళ్ళి వస్తానన్నాడు. ఆ విధంగా బయటపడి అందరికీ చెప్పి అల్లరిలే పుతాడేమోనని పోతాలు భయం! ఒక మూల పోసుకోమన్నాడు.

"ఎందుకూ ఇక్కడ భ్రష్టుపట్టించడం! ఎంతసేపట్లో వస్తాను!" అన్నాడు సీతాపతి బయటకుపోయి రావాలన్న ఉద్దేశంతో.

అతన్ని బయటకు పంపదలచుకోలేదు పోతాలు. "మనం ఎట్లాగూ వెళ్ళిపోతున్నాం. ఇక్కడ భ్రష్టుపడితే వచ్చే నష్టం ఏమీలేదు"

నారాయణ చేతులు దులుపుకుంటూ వచ్చాడు. "రెండు కడ్డీలు తెగిపోయాయి" అన్నాడు సంతోషంగా.

పోతాలు గబగబ అక్కడకు వచ్చాడు. రెండు కడ్డీలు పైకిలేపి ఉన్నాయి. ఆ సందు నుండి ఎంత లావుమనిషయినా సునాయా సంగా దూరిపోవచ్చు. కిందికి తలవొంచి చూశా డు. కింద పెద్దబండ ఎండకు తళతళ మెరు స్తున్నది.

కిందికి చూడబోతున్న సలీంను పక్కకులాగి "యంత్రందగ్గర పెద్ద తాడువుంది, తీసుకు రా!" అన్నాడు.

సలీం పరుగెత్తుతూ వెళ్ళి లావుపాటి తాడు తీసుకువచ్చాడు. అక్కడ మగ్గంపడుగులకు కట్టడానికి ఎప్పుడూ కావలసినన్ని తాళ్లు ఉంటాయి. తాడు కిటికీనుండి ఎంతదూరం వెళ్తుందో ఆలోచించాడు. సరిపోతుందనుకున్న తర్వాత పైకిలేపి వంచిన ఇనుపవూచలకు గట్టిగా కట్టేడు. లాగిచూసి జారదని నిర్ణ యించుకుని అక్కడినుండి పక్కకువచ్చాడు.

"సలీం! టైమవుతున్నది. ఒకవిధంగా విజయం సాధించాం! కానీ ఇంకా కొన్ని విష యాలలో విజయం సాధించాల్సివుంది. ఏమా త్రం ఏమరుపాటుగావున్నా మన ప్లాను పాడవ డమేగాకుండా, మన ప్రాణాలుపోతాయి. మన ప్రాణంపోయేపరిస్థితి ఏర్పడినప్పుడు, ఎదుటి వాడి ప్రాణం పెద్ద విలువకాదని మనం గమ నించాలి. సిద్ధంగా వుండండి" అన్నాడు.

సలీం తలవూపాడు. గోడదగ్గరగావచ్చి అటు నలుగురు, ఇటు నలుగురూ నిలబడ్డా రు. మరో నలుగురు యంత్రంపక్క కనిపించ కుండా నిలబడ్డారు.

మిగిలినవారు రోజులాగా ఎవరి స్థానాల్లో వారున్నారు. కిటికీ చువ్వలు వొంచి పారిపో కుండా ఇంకా ఎందుకు అటుఇటు నిలబడు తున్నారో సీతాపతికి అర్థంకాలేదు. ఇంకా పారి పోకుండా ఉండటమేమిటి? ఆలస్యంచేస్తే సబ్‌జైలర్ వస్తాడు. వంచిన కిటికీని చూసి అందరినీ బాదిపారేస్తాడు.

ఉండలేక అడిగాడు సీతాపతి ఆందోళన గా— "ఇంకా ఏమిటి ఆలస్యం? కిటికీచువ్వ లు వొంచేశారుగా.... పారిపోదాం పదండి"

పోతాలు యంత్రందగ్గర నిలబడి నవ్వా డు. "ఇంకా కొంచెంపనివుంది. అదిపూర్తవు తూనే వెళ్దాం!"

"అయ్యా! సామీ! వాడు- సబ్‌జైలర్- వస్తూ వుంటాడు. వాడు ఈ కిటికీ చూస్తే, ఆ చువ్వల లాగా మనల్ని వంచేస్తాడు. వాడు రాకముందే పారిపోవాలి"

పోతాలు పలుకలేదు. వీరికంటే ముందే పారిపోదామనుకుని బిరబిరాతాడు దగ్గరకు వెళ్లాడు సీతాపతి. సలీం మగ్గందగ్గరనుండి లేచివచ్చి, లాగి ఒక మూలకు తోశాడు. సీతా పతి దభిల్లునమూలన పడి ఏడవడం సాగించాడు.

"నన్ను వంచించి మీరు పారిపోవాలని ప్రయత్నిస్తున్నారు"

"నీకాభయం లేదు. నిన్ను తీసుకెళ్తాం. ఆ హామీ నాది" అన్నాడు సలీం.

ఆవరణలోని గార్డురూంలో గంట కొట్టారు. అంటే సబ్‌జైలర్ రౌండుకు బయలుదేరాడు, ఖైదీలు ఎవరి సెల్‌లో వారుండమని అర్థం.

పోతాలు ఊపిరిపీల్చి విడిచాడు. సలీం మనస్సు ఉద్వేగంతో ఊగుతున్నది. ఏం జరు గుతుంది? అనుకున్నది నెరవేర్చగలమా లేదా?

నారాయణ సర్వసిద్ధంగా ఉన్నాడు. అతడు తగవులాటల్లో ఆరితేరినవాడు. ఎవరిని ఏవి ధంగా కిందపడవేయాలో మెలకువ తెలిసిన




వాడు. తలుపు దగ్గరే ఎదురుచూస్తున్నాడు.

తలుపు తెరుస్తున్న సవ్వడి అయింది. అంటే గార్డులేచి కూర్చుని తలుపు తెరిచాడన్న మాట! ఇక వాళ్లులోపలకు వస్తారు. ఎంత మంది వస్తారు? వస్తే వెంట హెడ్డు ఒక్కడు, లేదా మరో గార్డు వస్తాడు. ఇక్కడ కాపలావున్న గార్డుతో కలుపుకుంటే, ముగ్గురు లేక నలుగుర వుతారు. నలుగుర్ని నిలవడానికి పద్ధెనిమిది మంది చాలు! పైగా హఠాత్‌దాడికి ఆ నలుగు రూ తేరుకోకముందే దెబ్బతీయగలస్థాయిలో వీరున్నారు. ఇవన్నీ ఆలోచించే స్థిరంగా ఉన్నారు.

బూట్లు టకటకమంటున్నాయి. సీతాపతి గుండెలమీద మోగుతున్నట్లున్నాయి. జైలర్ వచ్చి కిటికీ చూస్తే ఇంకేముంది? ఈ గాడిదకొడుకులు చువ్వలు వొంచి ఇక్కడెందుకు కూర్చున్నారు? అతడికి ఆగ్రహం కట్టలు తెంచుకు వస్తున్నది. ముందు కార్ఖానా గార్డు లోపలకు అడుగుపెట్టాడు. అతడు ముందుకు చూస్తుండటంవల్ల గోడచాటున ఎవరున్నదీ తెలియదు. ఎదురుగా కిటికీ చువ్వలు వంచి ఉంటారన్న ఊహేవారికిలేదు. గార్డుతోపాటు సబ్‌జైలర్, అతడితోపాటు హెడ్డూ అడుగుపెట్టారు.

మెరుపులా అటూఇటూ ఎనిమిదిమంది దాడిచేశారు.

ఆ హఠాత్‌సంఘటనకు కోలుకోకముందే నలీం, పోతాలు సబ్‌జైలర్ మెడవిరగవొంచి కిందపడేశారు.

హెడ్డునూ, గార్డునూ కట్టివేసి నోటిలో గుడ్డలు దూర్చారు. ఎవరూ ఒకరితో మరొకరు మాట్లాడుకోలేదు. నలీం, జనార్దన్ గట్టిగా పట్టుకుంటే, నారాయణ జైలర్ గొంతుపిసకడం ఆరంభించాడు. జరిగిందేమిటో సబ్‌జైలర్ అర్థంచేసుకునేలోపల అతని ప్రాణంపోయింది.

హెడ్డూ, గార్డు ప్రాణభయంతో బిత్తరచూపులతో చూస్తున్నారు. వారి కళ్ళనుండి నీరు కారుతున్నది. వారికి మాట్లాడే అవకాశంలేదు. వారి జీవితంలో ఎందరినో లాఠీలతో బాదివేసివుంటారు. అలా లాఠీలతో బాధించుకునేవారే ఈరోజు సబ్‌జైలర్‌కు నూకలు లేకుండా చేశారు. తమకు కూడా లేకుండా చేస్తారేమోనని వారి భయం, వణకు!

అందరినీ కిటికీవద్దకు పరుగెత్తమన్నాడు పోతాలు. ఈ హఠాత్ సంఘటనతో బిత్తరపోయి స్పృహతప్పి వున్నాడు సీతాపతి! అతన్ని ఇక ఏమీచేయడం సాధ్యంకాదు. అతడు కిందికి దిగలేడు, దిగినా పారిపోలేడు. వణికే కాళ్ళతో ఎంతదూరం పోతాడు? దొరికిపోతాడు. అతన్ని తీసుకెళ్ళడం ప్రమాదకరమని నిర్ణయించుకున్నారు. ఒక్కొక్కరినే కిందకు దిగమన్నాడు.

వీరు పద్ధెనిమిదిమందిగాక మరో ఐదుగురు.

వీరందరూ కిందికి దిగిన తర్వాతే పోతాలు చివరిగా దిగాడు. అక్కడినుండి కొండ నలభై గజాలు ఎత్తు వుంది. కొండమీద నుండి రాళ్ళమధ్యపాకుతూ అందరూ కిందకు చేరారు. అంతవరకూ ఎవరి కంటాపడలేదు. ఇక బయలులో నడవాలి. ఏ సెంట్రీ అయినా జాగ్రత్తగా ఉండి పొలాలవైపు చూస్తే ఖైదీగుడ్డలతో పారిపోయే తాము కన్పిస్తారు. ఆతర్వాత వెంటబడతారు. కొందరయినా దొరికిపోతారు.

పోతాలు కొండదిగువన నిలబడ్డాడు. అందరూ అక్కడికి చేరారు. అక్కడ గడ్డి పొదలుండటంవల్ల మైదానంవారికి వీరు కన్పించరు. అది దాటితేనే కష్టం!

నలీంను దగ్గరగా పిలిచాడు పోతాలు. "నలీం! ఇంతవరకూ అందరూ కలిసి వచ్చారు... బాగుంది. మనం ఎవరి కంటాపడలేదు. ఇక్కడినుంచి ఎవరి దారి వాళ్లు చూసుకోవాలి. ఐదుఫర్లాంగులు వెళ్తే నది దాటవచ్చు. నది దాటితే యూకలిప్టస్, సరుగుడు కర్రల తోటలున్నాయి. అందులో పడితే చాలా దూరం నెట్టుకు వెళ్ళవచ్చు. ఇక్కడినుండి ఎవరి ఇష్టం ఉన్నవైపుకు వారిని పరిగెత్తమను. ఒకరికి ఒకరం రక్షకులం కాదు"

నలీం అందరికీ అదే హెచ్చరిక చేశాడు. ముందు పోతాలు తలవొంచుకుని పరుగు అందుకున్నాడు. అతడి వెంటనే నారాయణ, ఆ వెంటనే నలీం... ఒక్కొక్కరు ఒక్కోవైపుగా

పరుగెత్తడం ఆరంభించారు.




ఇక్కడ లోపలకు వెళ్లిన సబ్‌జైలర్ ఎంతకూ రాకపోవడంతో సెంట్రీ లోపలకు తొంగిచూశాడు. కనిపించలేదు.

మగ్గాల దగ్గరనుండి నవారునేసే ప్రాంతంవైపు వచ్చాడు.

లోపలకు వచ్చి చూసిన అతడి గుండె నీరైపోయింది. గట్టిగా అరుస్తూ, గావుకేకలుపెడుతూ ఆవరణలోనికి పరుగెత్తాడు.

అతడి అరుపులకు అర్థం తెలియక మగ్గాలమీదున్న ఖైదీలు లోపలకు వచ్చి చూసి, వణికిపోతూ వారూ బయటకు పరిగెత్తారు.

గార్డురూంలో ఎమర్జన్సీగంట మోగించడంతో కొందరు గార్డులు బిలబిల పైకి పరిగెత్తారు. వారందరికీ సెంట్రీ వివరాలు చెప్పాడు. గార్డులు భయంతో నీరసించిపోయారు. ఒక గార్డు పరిగెత్తుకుంటూ వెళ్లి జైలర్‌కు చెప్పాడు.

జైలర్ పరుగున పైకివచ్చాడు. గార్డులతో కలిసి లోపలకు వచ్చాడు. హెడ్డు, గార్డు కట్టివేసి నోటిలో గుడ్డలు కుక్కబడి వున్నారు. సబ్‌జైలర్ కిందపడి వున్నాడు. దగ్గరగా వచ్చి నాడి చూస్తే అపాటికే శరీరం చల్లబడేదశలో వుంది. హెడ్డు, గార్డు నోటినుండి గుడ్డలు లాగారు. ఇద్దరూ జైలర్ కాళ్లమీదపడి ఏడుస్తూ వివరంగా చెప్పారు.

అంతవరకూ జైలర్‌గానీ, గార్డులుగానీ పోతాలు విషయంలో ఆలోచించలేదు. హెడ్డు చెప్పిన తరువాత కిటికీ ఊచలవైపు పరుగెత్తాడు జైలర్. చువ్వలు వంచి తాడు కట్టబడి వుంది. కిటికీ ఎక్కి కిందికి చూశాడు. తాడు రాతిమీదకు పడివుందేగానీ, మనుషులు ఎవరూ కనిపించలేదు.

తలఎత్తి పొలాలవైపు చూశాడు. కింద అప్పుడే పరుగెత్తుతున్నారు ఖైదీలు. జైలర్ లోపలకు దుమికి ఆఫీసు రూంవైపు పరుగెత్తుతూ "ఎమర్జన్సీ అలారం మోగించండి" అంటూ అరిచాడు.

ఆఫీసులోకి వెళ్లి పోలీసు సూపరిండెంట్ ఆఫీసుకు ఫోన్‌చేసి ఖైదీలు పారిపోతున్నారనీ, వారిని వెంబడించమనీ చెప్పాడు.

సెంట్రీ పోస్టులో ఎమర్జన్సీగంట భయంకరంగా మోగుతున్నది. కింద గార్డురూంలో వున్న గార్డులు తుపాకులు తీసుకుని పైకి వురుకుతున్నారు. క్వార్టర్స్‌లోని ఆడవాళ్ల పిల్లలేకాదు... ఆ ప్రాంతాల అంగళ్లు ఉన్నవాళ్లూ, తిరుగుతున్న జనం ఎక్కడివారక్కడ నిలబడి ఆ గంట శబ్దం వింటున్నారు.

కర్ణకఠోరంగా మోగుతున్న ఆ గంటకు అర్థం తన భర్త హత్య చేయబడటమని సబ్‌జైలర్ భార్యకు తెలియదు.

అందరికీ తెలిసింది- ఎవరో ఖైదీలు పారిపోవడంగానీ, లోపల ఖైదీలు తిరుగుబాటు చేసినప్పుడుగానీ మోగుతుందని! అందువల్లనే అందరూ ఆశ్చర్యంతో నిలబడి చూస్తున్నారు కొండవైపుకు.

జైలర్ గార్డులతో లోపలకు వచ్చాడు. ఖైదీలందరినీ వరుసగా కూర్చుండబెట్టాడు. మొత్తం ఇరవైముగ్గురు ఖైదీలు తక్కువయ్యారు. అంటే పారిపోయారు.

ఒక జైలు చరిత్రలో ఇరవైముగ్గురు ఖైదీలు పారిపోవడమేగాదు- ఏకంగా సబ్‌జైలర్‌ను చంపిపోవడమంటే సామాన్యమైన విషయంగాదని జైలర్‌కు తెలుసు!

అందరినీ సెల్ లోపలకు తోసి తాళాలు బిగించి, గార్డులను కొండదిగమని ఆదేశించారు. గార్డులకు లోపల వణుకు పుడుతున్నా బాధ్యత వుందిగనక దిగక తప్పలేదు.

ఖైదీల చేతికి ఒంటరిగా దొరికితే తమల్ని పచ్చడి చేస్తారు. ఎలాగూ ఈపాటికి లోకల్ పోలీసులు, రిజర్వు పోలీసులు రంగంలోకి




దిగివుంటారు. మనం పోకున్నా, పోయినా ఒక్కటే! అనుకున్నారు వారు. అయితే డ్యూటీ డ్యూటీయే కనుక వాళ్ళూ కొండచుట్టూ తిరిగి పొలాలవెంట పరుగెత్తడం ఆరంభించారు. వారికి పచ్చటి పొలాలు తప్ప ఖైదీలు ఎవరూ కనిపించలేదు.

జైలర్ పైఅధికారులకు ఫోన్‌చేసి కూర్చు న్నాడు. తాను ఖైదీలవెంట పడటంకంటే చే యవలసిన పనులు చాలా వున్నాయి. అవన్నీ చూసుకోవడానికి ఇక్కడ ఎవరూ లేరు. విషయం తెలిసిన సబ్‌జైలర్ భార్య ఏడుస్తూ వచ్చింది. ఆమెతోపాటు జైలర్ భార్య, కూతు రు వచ్చారు. భర్త శవం దూరంనుంచే చూసి ఆమె మూర్ఛపోయింది.

మూడో నంబర్ సెల్‌లో ఖాసిం బీడీ తాగు తూ సంతోషంగా కూర్చున్నాడు. తాను పారిపో లేనందుకు కొంచెం బాధగానే వున్నా అంతకు మించి ఎన్నోరెట్లు సంతోషంగానే వున్నాడు. తమను బాదిబాది కొట్టే వ్యక్తి ఒకడు సఫా అయ్యాడు. ఖాసిం ఒక్కడేకాదు- ఖైదీలలో అందరూ సంతోషించారు. ఏఒక్కరో జాలితల చారు. ఆ జైలుకు సబ్‌జైలర్ నరకాసురుడు లాంటివాడని వారి ఉద్దేశం!

మధ్యాహ్నం ఖైదీలకు పెట్టవలసిన రేషన్ వంట పూర్తయి, వంటగదిలో వుంది. అది పైకితెచ్చి ఖైదీలకు పెట్టేందుకు గార్డు సిద్ధంగా లేడు.

కార్ఖానాకు ఎదురుగానున్న స్త్రీల సెల్ నుండి పద్మ పిడికిలి బిగించి తలుపుమీద గుద్ది వికటంగా నవ్వింది.

మహిళాగార్డు భయంతో గోడకు అతు క్కుంది.

★ ★ ★

ఇరవైముగ్గురూ ఒకేవైపు పోకుండా నదివైపు తలోవైపున పరుగెత్తసాగారు. పొలాలలోని రై తులు తమ పనులు ఆపి ఆశ్చర్యంగా వీరిని చూస్తున్నారు. ఖైదీలు తప్పించుకుని పారిపో వడం ఎప్పుడూ చూడలేదేమో వారికి కొత్తగా వుంది.

పోతాలు, అతడి వెంట నారాయణ, జనా ర్దన్ సలీం, పరుగెత్తుతున్నారు. నదిలో నీళ్ళు లేకున్నా వెడల్పు చాలావుంది. అంతా గరకు గా ఉన్న ఇసుకనేల, ఒకవైపు మాత్రమే కొద్దిగా నీరుపారుతున్నది. గమ్యంలేనిదానిలా అనేక వంపులు తిరిగి సుదూరంగా సాగిపోతున్నది.

ఖైదీలు నదిదాటి అవలి ఒడ్డు చేరేలోపలనే రోడ్ల వెంట పోలీసు జీపుల, వ్యానుల సైరన్లు చెవులు చిల్లులుపడేలా అరుస్తున్నాయి. వీరికి దాదాపు ఫర్లాంగు దూరంలో ఒక రోడ్డు వుంది. ఆ రోడ్డు వెంట సాగివస్తున్న వాహనాలు వీరికి కనిపిస్తున్నాయి. వీరికి రక్షణగా యూకలిప్టస్ చెట్లున్నాయి. పోలీసులు దిగి పొలం మీద నుండి సాగివస్తున్నారు. ఖైదీలు ఎవరికి తోచిన దిక్కున వారు పరుగెత్తుతున్నారు. ఎవరికివారే దొరక్కుండా పారిపోవాలన్న ఆతృత. దొరికితే సున్నంలోకి ఎముకలు మిగలకుండా బాదుతా రన్న భయం! పోలీసులు ఒక వైపు నుండిగాక చుట్టూ వస్తున్నారు. జైలువైపు నుండి కూడా కొందరు గార్డులు రావడం చూశారు ఖైదీలు.

"పూర్తిగా చుట్టుముడుతున్నారు... దొరికిపో తామేమో?" అన్నాడు సలీం భయంభ యంగా.

పోతాలు చివరి సిగరెట్ నోటిలో పెట్టుకొని ఊదాడు. "అన్నింటికీ మనం సిద్ధంగా వుండాలి. లేకపోతే మనం ముందుకు పోలేం"

"కానీ, ఇంత పోలీసు వలయాన్ని ఛే దించడం ఎట్లా?"

పోతాలు జవాబు చెప్పకుండా, ఎదురుగా కనిపిస్తున్న తోటలోపలకు పరిగెత్తాడు. అతడి తోపాటు మిగిలినవారూ పరిగెత్తారు. దాని గుండా ముందుకు సాగడం ఆరంభించారు.

ఎక్కడో టప్‌మన్న చప్పుడు, ఆతర్వాత ప్రాణభయంతో అరచిన కేక వారికి విని పించింది. అంటే పోలీసులు కాల్పులు సాగిస్తు న్నారన్నమాట! అంటే ఖైదీలకు చేరువగా వచ్చారన్నమాట! పోతాలు ఊపిరి పీల్చి వది లాడు భారంగా! ఇంత విశాలమైదానంలో తాము తప్పించుకుపోగలరా? ఈ తోట ఎంతవ రకు తమకు రక్షణ కల్పిస్తుంది? కనీసం పొద్దుగ్రుంకడానికి మరో ఆరుగంటల వ్యవధి వుంది. ఈ ఆరుగంటలూ తాము దాక్కోగలిగి తేనే ఆ తర్వాత ప్రాణంతో తప్పించుకోగలమ




న్న ఆశ వుంటుంది. లేకపోతే కష్టమే!

అందరూ భూమిమీద బోర్లాపడుకున్నారు. పోలీసుల పాదతాడనం వినిపించకున్నా కాల్పులు వినిపిస్తున్నాయి. ఖైదీల అరుపులు వినిపిస్తున్నాయి.

"ఇక్కడే ఉంటే ప్రమాదమేమో?" అన్నాడు జనార్దన్.

"ప్రతిదానికీ తొందరపడకండి. దానివల్ల పరిస్థితులు వ్యతిరేకంగా మారతాయి. శత్రువు మన దగ్గరకు రావడానికి మరికొంత సమయంపడుతుంది. వెంటపడుతున్న పోలీసులు ప్రత్యేకంగా మనకొరకే రావడం లేదు. ఇంకా చాలా మంది ఖైదీల కొరకు వచ్చారు. ఆ ఖైదీలందరూ పూర్తి బయలులో పారిపోతున్నారు. వారిని వేటాడే ప్రయత్నంలో వున్నారు. వారందర్నీ పూర్తిగా పట్టేసిన తర్వాతే లెక్కలో తక్కువ వస్తే మన గురించి ఆలోచిస్తారు. మనకు ఆ కొంచెం ఊపిరిచాలు. పొద్దు గ్రుంకిందంటే వారికి ప్రాణభయం! మనం తెగించి పారిపోతాం!"

నలీం మాట్లాడలేదు. "అనవసరంగా మాట్లాడి శక్తి వృధా చేసుకోకండి. అదీగాక శతృవుకు మనల్ని పట్టించినట్లవుతుంది. ప్రశాంతంగా, మౌనంగా ఉండండి"

ఎవరూ పలుకలేదు. మౌనాన్ని పాటించారు.

గార్డులను వెంటపెట్టుకుని వచ్చిన హెడ్డు పోలీసులను కలుసుకున్నాడు. ఒక సూపరింటెండెంట్ నాయకత్వంలో దాదాపు వంద మంది పోలీసులు సాయుధులై ఆ ప్రాంతంలో తిరుగుతున్నారు. జైల్‌గార్డును చూసి "మొత్తం ఎందరు పారిపోయారు?" అడిగాడు సూపరింటెండెంట్. గార్డులకు పూర్తిగా లెక్కతెలియదు. లెక్కించుకున్న హెడ్డు తడబడుతూ ఉన్నాడు. తన ఉద్యోగానికి ఇక నీళ్ళు వదులుకోవాలని అతడి భయం!

"మొత్తం ఇరవై ముగ్గురు" అన్నాడు హెడ్డు.

"పదిహేనుమంది దొరికిపోయారు" అన్నాడు సూపరింటెండెంట్.

హెడ్డు ముఖం కొడిగట్టిన వత్తిని నలిస్తే ఎలా వెలుగుతుందో అంత ప్రకాశవంతంగా వెలిగింది. అంటే ఇక కేవలం ఎనిమిదిమంది మాత్రమే దొరకలేదు. వాళ్ళు మాత్రం దొరక్క ఎక్కడికి పోతారు? అతడికి ఇంకో అనుమానం వచ్చింది. దొరికినవాళ్ళలో పోతాలు దొరికాడా, లేదా? దొరను అదే అడిగాడు. వారి పేర్లు తనకు తెలియవన్నాడు దొర.

"తోటల్లో దూరండి... ఎనిమిదిమంది కూడా ఎక్కడికీ పోలేదు. ఈ నరుగుడు, యూకలిప్టస్ తోటలు అడ్డంవున్నాయికాని, లేకుంటే ఈపాటికే దొరికిపోకపోయారా?"

హెడ్డు తన మార్బలంతో తోటలలో దూరాడు. దూరాడేగానీ, ఖర్మకాలి పోతాలు ఎదురవుతాడేమోనని భయంగా ఉంది. "వాడు జైలులో అడుగుపెట్టినప్పుడే అనుకొన్నాను వీడు కాలాంతకుడని! కానీ, జైలర్‌గాడు- తనకు పరిచయస్తుడని మర్యాదగా చూసి, మా కొంప ముంచాడు. తప్పుచేసింది జైలర్‌గాడు" అనుకొన్నాడు హెడ్డు. వెతకాల్సిందేదో పోలీసులే వెతుకుతారు. తాము తొందరపడి ఖైదీలకు ఎదురుకాకూడదని గార్డులు ఆలోచిస్తున్నారు. గార్డులమీద ఖైదీలకు మంట. ఎలాగూ దొరికిపోతున్నాం లెమ్మని గార్డుల మెడ దొరకపుచ్చుకుని నలిచినా నలిచేస్తారని వారి భయం!

పొద్దు వాలిపోతున్నది. మొత్తం ఖైదీలు పదిహేడుమంది దొరికారు. మరో ఆరుగురు మాత్రమే దొరకడం లేదు. చీకటిపడితే దొరకడం కష్టమని పోలీస్ సూపరింటెండెంట్‌కు తెలుసు. అలాగని సూర్యుణ్ని ఆపగల శక్తి వారికి లేదు. అక్కడనుంచి టౌనుకు వచ్చి, అన్ని జిల్లాలకీ వైర్‌లెస్‌లో తెలిపాడు. ముఖ్యంగా సరిహద్దు జిల్లాలలో, రైలు స్టేషన్లు, బస్టాండులు కాపలా కాయమని హెచ్చరించాడు. జైలుగార్డులు కూడా చీకటి పడుతుండటంతో వెనుతిరిగారు. వారు జైలుదగ్గరికి వచ్చేసరికి జైళ్ళ ఐ.జి. వచ్చివున్నాడు. అందరిమీదా ఆయన రంకెలు వేస్తున్నాడు. జైలర్ ఆయన ముందు తలవంచుకుని నిలబడ్డాడు. మరికొందరు గార్డులు ఆ ప్రాంతాలలో భయంభయంగా నిలబడ్డారు.

ఇరవైమంది గార్డులు జైలు లోపలకు వెళ్తూనే "ఎందరు దొరికారు?" అన్నాడు ఐ.జి.



హెడ్డు ఒదిగి వున్న పావురంలా ఆయన ముందు నిలిచి, "పదిహేడుమంది దొరికారు సార్!" అన్నాడు.

"ఆ విషయం ఇంతకు ముందే తెలుసోయ్! మిగిలినవాళ్ళ సంగతేమిటి?" గాండ్రించాడు.

"ఇంకా ఆరుగురు దొరకలేదు సాబ్!"

"వాళ్ళు దొరక్కపోతే మిమ్మల్ని లోపల తోయాల్సివుంటుంది. ఇంతకీ అసలు వ్యక్తి దొరికాడా?"

అసలు వ్యక్తి అంటే పోతాలు! అతడు దొరికాడో లేదో వీళ్ళు చూడలేదు. ఖైదీలు దొరికారని పోలీసులు చెప్పారేగానీ, వారి పేర్లేమిటో చెప్పలేదు. పోలీసులకు తెలియదు. తాము వెళ్ళి వారిని చూడనూ లేదు. దొరికాడని చెప్పాలా? దొరకలేదని చెప్పాలా? ఏది చెప్పినా వ్యతిరేకమయితే తమమెడకు తగులుకుంటుంది. తాము చూడలేదని చెప్పాలనుకున్నాడు.

ఆ విషయమే ఆయనకు చెప్పాడు.

ఐ.జి. అటు ఇటుతిరిగి, "వాడిని గుర్తుపట్టగలవా నువ్వు?" అన్నాడు.

తలవూపాడు హెడ్డు.

"వెంటనే జీప్‌లో పోలీసుఠాణాకు వెళ్ళు"

హెడ్డు కిందికి పరుగెత్తాడు. మరో పదినిముషాల్లో తలవేలాడేసుకొని వచ్చాడు. "వాడు దొరకలేదు సాబ్!" అన్నాడు దిగాలుగా.

"వాడెందుకు దొరుకుతాడు? తేరగా తిని పడుకునే గార్డులున్నారని ఖైదీలు అర్థంచేసుకుంటే, ఒక్కడూ ఇక్కడ ఉండటానికి ఇష్టపడడు"

'వాగనీవాగి వాడే ఊరుకుంటాడు' అనుకున్నాడు హెడ్డు. ఈ పెద్ద ఆఫీసర్లతో ఇదే చిక్కు! ఎప్పుడూ తప్పు ఎదుటివాళ్లమీదనే రుద్దుతారు.

"జైలర్! పోలీసులవెంట వెళ్ళు! వాడిని ఎట్టి పరిస్థితిలోనూ దొరికించుకోవాలి. వాడు పారిపోయి, అందరూ దొరికినా లాభంలేదు. వాణ్ని గుర్తించాలంటే నీకే సాధ్యం! పాతికమంది గార్డుల్ని తీసుకెళ్ళు"

జైలర్ పిస్తోలును సరిచేసుకున్నాడు. గార్డులను తన వెంట కదలమని ఆదేశించాడు. గార్డులకు ప్రాణం పైనేపోతున్నది. నిన్న తిన్న అన్నమే! ఉదయం అన్నం తిందామని వంటరూంలోనికి వెళ్తూనే హెచ్చరిక గంటకొట్టారు. ఆ పరుగెత్తడం పరుగెత్తడం ఇంతవరకూ ఆపలేదు. చెట్లు, పుట్టలూతిరిగి తిరిగి విసుగుపుట్టింది. నదిలో ఒకసారి తాగిన మంచి నీళ్ళే వారికిగతి! ఇంతవరకూ వాళ్ళకు తిండి లేదు. మళ్ళీ ఇప్పుడు బయలుదేరమంటే తిండికావాలని వాళ్ళు అడగలేకపోతున్నారు. అడిగితే మళ్ళీ అక్షింతలు! అలాగని తిండిలేకుండా వెళ్ళేఓపిక వారిలో లేదు.

మెట్లవెంట కిందకుదిగి, వ్యానువద్దకు వచ్చారు.

"సాబ్! క్వార్టర్స్‌దగ్గిరేకదా... నాలుగుమెతుకులు గతికివద్దాం!" అన్నాడు ఒక గార్డు హెడ్డు చెవిలో.

హెడ్డు 'థూ' అంటూ ఊశాడు. "ఈ సమయంలో ఆమాట అంటే నా తలకాయపోతుంది. కావాలంటే దొరను నువ్వే అడుగు" అన్నాడు.

నిజానికి హెడ్డుకుకూడా బాగా ఆకలవుతున్నది. కానీ అడిగే ధైర్యం ఇప్పుడులేదు. ఎవరూ జైలర్‌ను అడగలేకపోయారు.

జైలర్‌కు తిండిమీదకంటే పోతాలుగురించిన ఆలోచనే ఎక్కువగా ఉంది. అతడిమీద ఇంకా సానుభూతి ఉంది. దొరికితే పోతాలును నిలువునా కాల్చిపారేస్తారని అతడికి తెలుసు.

పోలీసు సూపరింటెంట్ ఆఫీసుకువచ్చి ఖైదీలను చూశాడు. అందులో తనకు తెలిసినవాళ్ళు ఉన్నా ప్రధానవ్యక్తులు నలుగురూలేరు. వారు దొరక్కుండా తప్పించుకున్నారు. సూపరింటెంట్‌ను కలిశాడు.

"ఈ సమయంలో ఆ తోటల్లో ఎక్కడ వెతుకుతాం? సెర్చ్‌లైట్లకాంతి ఒక చెట్టుమీదపడితే మరో చెట్టుమీద పడదు. అయినా ఇంకా అక్కడే వుంటారా? ఎటోపారిపోయి వుంటారు" అన్నాడు సూపరింటెంట్.

"ఎంతదూరం పోగలరుసార్! వారి ఒంటి






మీద ఖైదీదుస్తులున్నాయి. ఎక్కడికి వెళ్ళినా అవి వారిని పట్టిస్తాయి'' అన్నాడు జైలర్.

''నిజమేనయ్యా! ఈ రాత్రిపూట ఎక్కడో దాక్కుంటారు. తమని పట్టుకొమ్మని బహిరంగంగా తిరగరుకదా! మనం ఎక్కడని ఏం శోధిస్తాం? ఆరుగురు ఖైదీలు ఇన్ని వేల చదరపుకిలోమీటర్లలో ఎక్కడుంటారు?''

అది నిజమని జైలర్‌కూ తెలుసు. అతడు ఒకటే భావిస్తున్నాడు. తప్పించుకున్న పోతాలు దొరకడంవల్ల ప్రాణనష్టమేగానీ, లాభంలేదు. అతడు దొరికితే తనకువచ్చే లాభమేమీలేదు. ఎలాగూ, కొంతకాలం సస్పెన్షన్ తప్పదు. కాబట్టి కనీసం అతడు ఒక్కడూ తప్పించుకుపోనీ అనుకున్నాడు. గార్డులు ఇవన్నీ ఆలోచించటంలేదు. ఈ రాత్రి ఆ తోటల్లోకి వెళ్ళివెతకమని ఆజ్ఞాపించకుంటే చాలనుకున్నారు.

★ ★ ★

''పొద్దువాలిపోతోంది'' అన్నాడు సలీం గుసగుసగా.

పోతాలు తలవూపాడు. ఔను... పొద్దువాలిపోయింది. అంటే మరో పన్నెండు గంటలు తమ ప్రాణాలకు భయంలేదు. పోలీసులు తమను ఏమీచేయలేరు. అలాగని ఆ తోటలో అలాగేపడివుండటంవల్ల లాభమేమిటి? తిరిగి తెల్లారితే మరింత ఎక్కువ సిబ్బందితో వస్తారు. రాత్రికి రాత్రి తప్పించుకోగల గాలి. ఈ రాత్రి తప్పించుకోలేకుంటే, ఇక తమకు సాధ్యంకాదు.

పోలీసుల సవ్వడి వినిపించటంలేదు. అలాగని వాళ్ళు తోటచుట్టూ కాపువేసి ఉంటా రన్న అనుమానమూలేదు. వాళ్ళువెళ్ళిపోయి వుండవచ్చు. లేచి మట్టిదులుపుకుని నిలబడ్డా డు. మిగిలినవాళ్ళుకూడా లేచారు. రోడ్డుమీద వాహనాల శబ్దం వినిపిస్తున్నది.

చెట్లు శబ్దంచేయకుండా చిన్నగా తప్పించు కొంటూ బయటపడ్డారు. ఎక్కడా మనుషుల అలికిడిలేదు. దూరంగా వున్న నది మసకగా కనిపిస్తున్నది.

"ఈ ఖైదీదుస్తులతో మనం ఎవరికంటప డినా ప్రమాదమే"

సలీం మాటలకు ఛీత్కరించాడు నారా యణ. "ఒరేయ్! నీకు ఎప్పుడూ ప్రమాదంగు రించే ఆలోచనరా! మరో ఆలోచనలేనట్లుంది. ఎలాగూ మనం ప్రమాదంలో ఉన్నాం. దాన్ని గురించి ఎందుకు ఆలోచించడం? చేతనైతే తప్పించుకోవడం గురించి ఆలోచించు."

"అరవకండి" అన్నాడు పోతాలు చిన్నగా. "ఎవరూ మాట్లాడవద్దు. ఒకరిని విడిచి ఒకరు దూరంకావద్దు. మనం చీలిపోతే మళ్ళీ కలుసు కోవడం అసంభవం!"

నిశ్శబ్దంగా అతడిని అనుసరించారు. నది లోనికివచ్చి తృప్తిగా నీళ్ళు తాగారు.పోతాలు జేబులో చెయ్యిపెట్టి తడిమితే ఖాళీ సిగరెట్ పెట్టి దొరికింది. దాన్ని విసిరేశాడు.

"మనం పారిపోయి వచ్చేటప్పుడు జైలుకు వెనుక బండ్లబాట ఒకటి వుందిచూశారా! ఆ బండ్లబాట దగ్గర్లోని ఒక పల్లెకుపోతుందని మనమిత్రుడు జైలులో చెప్పాడు. దాన్ని అను సరిద్దాం! రోడ్లవెంట నడవడం ప్రమాదం! పల్లెలమీదుగానే తప్పించుకోవాలి. మనం తొడుక్కున్నదుస్తులు ఖైదీలు వేసుకునేవని పల్లెవాళ్ళకు తెలియకపోవచ్చు. ఇలాంటి దు స్తులు పట్టణాలలో హొటళ్ళలో, బార్‌లలోకూ డా వేసుకుంటారు. అందువల్ల పల్లెప్రాంతాలే మనకు హానిలేనివి" అన్నాడు పోతాలు.

అందరూ మవునంగా తలలువూపారు. నదివెంటనే ముందుకు సాగారు. వారి కాళ్ల కింద ఇసుకచేస్తున్న శబ్దంతప్ప మరింకేమీ వినిపించడంలేదు. అప్పుడప్పుడూ కీచురా ళ్ళు అరుస్తున్నాయి. గట్టుమీదున్న చెట్లమీద పక్షులు అరుస్తున్నాయి. దాదాపు రెండుఫ ర్లాంగుల దూరంలోని జైలులైట్లవెలుతురు కని పిస్తున్నది. ఆలైట్ల వెలుతురు నదిమీదకూడా పడుతున్నది. తమను ఎవరయినాచూస్తే సుల భంగా దొరికిపోగలరు. కానీ ఆసమయంలో ఎవరైనా అక్కడకురావడం అసంభవమనే వారిభావన. దాదాపు అర్థమైలు దూరంవెళ్ళేస రికి, నదిలో అటు-ఇటు బండి బాటకని పించింది. జైలువైపు వెళ్ళేమార్గం విడిచి, ఎదురుమార్గంవైపు నడక సాగించారు.

దాదాపు ఏడుగంటలు కావస్తున్నది. డొంక దారి! అటు ఇటు చెట్లు విపరీతంగాఉన్నాయి. చలి జివ్వున వీస్తున్నది. పక్షులు గూళ్లలో నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నట్లున్నాయి. ఎవ రయినా జనం ఎదురుగా వస్తారేమోనని ఒకవ క్క భయంగావుందివారికి. తప్పుకునే మార్గంవారికి తెలియదు.

అనుకున్నట్లే జనం అలికిడిఅయింది. ఇద్ద రు మాట్లాడుకుంటూ ఎదురుగా వస్తున్నారు. నలుగురూ తటాలున చెట్లచాటుకు తప్పుకు న్నారు. ఎదురుగావస్తున్న వ్యక్తులు సినిమాగు రించి మాట్లాడుకుంటూ వేగంగా వెళ్ళారు. వాళ్ళు రెండోసినిమాకు పోవడానికి వెళ్లడమనే చర్చలో ఉన్నారేగానీ, ఇతర విషయాలమీద వారికి ధ్యాసలేదు. వారిమాటల్నిబట్టి చాలాద గ్గరగా గ్రామం ఉన్నట్లు అర్థమయింది. అదు రుతున్న గుండెలు తిరిగి సర్దుకున్నాయి. దారి కివచ్చి నిలబడ్డారు. పోతాలువారివైపు చూశా డు. అందరివీ తెల్లగుడ్డలు.

"సలీం! మనం ఈగుడ్డలతో పోవడం ఎలా గయినా ప్రమాదమే. వీటిని వదిలించుకోవా ల్సి ఉంటుంది" అన్నాడు పోతాలు.

"ఎలా?"

"ఎలాగైనాసరే... తప్పదు"

సలీం తలఊపడం చీకటిలో కనిపించలే దు.

"మనం తప్పించుకుపోతున్న ఖైదీలం. జై లు చిత్రహింసలకూ, అవమానాలకూ తట్టుకో లేక, అడ్డుగావున్న ఒక్కడికయినా నూకలులే కుండా చేయడానికి ప్రయత్నించి మనంపారి





పోతున్నాం. మనకూ ప్రాణాలమీద ఆశవుంది. కనుక రక్షించుకోవాల్సిందే. మన ప్రాణరక్షణకు ఎదుటివాడి ప్రాణంతీయవలసివస్తే ఈ సమయంలో, న్యాయాన్యాయాలు ఆలోచించవద్దు''

ఏదో చేయమంటున్నాడని వారికితెలును. కానీ అర్థం కావడంలేదు. గ్రామందగ్గరగా వచ్చారు. గ్రామంలోని లైట్లు కనిపిస్తున్నాయి. జనం అలికిడి, గొడ్లఅరుపులు, మేకల అరుపులు వినిపిస్తున్నాయి. ఊరిలోనికి వెళ్లడం ప్రమాదకరమని ఆలోచించి దూరంగా కూర్చున్నారు. ఈ గ్రామందాటేలోగా గుడ్డలు మార్చుకోవాలి. అవసరమయితే దొంగతనంచేసి అయినాసరే అనుకున్నాడు పోతాలు.

ఎవరో బయలుకువస్తున్నట్లుంది. నిశ్శబ్దంగా దారికి ఒకవక్క చెట్టుకింద కూర్చున్నారు. వచ్చిన వ్యక్తి ఒకరుకాదు, ముగ్గురు. వాళ్ళు ఆడవాళ్ళు. చెంబులు కిందపెట్టుకుని కూర్చున్నారు. ఏవో మాట్లాడుకుంటున్నారు. వారివిషయంలో ఖైదీల ప్రస్తావన వచ్చింది. ఖైదీలు పదిహేడుమంది దొరికారని అనుకుంటున్నారు.

''ఏమోనమ్మా ఈ దొంగముండాకొడుకులు- మనవూరు దగ్గిరగావుంది. వచ్చిపడినా పడవచ్చు మిగిలినవాళ్ళు'' అంది ఒకామె.

''నిజమేనే! తొందరగాకానీ.'' మరొకామెభయంగా అంది. గబగబా పనిముగించుకుని వాళ్ళు వెళ్ళిపోయారు. అతిదగ్గరలో ఉన్నవారికి మాటలు వినిపిస్తున్నాయి. వాళ్ళు నవ్వుకున్నారు. తాముఏమయినా చేయదలిస్తే చాలా సులభం. వాళ్ళు వెళ్ళిపోయేవారేకాదు. కానీ తమకు ఆ ఉద్దేశంలేదు. తాము దొంగలుకాదు. దొరలుగా బతకడానికే ప్రయత్నిస్తున్నారు. అటువంటప్పుడు వారిమెడలోగొలుసులకు ఆశించి, వారిమీద తాముదాడిచేయబోరు. కాని వారికి ఆవిషయాలు ఏమీతెలియవు. ఖైదీలంటే దొంగలేననీ, దొంగతనంచేస్తారనీ వారి భయం.

గ్రామం సద్దుమణుగుతున్నది. తొలిఆట సినిమా చూసిన జనం ఆగ్రామానికి వచ్చారు. చిమ్మచీకటి భయంకొల్పించేలావుంది. ఆ స్థానం విడిచివచ్చారు దారిలోకి. ఊరిముందుకువచ్చారు. దారికి ఒక పక్కగా ఒక డాబా వుంది. అది గ్రామానికి కొంతదూరంలోవుంది. అక్కడ జనం ఉన్నారోలేదో తెలియదు. ఏమైనాసరే వారినిలేపి గుడ్డలుతీసుకోవాలి. ఖర్చులకు తగినంత డబ్బులు తీసుకోవాలి. లేకుంటే ముందుకుసాగడం కష్టం.

ఇంటిముందుకువచ్చారు. చలికాలం కావడంవల్ల తలుపులు బిగించి అందరూ లోపల పడుకున్నారు. తలుపుతట్టాడు పోతాలు. మిగిలినవాళ్ళు ఏమవుతుందోనని ఊపిరిబిగబట్టారు. తలుపుదగ్గరకు మనిషివస్తున్నశబ్దం, గడియతీస్తున్నశబ్దం విన్పించింది. ఆవెంటనే తలుపులు తెరుచుకున్నాయి. తలుపుతీసిన మనిషి ఆశ్చర్యంగా వీరినే చూస్తున్నాడు. అవి ఖైదీగుడ్డలని అతనికితెలును. వారుపారిపోయి వచ్చిన ఖైదీలని అర్థంచేసుకున్నాడు. పోతాలు చిరునవ్వునవ్వాడు.

''మీరుభయవడకండి. మేముదొంగతనం చేసేవాళ్లంకాదు. మీనహాకారంకొరకు వచ్చాము'' అంటూ లోపలకు తోసుకువచ్చారు. నారాయణ తలుపువేశాడు. అవ్యక్తి భయంభయంగా చూస్తూ మాట్లాడలేకపోతున్నాడు.

''మేం పారిపోతున్నట్లు, ఈపాటికే అందరికీ తెలిసివుంటుంది. మాగుడ్డలు మీరుగుర్తుపట్టారనడానికి మీఆశ్చర్యంచాలు. మేమిప్పుడు ఈదుస్తులలో పారిపోలేకున్నాం. సాధారణ దుస్తులు కావాలి. మీరు అవిఇవ్వాలి నలుగురికీ''

''ఎలా?'' అన్నాడు అవ్యక్తి. ''ఇదిసంసారంచేసే ఇల్లుకాదు. పశువుల ఇల్లు. మాఇల్లు ఊరిలోవుంది. అక్కడికి వెళ్ళితేవలసివుంటుంది.''

నలుగురూ ముఖాలు చూసుకున్నారు. పెనరపాట్టులోతంతే మినవపాట్టులో పడినట్లయింది కథ. అతడిని ఇంటికి వంపడమా? వెళ్ళి అందర్నీలేపుకువస్తే తాముదొరికిపోతారు. జైలుకు అప్పగిస్తారు. ఇంటికి పంపించకుండా తాముచెళ్ళిపోతే? అలాగయినా అతడుకొంతసేపు తర్వాత గ్రామంలోకివెళ్ళి వివరాలు చెబుతాడు. గ్రామస్థులు చుట్టుముడతారు. పోలీసులకి తెలియచేస్తారు. ఎలాగూ నుడిగుండంలోనే ఉన్నాం. ఈదడమే మంచిదను

కుని "మీరుమాకు సహాయంచేయదలుచుకుంటే వెళ్ళిరండి. చేయలేకుంటే చెప్పండి, మాదారినమేం వెళ్ళిపోతాం" అన్నాడు పోతాలు.

అవ్యక్తి ఒకనిముషంసేపు ఆలోచించాడు. తర్వాత "సరే... మీరిక్కడే ఉండండి వస్తాను" అంటూ బయటకువెళ్ళిపోయాడు.

అతడువెళ్ళిన తర్వాత "వీడుమనల్ని పట్టిస్తాడేమో?" అన్నాడు సలీం.

"కానివ్... మనుషులని నమ్మకపోతే ఎట్లా? ఎలాగూ ఇరుక్కున్నాం కదా" అన్నాడు నారాయణ.

పోతాలు బయటికి నడిచాడు. "ఎందుకయినా మంచిది. అదిగో కనిపించే చెట్టు దగ్గర నిలబడదాం. ఒక్కడే వస్తాడో, జనం వస్తారో చూద్దాం. జనం ఎక్కువమంది వస్తే వెనక్కు పారిపోదాం"

పోతాలు సలహా వారికి నచ్చింది. అందరూ చెట్టు కిందకు వచ్చారు. ఎదురుగా తెరచిన ఇల్లు కనిపిస్తున్నది. దాదాపు అర్ధగంట తర్వాత ఆ వ్యక్తి గుడ్డల మూటతో అక్కడికి వచ్చాడు. ఖైదీలు నలుగురూ సంతోషించారు, ఆ వ్యక్తి తమకు మేలు చేస్తున్నందుకు. ఐదునిమిషాల తర్వాత ఆ యింటి వద్దకి పోవడానికి ముందుకు కదిలాడు పోతాలు. సలీం వెంటనే వెనుకకు లాగాడు. పోతాలు వెనుతిరిగి చూస్తూనే, సలీం వేలుపెట్టి చూపించాడు. "అరుగో... లైటు క్రీనీడ వెల్తురులో ఇద్దరు కనిపిస్తున్నారు. దీన్ని బట్టిచూస్తే ఏదో మోసంగా వుంది" అన్నాడు.

మిగిలినవారు తీక్షణంగా చూశారు. నిజమే... ఇద్దరు కాదు, చాలామందే ఉన్నట్లున్నారు, అంటే గుడ్డలు ఇచ్చినట్లు తమను నమ్మించి లోపలనే వుంచి వీళ్ళందరూ దాడి చేసి పట్టుకోడానికి ప్రయత్నం చేస్తున్నారని వీళ్ళు ఆలోచించారు. మంచి ప్లాన్ వేశారు. ఏమాత్రం తెలివితక్కువగా ప్రవర్తించినా తాము చిక్కుకోవలసివచ్చేదే. నలుగురూ ఇక ఏమాత్రం తాత్సారంచేయకుండా పరుగు లంకించుకున్నారు. వాళ్ళు అందరూఏకమైనా వెంటపడలేరు. ఒకరికొకరు సలహా లిచ్చుకుంటారు. ఆలోగా తాము దాటిపోవచ్చు.

"చూడు పోతాలూ... నమ్మితే ఎలా చేస్తారో?"

"మానవనైజం అంతేమరి. మనం దొంగలం కాదని వారు తెలుసుకోలేరు. ఒకవేళ మనల్ని పట్టించినా, తర్వాత తెలుసుకుని బాధపడతారు. కానీ... ఆలోగా మనం నాశనమవుతాము"

"ఇప్పుడేం చేద్దాం?"

"ఈ ఊరు టౌనుకు దగ్గర్లోనే వుంది. రెండో సినిమా విడిచిన తర్వాతయినా కొందరు రాకుండా ఉండరు. ఇక తోవలో బందిపోటుచర్య తప్పదు. మన ప్రాణం కంటే ఏదీ ముఖ్యం కాదు"

వారు అనుకున్నట్టే ముగ్గురు ఎదురొచ్చారు. ముగ్గుర్నీ నిలిపి దాక్షిణ్యంలేకుండా గుడ్డలు విప్పమన్నారు. వారి గుడ్డలు తాము వేసుకుని, తమ గుడ్డలు వారికి తొడిగారు.

"అచ్చం మీరు ఖైదీలలాగా ఉన్నారు. తెల్లారేలోగా మీరు ఇటువెళ్ళినా అటువెళ్ళినా, పోలీసులకు దొరుకుతారు" అంటూ వెనుతిరిగారు, వాళ్ళు భయంతో అక్కడే కూలబడ్డారు.

మరొకరికి గుడ్డలు తక్కువయ్యాయి. ఆర్థిక సమస్య కూడా ఒకటి. అది పూర్తయితే గానీ, తాము పారిపోలేరు. ఈ రాత్రికి నడక సాగించాలి. నలుగురిలో ఒక వ్యక్తి గుడ్డలు పెద్ద గుర్తింపుకి రావు రాత్రి గనుక. ఉదయం చూద్దామనుకుని వేగంగా ప్రయాణంసాగించారు. అదేఊరిమీదుగా పక్కగా తిరిగి ఊరుదాటిన తరువాత తోవలో, కలిసి ముందుకు సాగారు. రాత్రంతా నడుస్తూనే ఉన్నారు. ఆహారం లేకపోయినా, తాగడానికి నీరు లేకపోయినా కాళ్ళు నొప్పులు తీస్తున్నా సరే, నడకమాత్రం ఆపడంలేదు. పట్నానికి ఎంతదూరం పారిపోతే అంత ధైర్యం వస్తుంది. ఉదయం పోలీసుల కంటపడకుండా ఉండాలంటే చాలాదూరం వెళ్లక తప్పదు.

తెల్లారేసరికి దాదాపు ముప్పై మైళ్ళకు పైగా నడిచారు. దారిలో అనేకపల్లెలు దాటారు. తెల్లారిన తర్వాత దారిలో చెరువు కనిపిస్తే అక్కడ కడుపునిండా నీరు తాగి, కట్టవెంట




ఉషాకిరణ్ మూవీస్

# పూజకు పనికిరాని పువ్వు

నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
ఎ. మోహనగాంధి

UA




కథ-మాటలు: కాశీ విశ్వనాథ్ సంగీతం: చక్రవర్తి కెమెరా: డి. ప్రసాద్‌బాబు

కూర్పు: గౌతంరాజు. కళ: భాస్కరరాజు నృత్యం: శేషు నిర్వహణ: అట్లూరి రామారావు

వున్న చెట్ల కింద కూలబడ్డారు. ఒకరితో ఒకరు మాట్లాడే ఓపికలో లేరు. నిద్ర వస్తున్నది. దగ్గరలో ఒక మైలుదూరంలో పల్లె కనిపిస్తు న్నది. తిండి లేకపోవడంతో ప్రేవులు అరుస్తు న్నాయి.

నారాయణ చుట్టూ చూసి ఈలవేశాడు. ముగ్గురూ చివ్వున తలెత్తి చూశారు. రోడ్డువెంట ఒక గుడ్డలసైకిల్ వస్తున్నది.

"పోతాలూ, పాపపుణ్యాలు చెరువులో పడే సెయ్. వీడిని కొడితేనే మనకు డబ్బులూ వస్తాయి, తక్కువయిన ఒకడికి గుడ్డలూ దొరు కుతాయి"

అందరూ అందుకు ఒప్పుకున్నారు. వారికి అంతకు మించి గతిలేదు. సైకిల్ దగ్గరగా వస్తూనే నలుగురూ గభాలున ఎదురెళ్ళి సై కిల్ నిలిపి, మనిషిని పట్టుకున్నారు. ఆ మనిషి వణుకుతూ చేతులెత్తి దండంపెట్టా డు. వారికి అవన్నీ కనిపించడంలేదు. జేబు లు వెతికి డబ్బులు బయటికి లాగారు. అతడి గుడ్డలు విప్పించి, వాడికి తమగుడ్డలు తొడిగా రు. కాళ్ళు చేతులు కట్టి, కట్టమీద పడవేశారు. సైకిల్తీసుకుని గుడ్డలు అక్కడే పడేశారు. అతడి దగ్గర నాలుగొందల రూపాయలు దొరి కాయి.

"సైకిల్ మీద పారిపోదాం" అన్నాడు జనా ర్ధన్.

"ఇది నలుగుర్ని మోయగలదా?"

"చూద్దాం" అన్నాడు నలీం. నలుగురూ ఎక్కి కొంత దూరం వెళ్ళేసరికి బ్యాకుసీటు మడ్గార్డ్మీద ఆనింది. టైరు కదలడంలేదు. దాన్ని అక్కడే పడవేసి పల్లెలోకి వచ్చారు. దారి పక్కనున్న హెూటల్కు నలీంను పంపి, పదార్థా లు తెమ్మన్నాడు పోతాలు. అందరూ కలిసి వెళ్ళితే రేపు ఆచూకీ దొరుకుతుంది.

నలీం వెళ్ళి పార్శిళ్ళు పదార్థాలు తెచ్చాడు. ఆ పొట్లాలు తీసుకుని ముందుకుసాగారు. మరికొంతదూరం వెళ్ళి ఒక చెరువు దగ్గర కూర్చుని సుష్టుగా తిన్నారు. నిద్రవస్తున్నది. అయినా పడుకోవడానికి అవకాశంలేదు. అతి దగ్గర్లోనే ఒకణ్ణి తన్ని డబ్బు, గుడ్డలు లాక్కు న్నారు. ఎవరో ఒకరు చూసి వాణ్ణి విడిపిస్తారు. ఇక్కడతాము కనిపిస్తే పట్టుకుంటారు. అందు వల్ల సాధ్యమైనంత దూరం పోకతప్పదు.

మరో మైలుదూరం వెళ్ళేసరికి ఇక నడవలే నన్నాడు జనార్ధన్. మిగిలిన వాళ్ళ పరిస్థితీ అంతే. పోతాలు ఏమంటాడోనని వారు నోరు విప్పలేకపోయారు. పోతాలూ అంతే. తానే ముందుగా నడువలేనంటే వాళ్ళు అసలేనడ వలేరని అతని భయం. అందువల్ల నడక సాగించాడు. ఇప్పుడు ఒకరు సాధ్యంకాదనేసరి కి మిగిలిన వారూ చతికిలపడ్డారు. తోవకు సమీపంలో సరుగుడుతోట ఒకటి వుంది.

అది చూసి "అక్కడ పడుకుందాం పదండి, దారి పక్కనయితే దొరికిపోతాం, ఆ చెట్ల దగ్గరకు ఎవరూ రారు. నిద్ర నుంచి లేచిన తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు పోతా లు.

ఒకరి వెంట ఒకరు కదిలారు. చెట్ల మధ్యలో చేరి భూమి చదునుచేసుకుని పడకలు వేశా రు. రాత్రంతా నిద్రలేకపోవడంతో వారి కళ్ళు మూతలుపడుతున్నాయి. ఆవులించి నిద్రకు పక్రమించారు.

పోతాలుకు అలసటగా ఉంది .కానీ, నిద్ర రావడంలేదు.

నలీం కళ్ళుతెరిచి చూసి "పడుకో పోతా లూ" అన్నాడు.

"నిద్ర రావడంలేదు"

"ఎవరికి వస్తున్నది? కాకపోతే నడిచిన అలసట పోగొట్టుకోవడానికి" అన్నాడు నలీం. తిరిగి "ఈపాటికి మన ఊరికి తెలి సివుంటుంది. అక్కడ మన కొరకు కాపుకాస్తా రు. మనం ఎక్కడికి వెళ్ళాలి?" అన్నాడు.

పోతాలు నెమ్మదిగా అన్నాడు. "విశాలవి శ్వం చాలావుంది నలీం! నీతిగా బతకడానికి మార్గాలు చాలా వున్నాయి. అయినా రిక్షా డ్రైవర్లకు పనిలేని ప్రాంతం ఉందా? రిక్షా చేతికి తీసుకుంటే నలుగురికి కూడు సంపాది స్తాం"

నలీం తల వూపాడు. ఆ తర్వాత నిద్రలోకి జారుకున్నాడు. పోతాలు వారిని చూస్తూ కూర్చున్నాడు. ఎప్పుడో మగతగా నిద్ర పట్టింది.




మెలకువ వచ్చేసరికి సాయంత్రం దాదాపు మూడుగంటలు అయివుంటుందనుకున్నాడు. మిగిలినవారిని లేపాడు. అందరూ నిద్రమత్తుతో ఉలిక్కిపడిలేచారు. చుట్టూచూసి తాము ఉన్న పరిస్థితి తెలుసుకున్నారు.

"ఇక వెళ్దాం పదండి. మరీ చీకటిపడేదాకా వుంటే తిండి సమస్య ఏర్పడుతుంది. ఏదో ఒక ఊరుచేరుకుని తిండితిని, రాత్రి ప్రయాణం సాగించాలి!!

పోతాలు మాటతో అందరూ లేచి తోటబయటకు వచ్చారు. జనం ఎవ్వరూ కనిపించలేదు. నలభై గజాలదూరంలో ఉన్న తోవలోనికివచ్చి తమ ఆకారాలు చూసుకున్నారు. గుడ్డల్ని గురించి బాధలేదు. ఎవరికీ తాము ఫలానా అని తెలీదు. కాకపోతే ముఖాలు పీక్కుపోయివున్నాయి. ఆహారం లేకపోవడం, నడిచిరావడం, భయసందేహాలతో కాలంగడపడం.... పెరిగిన గడ్డాలు....

నడక సాగించారు నలుగురూ.

సలీం సందేహంగా అడిగాడు. "నలుగురు కలసి దారులు కొడుతున్నారన్న విషయం ఈపాటికే చాలామందికి తెలిసి ఉంటుంది. నలుగురం కలిసివెళ్తే అనుమానిస్తారేమో?"

పోతాలు కూడా అవునని తల ఊపాడు. "సరే... నారాయణా, నువ్వూ ముందు వెళ్లండి. నేనూ, జనార్దన్ కలిసి వస్తాం. ఎవరు ముందుచేరినా బస్ సెంటర్‌లో కలుద్దాం"

సలీం తల ఊపాడు. నారాయణ, సలీం ముందుకు సాగారు. వారు వెళ్ళిన అర్ధగంట తర్వాత ఇద్దరూ కదిలారు.

"ఇలా చీలిపోతే ఎవరితోవ వారిదవుతుందేమో? తర్వాత కలుసుకుంటామన్న నమ్మకంలేదుకదా?" అన్నాడు జనార్దన్.

"చేసేదేమీలేదు. ఎవరిబతుకు వారు బతకడమే మార్గం! కలిసివుంటే అన్నీ సమస్యలే వస్తున్నాయి" అన్నాడు పోతాలు.

ఇద్దరూ దాదాపు పొద్దుగుంకేసరికి పదిమైళ్ళు నడిచారు. పొద్దుగుంకే సమయానికి ఒక పల్లె చేరారు. దారిపక్కే వున్న హొటల్‌కి వెళ్ళారు. అక్కడ నిన్న ఈరోజు జరిగిన సంఘటనలు వర్ణించి కొందరు చెప్పుకుంటున్నారు. వారి మాటలు వింటూ పకోడి తింటూ కూర్చున్నారు.

వీరిద్దరినీ చూసిన గ్రామస్తులు "ఏ వూరు మీది?" అని అడిగారు అనుమానంతోనే.

"ఎల్లారెడ్డి!"

"అయితే ఇంతదూరం ఎందుకు వచ్చారు?" పెరిగిన వారి జుట్టు చూస్తున్నారు.

"మేము సవరాలు కట్టేయానాదులం! వెంట్రుకల తుక్కు కొరకు వచ్చాం"

అయినా గ్రామస్తుల అనుమానం తీరలేదు. "ఇంతకుముందే ఇద్దరు ఈ దారంటవెళ్లారు. వాళ్ళు వరిగడ్డి కొనడానికి వచ్చామన్నారు. వారినీ మిమ్మల్నీ కలిపితే, దొంగతనాలు చేసినవాళ్ళు మీరులాగానేవుందే?"

గ్రామస్తుల మాటలకు జనార్దన్ బెదిరాడు.

పోతాలు బింకంగా వారి వైపు చూస్తూ- "దోపిడీలు చేయవలసిన ఖర్మమాకెందుకు? రోజుకు పది సవరాలు కట్టుకుంటే పది పదులు వందరూపాయలొస్తాయ్! రోడ్ల వెంట టీనీళ్ళు తాగుతూ పోచుకోలు కబుర్లు చెప్పుకునే వాళ్ళే అలాంటివి చేస్తారుగాని, కష్టం చేసుకునేవాళ్ళకు ఏం ఖర్మపట్టింది?"

అతడి మాటలకు అక్కడున్నవారి ముఖాలు కందగడ్డల్లా తయారయ్యాయి. తర్వాత ఎవరూ మాట్లాడలేదు. ఇద్దరూ లేచి దారిపట్టారు. రాత్రి పన్నెండుగంటలదాకా ఎక్కడా ఆగకుండా ప్రయాణం కొనసాగించారు. దూరాన ఏదో పెద్ద గ్రామంలా విద్యుత్ లైట్లు వెలుగుతూ కనిపిస్తున్నాయి. బహుశా అది కామారెడ్డి అయివుండవచ్చని వాళ్ళు అనుకున్నారు.

"జనార్దన్! పట్నం దగ్గరకు వస్తున్నాము. ఇక్కడినుండి జారుకోగలిగితే మనం హైదరాబాదుకు వెళ్ళగలం! అటు తర్వాత బతుకుమార్గం పెద్ద సమస్యకాదు. ఉన్న సమస్య ఇక్కడే!" అన్నాడు పోతాలు.

జనార్దన్ పట్నాన్ని దూరంగానుండే చూసి సంతోషించాడు. ఈ రెండు రోజుల నడక అతడికి తృణప్రాయంగా తోచింది. టౌనుచేరి ఏ బస్సో, లారీయో, రైలో ఎక్కితే ఆ ప్రాంతం దాటుకోవచ్చు. కాలినడకన ఎంతదూరం వెళ్ళ

గలరు?

మరోగంట సేపట్లో ఫ్యాక్టరీల ప్రాంతం చేరు కోగలిగారు. ఆ ప్రాంతం కొత్తకావడంవల్ల అయోమయంగా ఉంది జనార్దన్‌కు. బస్టాండు దారి తెలుసుకుని నడకసాగించారు.

మధ్యన బార్బర్‌షాపు చూసి ఆగాడు పోతాలు. "ఇలాపోతే దొరికిపోతాం! ముందు గడ్డం చేయించుకుని, తలదువ్వుకుందాం రా!"

ఇద్దరూ షాపులోపలకు వెళ్ళారు. షాపు బస్టాండుకు దగ్గరగా ఉండటం వల్ల రాత్రి ప్రయాణీకులకొరకు ఆషాపు రాత్రిపూటకూడా ఉంటుంది. ఇద్దరూ గడ్డాలు చేయించుకుని, తలకు నూనె రాయించుకున్నారు. తల దువ్వుకుంటూ అద్దంలో చూసుకున్నాడు పోతాలు. తనను గుర్తుపట్టడం సాధ్యంకాదని అనుకున్నాడు. జైలులో కంటే చాలా మారిపోయాడు. మాసినగడ్డం, ఖైదీగుడ్డల మధ్యవున్న శరీరానికీ, తెల్లటి గుడ్డలూ, గడ్డం చేసుకున్న ఈ శరీరానికీ తేడా చాలా వుంది. జేబులో చెయ్యిపెట్టి డబ్బులు తీస్తుండగా ఎవరో ఒక వ్యక్తి అక్కడికి వచ్చాడు.

"ఇద్దరు దొంగలు దొరికార్రా బస్టాండులో!" అన్నాడు వచ్చిన వ్యక్తి.

బార్బర్ షాపు వ్యక్తి "ఏ వూరు వాళ్ళది?" అడిగాడు.

పోతాలు వారిద్దరినే మార్చి చూస్తూవున్నాడు.

"నిన్న జైలు నుండి సబ్‌జైలర్‌నుచంపి తప్పించుకున్నారు ఖైదీలని రేడియో చెబుతూ వుంది కదరా! వాళ్ళలో ఇద్దరు బస్టాండులో ఉంటే పోలీసులు పట్టుకుని తీసుకెళ్ళారు. ఇంకా కొందరు దొరకాలట. పోలీసులు చాలా మంది అక్కడే ఉన్నారు. దొరికినవారి వీపులు వగిలిపోయాయనుకో!"

పోతాలు శరీరం వణికింది. కానీ బెదురు కనిపించకుండా డబ్బు అతడికి ఇచ్చాడు.

"దేశంలో దొంగలు ఎక్కువవుతున్నట్లుంది" అన్నాడు నవ్వుతూ పోతాలు.

"ఆ... కాకేం చేస్తారు? తినడానికి తిండిలేకపోతే, చేయడానికి పనీలేకపోతే!" అన్నాడు బార్బర్‌షాపు మనిషి.

జనార్దన్ భయంతో బిర్రబిగుసుకుపోయాడు.

పోతాలు అతని భుజంమీద చెయ్యివేసి "పోదాంపద... ఆకలవుతున్నది. అన్నంతిని సినిమాకయినా పోదాం!" అంటూ బయటకు వచ్చాడు.

"మనం తప్ప అందరూ దొరికినట్లేకదా పోతాలూ" అన్నాడు జనార్దన్ భయంగా.

"కావచ్చు. కానీ పోలీసులుగానీ, జైలర్లు గానీ విజయంపూర్తిగా సాధించలేదు. మనం బయటే తిరుగుతున్నాం. విజయం మనది కాని వాళ్ళదికాదు"

"మనం బస్టాండుకుపోతే దొరికిపోతాంకదా?"

తలవూపాడు పోతాలు- "ఎక్కడికిపోయినా కష్టమే! మనమూ బస్టాండుకు వస్తున్నామని వాళ్ళు చెప్పివుంటారు. తప్పదు... ఎంతమొనగాడయినా పోలీసులచేతిలోపడ్డ తర్వాత చెప్పకతప్పదు. పోలీసులు ఈ పట్నం అంతా మనకొరకు గాలిస్తుంటారు. నడిచయినా ఈ పట్నం దాటితేనే మనకు క్షేమకరం"

జనార్దన్ కూడా అదే ఆలోచించాడు. వడివడిగా నడక సాగించారు. చాలాపెద్దపట్నం. ఎంతదూరం నడిచినా తరగడంలేదు. ఎల్లారెడ్డి వైపు వెళ్ళేరోడ్డు తీసుకొన్నారు. క్రమక్రమంగా పట్నం అయిపోతున్నది. చివరవున్న ఫాక్టరీలు ఒక్కొక్కటే దాటిపోతున్నాయి. రోడ్డు వెంట వస్తూపోతూ అనేక వాహనాలు తిరుగుతున్నాయి.

చకచక నడుస్తున్న పోతాలు సడన్ బ్రేకువడ్డట్టు నిలబడ్డాడు. ఎదురుగా చిమ్మచీకట్లో చెట్లకింద పోలీసు వాహనాలు. ముందుకు వెళ్తే దొరకవచ్చు. ఇప్పుడు వెనక్కు వెళ్ళాలన్నా పోలీసులు ఈపాటికే తమను చూసివుంటే అనుమానంతో వెంటపడతారు. జనార్దన్ వణికిపోతున్నాడు దొరికిపోయినట్లేనని! రెండురాత్రులు నడకసాగించి, తోటల్లోపడి నిద్రపోయి, ఇంతదూరం వచ్చాక, ఇన్నిగంటల తర్వాత పోలీసులు ఎదురవుతున్నారు.

పోలీసులు కేకలేశారు. "రేయ్ ఎవర్రా?"



అంటూ.

పోతాలు ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వబో తుండగానే జనార్దన్ కాలికొద్దీ పరుగుతీశాడు వెనుకకు। పోలీసులు వెంటపడ్డారు విజిలువే స్తూ! పోతాలు దొరికిపోయాడు; అతడితోపాటు జనార్దనూ దొరికిపోయాడు.

వాళ్లముఖాలమీద టార్చ్‌లైట్లు వేస్తూ ఇన్ స్పెక్టర్ చిరునవ్వుతో- "దొరికారు దొంగలు. ఇంకెక్కడికి పోతారురా?" అన్నాడు.

పోలీసులు చేతులు విరిచి కట్టివేసి, ఎత్తు కుని వ్యానులోపడేశారు. పోతాలు నిస్పృహగా తలవాల్చాడు. స్వేచ్ఛ తిరిగి హరించబడింది. తాను ఏం సాధించాలనుకున్నాడో అది మట్టి కలిసిపోయింది. ఇక ఈ జీవితం ఇంతే! తన బతుకుకు ముగింపు ఇదేననుకున్నాడు. కారు తున్న కన్నీళ్ళు కాళ్లమీద పడుతున్నాయి.

పోతాలును, జనార్దన్‌ను వన్‌టౌను పోలీసు స్టేషన్‌కు తెచ్చేటప్పటికి, తెలతెలవారుతు న్నది. అప్పుడే పట్టణం మేలుకొంటున్నది. వీధుల్లో జనం తిరుగుతున్నారు.

వ్యాను స్టేషన్ ముందు ఆగింది. ఇద్దరు పోలీసులు ముందు కిందకు దిగారు. "అవ్!" అంటూ వారిచేతులు పట్టుకుని కిందకు లాగా రు. వెనుక నలుగురు పోలీసులు కిందకు దిగారు.

యస్.ఐ. ముందుసీటునుండి దిగివచ్చి "లోపలకు తీసుకురండి" అంటూ నడిచాడు.

ఇద్దర్నీ తెచ్చి గదిలో పడేశారు. ఆపాటికే సలీం, నారాయణ ఆ గదిలో ఉన్నారు. వస్తున్న

పోతాలును వాళ్ళు చూశారు. పడుకున్న ఇద్దరూ లేచి కూర్చున్నారు. ఒకరినొకరు చూసుకుంటూ కళ్ళతో ఓదార్చుకున్నారు.



ఇన్‌స్పెక్టరు కుర్చీలో కూర్చుని ఫైల్ ముందుకు జరుపుకున్నాడు. ఫోన్ రింగ్ చేసి జైలుకు కనెక్షన్ అడిగాడు. ఆలోగా ఫైల్ పూర్తిచేసుకోడానికి టేబుల్ మీదకు వంగాడు.

ఫోన్ కనెక్షన్ వస్తూనే ఖైదీలు దొరికారనీ, వారిని ఏంచేయాలో చెప్పమనీ అడిగాడు.

అటువైపు జైలర్ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు- "వారి పేర్లేమిటి?"

ఇన్‌స్పెక్టర్ చెప్పాడు. వారిని వ్యానులోగానీ, జీపులోగానీ వెంటనే జైలుకు పంపించవలసిందిగా కోరాడు.

ఇన్‌స్పెక్టర్, పోలీసులని పిలిచాడు. "ఇళ్ళకు వెళ్ళి ఒక గంటలోగా రండి. వీళ్ళను జైలుకు తీసుకెళ్ళాలి." అన్నాడు.

పోలీసులు ముఖాలు చూసుకున్నారు. రాత్రంతా వారికోరకు కాపలాకాచి నిద్రపోలేదు. ఇప్పుడు మళ్ళీ వాళ్లను తీసుకుపోవాలంటే చిరాకుగా ఉంది. ఇరవైనాలుగు గంటల ఈ ఉద్యోగంకంటే వేరుశనగకాయల వ్యాపారం చేసుకోవటం మంచిదనిపించింది వారికి.

కసాయివాడిముందు గొర్రె తలవూపినట్లు ఊపి బయటకు సాగారు. ఇన్‌స్పెక్టర్ కూడా లేచి, బెల్టు లాక్కుంటూ బయటకు నడిచాడు. బయట సెంట్రీ అటూ ఇటూ తిరుగుతున్నాడు. పైన సీలింగ్ ఫాన్ గిరగిరా తిరుగుతున్నది. టేబుల్‌మీదున్న లాఠీ శవంలా పడివుంది.

"ఎలా దొరికారు?" అన్నాడు పోతాలు నలీంతో.

"సులభంగానే దొరికాం. బస్సుఎక్కి హైదరాబాదు వెళ్దామనుకున్నాం. ఈ ప్రాంతంలో పోలీసు కాపు ఉండదని ఆలోచించాం! మేము వచ్చేసరికి బస్టాండులో పోలీసులు కూడా ఎవరూ లేరు. మేం స్టాండులోనికి వెళ్ళిన కొద్దిసేపటికే వ్యాను వచ్చింది. అందులోనుండి పోలీసులు దిగి, సరాసరి మాదగ్గరికే వచ్చారు. మేము పారిపోవటానికి, తప్పించుకోటానికి కూడా అవకాశం లేదు. ఇద్దర్నీపట్టి, లాఠీలతోబాది వ్యానులో పడేసి తెచ్చారు. మీరు ఎట్లా దొరికారు?" అన్నాడు నలీం.

పోతాలు వివరంగా చెప్పాడు. తర్వాత కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు.

"మనం మళ్ళీ అక్కడికి తీసుకుపోబడతాం" అన్నాడు పోతాలు.

జనార్దన్ భయం భయంగా అతడివైపు చూశాడు. "మనల్ని ఇక బతకనిస్తారా?"

"ఏమో... ఏంచేసినా చేయవచ్చు. తోవలోనే కాల్చిచంపి, పారిపోతుంటే కాల్చామని చెబితే మాత్రం చేసేదేమీలేదు. నరకంలోకి దిగి యముడి బాధలు తలుచుకోవటంవల్ల ఏం ఒరుగుతుంది?" అన్నాడు నలీం.

"మనల్ని ఏంచేస్తారంటారిప్పుడు?" అన్నాడు నారాయణ.

"వ్యానులోనో, జీపులోనో తీసుకెళ్తారు. సరాసరి జైలులోకే తీసుకెళ్తారు. అక్కడ మనల్ని ఏంచేస్తారో చెప్పలేం. ఒకవేళ ఇక్కడి ఇన్‌స్పెక్టర్‌కు సరయిన ఆదేశాలిస్తే దారిలోనే కాల్చి, కట్టుకథ సృష్టించవచ్చు. ఏదయినా మనం ప్రాణంమీద ఆశ వదులుకోవలసిందే"

ఎవరూ మాట్లాడలేదు. ఆరడుగుల వెడల్పున్న ఆ గదిలో నలుగురూ నాలుగు మూలల కూర్చున్నారు. బయట నిలబడ్డ సెంట్రీ వారికి కనిపిస్తున్నాడు. స్టూల్ మీద కూర్చుని, తుపాకి పక్కనపెట్టి గోళ్ళు కొరుక్కుంటున్నాడు. సీలింగ్ ఫ్యాన్ శబ్దం తక్కువగావున్నా ఆ నిశ్శబ్దాన్ని ఛేదించేది అది ఒక్కటే కనిపిస్తున్నది.

"వ్యానులో [illegible] మనం తప్పించుకోటానికి ప్రయత్నిస్తేనో" జనార్దన్





ప్రశ్నకు ముగ్గురూ అతని వైపు చూశారు.

పోతాలు బాధగా నవ్వి తల పంకించాడు. "ఒకసారి తప్పించుకొని కూడా గమ్యం చేర లేక, తిరిగి ఎక్కడ బయలుదేరామో అక్కడికే వెళ్తున్నాం! మరోసారి మనం తప్పించుకోగల అవకాశం దొరుకుతుందన్న నమ్మకమేమిటి? దొరికినా ఉపయోగించుకుంటామన్న నమ్మకం లేదు"

నలీం కళ్ళు తీక్షణంగా చూశాయి పోతాలు వైపు. అతడి మొరటు పిడికిలి భూమిమీద బలంగా గుద్దింది. "పోతాలూ! ఒకసారి దెబ్బ తిన్నామని ఎప్పుడూ దెబ్బ తింటామనుకో వద్దు. ఈసారి తప్పించుకుంటే ఈ భూప్రపంచంలో ఎవరికీ దొరకం! అవకాశముంటే చెప్పు... ప్రయత్నిద్దాం!" అన్నాడు ఆవేశంగా.

పోతాలు ఆరిపోతున్న పెదిమల్ని నాలికతో తుడుచుకున్నాడు. నలీం పిడికిలి వైపు చూస్తూ అన్నాడు— "ఎంతో పకడ్బందీగా మనల్ని వాళ్ళు తీసుకెళ్తారు. అందువల్ల తప్పించుకునే అవకాశం కష్టమే. అయినా వాళ్ళు మనల్ని ఏవిధంగా తీసుకెళ్తారో తెలియకుండా, మనం ఏమని ఆలోచించగలం?"

"ఇక్కడినుండి రెండు రకాలుగా మనల్ని తీసుకెళ్లవచ్చు. రైలు ద్వారా! లేక వ్యాను ద్వారా. రైలు ద్వారా తీసుకెళ్తే మనం తప్పించుకునే అవకాశాలు ఎక్కువ. అందువల్ల వాళ్ళు ఆ ప్రయత్నం చేయరు. ఇక వ్యాను ద్వారా తీసుకెళ్లడం వారికి సేఫ్టీ. మనకు అవకాశం లేని పరిస్థితి! అందువల్ల వారు వ్యాను ద్వారానే తీసుకెళ్లవచ్చు" అన్నాడు నలీం.

"నిజమే! వ్యానులో మనల్ని మధ్యవుంచి చుట్టూ పోలీసులు కూర్చుంటారు. అంటే తప్పించుకోవటం కష్టమే" అన్నాడు నారాయణ.

నలీం బయట కూర్చున్న కానిస్టేబుల్‌వైపు చూసి నిరసనగా అన్నాడు— "వాళ్ళు మన చుట్టూ కూర్చునేది- అదిగో- అలాగే వుంటుంది. జీతం రాళ్లకొరకు బతికేవాళ్లు, వాళ్ల ప్రాణాల కొరకు చూస్తారుగానీ, మనల్ని పట్టుకోడానికి ఏమంత తెగింపు చేయరు. మన అవివేకం కొద్దీ దొరికిపోయాం! పోలీసుల్ని ఏమార్చి పారిపోవడం సాధ్యంకాదంటావా పోతాలూ?"

వారి మాటలువింటూ పోతాలు ఆలోచిస్తున్నాడు. తనకు జైళ్ళతో పెద్ద అనుభవంలేదు. స్థానికంగా సమస్యలు వచ్చినప్పుడు, సబ్ జైళ్లలో పడేసేవాళ్ళు. ఆ సబ్ జైలు పెద్ద సమస్యకాదు. రెండు మూడు రోజులలో బెయిల్‌మీద బయటకు వచ్చేవారు. పెద్ద జైలుకు రావడం ఇది మొదటిసారి. వచ్చిన వెంటనే అనేక తగవులు, చివరకు హత్య, పారిపోవడం. ఈ పారిపోవడంలో అనుభవజ్ఞులైతే తిరిగి పోలీసులకు దొరక్కుండా పారిపోయేవారే. తమకు అనుభవంలేదు. సులభంగా లొంగిపోవలసి వచ్చింది. పోలీసులు రోడ్డుమీదనే హెచ్చరించిన వెంటనే పారిపోయివుంటే ఎలా వుండేదోగానీ, నిలిచి దొరికిపోవడం ఇప్పుడు బాధగావుంది. పారిపోతే కాల్చివేస్తే ప్రాణంపోతుంది. ఇప్పుడు దొరికినా చిత్రహింసచేసిన తర్వాతయినా ప్రాణానికి గ్యారంటీలేదు. మరోసారి తప్పించుకోడానికి అవకాశం దొరుకుతుందా? దాన్ని సద్వినియోగం చేసుకోగలమా? అని ఆలోచిస్తున్నాడు. ఎలాగూ వారి చేతిలో రేపైనా ప్రాణంపోతుంది. మరి అవకాశం దొరికించుకుని పారిపోవడానికి రెండోసారి ప్రయత్నిస్తే, దొరికామో ఎలాగూ ప్రాణంపోతుంది. లేదా రెండోసారి ఇక దొరక్కుండా స్వేచ్ఛగా పారిపోవచ్చు.

"ఏం పోతాలూ... పలుకవేం? ఇక్కడున్నా మన ప్రాణం తీస్తారు. ఎదుటివాడి ప్రాణంకంటే మనకు మన ప్రాణం విలువ ముఖ్యమని నువ్వే అన్నావుగా"

తల ఊపాడు పోతాలు. ఎవడి ప్రాణం వాడికి తీపి! నిజమేమరి.

ఊపిరిపీల్చి వదిలాడు పోతాలు. బయట మరో కానిస్టేబుల్ వచ్చినట్లుంది. సెంట్రీ లేచి నిలబడి మాట్లాడుతున్నాడు. కానిస్టేబుల్స్ ఒక్కొక్కరే రావడం ఆరంభించారు. తలుపు ఊచల దగ్గరగావచ్చి, నలుగురినీ చూసి వెక్కిరింతగా నవ్వి తిరిగిపోతున్నారు. ఇంత సులభంగా వీళ్ళు దొరుకుతారని ఆలోచించలేదు పోలీసులు. నలుగురూ కుక్కపిల్లల్లా దొరికిపోయారు.

పోతాలు చెయ్యివట్టుకునిలాగాడు నలీం. అతడివైపు చూసాడు పోతాలు. "ఇక మనం మాట్లాడుకునే అవకాశంకూడాలేదు పోతాలూ! పోలీసులు వ్యాను ఎక్కిస్తే మన ప్రాణాలమీద ఆశవదులుకోవడమే! అలోగా మనం ఆలోచించలేమంటావా?" అన్నాడు గునగునగా

"ఏం చేద్దామంటావ్?"

"పారిపోదాం! వ్యాను ఎక్కిన తర్వాత ఎలా అవకాశం దొరికితే అలా!"

"వాళ్ళు మనల్ని కాల్చివేస్తారు... తప్పించుకోలేకపోతే!"

"ఎలాగూ చంపుతారు రేపైనా. ఈవిధంగా ఛస్తే చిత్రహింసలయినా తప్పుగలవు"

జనార్ధన్ గుటకలు మింగుతున్నాడు. నారాయణ బయట పోలీసులవైపు చూస్తున్నాడు. పోతాలు ఏంచెబుతాడోనని ఎదురుచూస్తున్నారు.

"చావుకు మీలో ఎవరూ భయపడటంలేదా?"

పోతాలు మాటలకు నారాయణ నిరసన పూర్వకంగా చూశాడు- "ఇంతవరకూ చావడానికి, చంపడానికీ సిద్ధపడ్డాం! ఇప్పుడుమాత్రం వెనుకంజ వేస్తామని ఎలా అనుకుంటున్నావ్?"

"సరే... మరో ప్రయత్నం చేద్దాంకానీ, పోలీసులు మనల్ని ఎలా తీసుకు పోవడానికి ప్రయత్నిస్తారోచూసి ప్లాన్ నిర్ణయించుకుందాం"

సెంట్రీ అక్కడికివచ్చి నిలబడ్డాడు. "మీకు తిండిపెట్టమని ఇన్‌స్పెక్టరుగారు చెప్పారు... తింటారా?"

పోతాలు తలవూపాడు. ఒక కానిస్టేబుల్ పెద్ద పొట్లం ఒకటి తెచ్చాడు. మరో గదిలోనున్న వ్యక్తులలో ఒకడిని బయటకుతీసి, అతని ద్వారా బకెట్‌తో నీళ్ళు తెప్పించాడు. సెంట్రీ తలుపు తెరిచాడు.

బయటకు రాబోతున్న పోతాలును చూసి అరిచాడు సెంట్రీ. "ఎవడూ బయటకు రావద్దు. లోపలే తినాలి"

"ఇంతమంది మీరుంటే మేం ఎక్కడికి పోతామండీ? లోపల రోతగావుంది. బయట తింటాం."

"ఆ వప్పులేం వుడకవ్" అంటూ పోతాలును లోపలకు తోశాడు.

బకెట్ లోపలపెట్టి వచ్చాడు ఆవ్యక్తి! పొట్లం అందించిన వెంటనే తలుపుకు తాళం వేశారు.

పోతాలు పొట్లం విప్పాడు. నలభై ఇడ్లీలున్నాయి.

చిరునవ్వుతో తలో పది అందించాడు. "తినండి! మనకు బలంకావాలి! అవసరమైతే పారిపోవాలన్నా తగిన బలం కాళ్ళకు అవసరమే"

"ఈ నాకొడుకులు మనకు తిండెందుకు పెడుతున్నారో" అనుమానంగా అన్నాడు జనార్ధన్.

"మనం మామూలు ఖైదీలంకాదుగదా! జైలర్‌నేచంపి, జైలు ఊచలుకోసి వచ్చిన వ్యక్తులం. ఆ భయంవారికి వుంటుంది. తిండి పెట్టలేదని పై అధికారికి రిపోర్టు చేశామా... వీళ్ళకు ఉప్పు దొరకదని తెలుసుమరి"

నలుగురూ ఆబగా తింటున్నారు. కడుపు నిండా నీళ్ళు పట్టించారు. ఆపాటికి పోలీసులు, ఇన్‌స్పెక్టరూ వచ్చారు. వ్యాను స్టేషన్‌ముందు నిలిచింది. పదిమంది పోలీసులు, ఇన్‌స్పెక్టరు ఎస్కార్టుగా పోవడానికి నిర్ణయమయింది. డ్రైవరుతో కలిసి పన్నెండుమంది.

వ్యానులో తీసుకుపోబడుతున్నామని వారు అర్థం చేసుకున్నారు. హడావిడిగా తిరుగుతున్న పోలీసులు తమను చూడటంలేదని నిర్ణయించుకుని, పోతాలు చిన్నగా వారితో అన్నాడు- "వ్యానులోనుండి తప్పించుకుపోవడానికి ఎంత సాధ్యమో మధ్యన ఆలోచించాల్సిందే! దారిలో పరిస్థితులబట్టి నడుచుకుందాం! దేనికయినా అందరూ సిద్ధంగా వుండండి. సమయం వస్తేమాత్రం వెనకంజ వేయకండి"

తలలూపారు ముగ్గురూ!

ఉదయం పది గంటలకు వ్యాను స్టార్ట్ చేశారు. ఇస్త్రీనలగని, గంజి గుడ్డలతో పోలీసులు తళతళలాడుతున్నారు. నలుగురు ఖైదీలనీ మధ్యన కూర్చుండబెట్టుకుని, చుట్టూ

 

# మీకు తెలుసా?



★ వారపత్రికలు కూడా రూ 3/ తక్కువలేని ఈరోజుల్లో జంటమాస పత్రికలు 'విపుల, చతుర' ఒక్కొక్కటి కేవలం రూ 2-50 లభిస్తున్నాయి.

★ సీరియల్స్, సినిమా కబుర్లు మరియు ఇతర శీర్షికలతో వచ్చే అన్ని పత్రికలకు భిన్నంగా ఒక పూర్తి నవలతో 'చతుర', దాదాపు 15 వివిధ భాషా కథలతో 'విపుల' తమ ప్రత్యేకతను నిలుపుకొంటున్నాయి. ఒక్కొక్కటి 132 పేజీలతో నెలనెలా సర్వాంగసుందరంగా వెలువడుతున్నాయి.

★ ఏ భాషలోను, ఏ పత్రిక సాహసించనంత భారీగా రూ. లక్షపైబడిన బహుమతులతో కథల/నవలల పోటీ జయప్రదంగా నిర్వహించిన విపుల. చతురలు బహుమతి పొందిన కథల/నవలల ప్రచురణలతో ప్రస్తుతం మార్కెట్‌లో నెలనెలా 1వ తారీఖున విడుదలవుతున్నాయి.

★ పత్రికారంగంలోనే ఒక రికార్డుగా కేవలం ఒక సంవత్సరకాలంలో అమ్మకాలు దాదాపు 3 రెట్లు పెరిగి, ఇతర తెలుగు మాసపత్రికల కన్నా సుమారు రెండురెట్ల అమ్మకాలతో 'చతుర', $1\frac{1}{2}$ రెట్లతో 'విపుల' ప్రస్తుతం మార్కెట్‌లో అత్యంత ప్రజాదరణ పొందుతున్నాయి.

తప్పక చదవండి

**చతుర** **విపుల**

పోలీసులు పదిమందీ కూర్చున్నారు. ఇన్‌స్పెక్టరు ముందు సీట్లో కూర్చున్నాడు. తుపాకులు సీట్ల కింద, పైనా పెట్టి నింపాదిగా పోలీసులు మాట్లాడుకుంటున్నారు.

వ్యాను కదిలింది. పూర్ణగర్భిణిలాగా, బర్రు మంటూ వీధి, ముందుకు సాగింది.

"బండి కంట్రోల్‌లో ఉందా లేదా?" అన్నాడు ఇన్‌స్పెక్టరు డ్రైవర్‌వైపు చూసి.

"బండి కంట్రోల్‌లోనే వుంది సార్!"

"సరే!" అన్నాడు సిగరెట్ ముట్టిస్తూ!

టౌన్‌దాటి వెళ్ళేసరికి పదిన్నరగంటలయింది. ఎండవేడిమి ఆరంభమయింది. రద్దీగా ఉన్న సింగల్‌రోడ్‌మీద బండి సాగిపోతున్నది. సైడ్ దిగినప్పుడల్లా ఒకరి మీద ఒకరు ఒరుగుతూ, పోలీసులు ఛలోక్తులు విసురుకుంటున్నారు. ఖైదీలు ఒకరివైపు ఒకరు చూసుకుంటున్నారు. వ్యాన్ ఘాట్ సెక్షన్‌లో అడుగుపెట్టింది. బండి బరువుగాసాగిపోతున్నది. ఎత్తయిన ప్రాంతం ఎక్కవలసి వచ్చినప్పుడు లోడ్‌గేర్‌మీద కూడా విపరీత శబ్దం చేస్తూ ప్రయాసతో లాగుతున్నది. ఇది గమ్యం చేరుస్తుందా- అని అనుమానిస్తున్నాడు ఇన్‌స్పెక్టరు బండినడక చూసి. తమ ప్రాణాలు నిలిచే ఆశ ఏమైనావుందా అని ఆలోచిస్తున్నారు ఖైదీలు! వీళ్ళను ఎంత తొందరగా గమ్యం చేర్చి చేతులు తుడుచుకుందామా- అని పోలీసులు ఆలోచిస్తున్నారు. ఎవరి ఆలోచనలో వాళ్ళున్నారు. బండి నిటారు కొండ ఎక్కడానికి ప్రయాసపడుతూనేవుంది. టర్నింగ్ తిరిగితే కానీ, దిగుడువాలు రాదు. సరిగ్గా టర్నింగ్ దగ్గర ఎదురుగా వేగంగా పైకి ఎక్కివచ్చిన లారీ వ్యాన్‌కు అడ్డం వచ్చింది. బండ్లు కదలడానికి అవకాశం లేకుండాపోయింది. సైడ్ ఇవ్వమని పోలీసు డ్రైవరు మొత్తుకున్నా లారీ డ్రైవరు వినిపించుకోలేదు. కంకర లారీ! మంచి ఊపు కంమీద వుంది. వెనుకకు బండి నడిపిస్తే పల్లంలోకి పడిందంటే తాము చస్తామని అతడికి తెలుసు. అయినా ముందుంది పోలీసు వ్యాను గనుక అతడు జంకాడు. వెనుకకు పోవడానికి రివర్స్ గేర్‌వేసి బండి కదిలించాడు. అసలే ఇరుకు రోడ్డు. అందులో టర్నింగ్‌పాయింట్! బండి ఎటు కట్‌చేయడానికీ సాధ్యంగాక శబ్దం చేస్తున్నది.

పోతాలు తనవారివైపు చూశాడు. ఆందోళనగా వాళ్ళు చూస్తున్నారు అవకాశం దొరుకుతుందేమోనని! పోలీసులవైపు చూశాడు. వాళ్ళు సిగరెట్లు కాల్చుకుంటూ ఎదురుగా ఉన్న లారీ డ్రైవర్‌ను బూతులు తిడుతూ బయటకు చూస్తున్నారు. ఇన్‌స్పెక్టర్ వైపు చూశాడు. సీటులో అతడు అసహనంగా కదులుతూ వున్నాడు. పోతాలు గుండె విపరీతంగా కొట్టుకుంటున్నది. క్షణక్షణానికీ రక్తప్రసరణ ఎక్కువవుతున్నది. ఎలాగూ తాము చావక తప్పని పక్షంలో పారిపోతూనే చావడం ఉత్తమం! ఇంతకంటే మంచి అదను ఇక జీవితంలో తమకు అందదు. సలీం వైపు చూస్తూ కింద కాలుతొక్కాడు. సలీం తల అతనివైపు తిప్పాడు. తుపాకుల వైపు వేలు పెట్టి చూపించాడు. సలీం ఆ సైగను అర్థం చేసుకున్నాడు. మిగిలిన ఇద్దరికీ అదే హెచ్చరికలు చేశాడు. ఎదురుగా మరో లారీ వెనుకనుండి రావడంతో ముందున్న లారీ ఇక కదలడానికి సాధ్యంగాకుండా వుంది. పోలీసులు మహా ఆతృతగా బయటకు చూస్తున్నారు. పోతాలు చేతులు రొమ్ముకు లాక్కున్నాడు. ఇది చివరి పోరాటమే కావచ్చు! అందువల్ల సర్వశక్తులూ చేతుల్లోకి తీసుకున్నాడు. మిగిలిన నలుగురూ పొజిషన్‌లో చేతులు సర్దుకున్నారు. అటూ ఇటూ కదలడానికి వారికి అవకాశం లేదు. కూర్చున్నచోటునుండే రెండు చేతులనూ ముందుకు లాగి సంకెళ్ళతో ఇద్దరు పోలీసుల ముఖాలమీద కొట్టాడు. ఆ దెబ్బలు ఊహించని పోలీసులు అరవడానికి కూడా అవకాశం లేని ఆశ్చర్యంతో, బాధతో పక్క కానిస్టేబిళ్ల మీదపడ్డారు. మిగిలిన ముగ్గురూ తుపాకుల మీద కాళ్ళు పెట్టి కానిస్టేబిల్స్ మీదపడి కొట్టారు. వారి కేకలకు, దెబ్బలకు ఇన్‌స్పెక్టర్ వెనుతిరిగి చూశాడు. అతని ముఖం క్రోధంతో మండిపోయింది. పదిమంది పోలీసులు, ఆ ఇరుకు వ్యానులో నలుగురి ఖైదీల చేతుల్లో దెబ్బలు తింటూ అరుస్తున్నారు.

పిస్తోలు చేతికి తీసుకుని- "చేతులుపైకె




త్తండి, లేకుంటే కాల్చేస్తా'' అన్నాడు.

ఒక కానిస్టేబిల్‌ను తన ముందుకు తిప్పుకున్నాడు పోతాలు. మిగిలిన ముగ్గురూ పోలీసుల్ని ముందుకుతోసి వారి వెనుక నిలబడ్డారు. తుపాకులు పోలీసులకు అందుబాటులో లేవు. అవి కాళ్ళ కిందపడి వున్నాయి. ఇన్‌స్పెక్టర్ తలుపు దగ్గరకు వచ్చి, తలుపు తెరిచాడు. తాను తలుపు కుడివైపుకు నక్కి నిలబడ్డాడు. ఎవరూ దిగలేదు. ఈ లోగా ట్రాఫిక్ అటూ ఇటూ బందయింది. జనం పోలీసు వ్యాను వైపు చూస్తున్నారు. అక్కడేం జరుగుతుందో ముందున్నవారికి తప్ప వెనుకవారికి తెలియదు. అయినా ఏదో జరుగుతున్నదని అనుకుంటున్నారు.

ముందున్న కానిస్టేబుల్స్‌ను కిందకు తోశాడు సలీం! నరికిన చెట్టులాగా, కిందకుబడ్డారు. కిందనున్న తుపాకి చేతికి తీసుకున్నాడు. దాన్ని ఎలా ఉపయోగించాలో అతడికి తెలియదు. వెనుకకు తిప్పి, లోపలున్న ఒక కానిస్టేబుల్‌ను బాదాడు. అతడు అరుస్తూ నేలకూలాడు. లోపలున్న కానిస్టేబుల్స్‌ను వరుసపెట్టి కొడుతున్నా, కింద వున్న ఇన్‌స్పెక్టర్ కాల్చలేకపోతున్నాడు. తన కాల్పు తనవారికే తగలవచ్చని అతని భయం! కిందపడిన కానిస్టేబుల్స్ మట్టి తుడుచుకుంటూ ఒక పక్క నిలబడి వున్నారు. ఆ ఖైదీలను విడిచిపెడితే తన ఉద్యోగం పోతుందని ఇన్‌స్పెక్టర్‌కు తెలుసు. పన్నెండు మంది పోలీసువర్గం వుండీ నలుగురు ఖైదీలను అదుపుచేయలేకపోవడం సిగ్గుచేటనీ అతడికి తెలుసు!

లోపలికి ఎక్కడానికి ధైర్యం చాలలేదు. వాళ్ళు చేతులకున్న సంకెళ్ళతో ఎంత దూరంపోగలరు? మళ్ళీ దొరక్క తప్పదు. అందువల్ల ఇన్‌స్పెక్టరుకు ధైర్యంగానూ ఉంది. అయినా వారిని ఇప్పుడు పట్టేమార్గం అవుపించడంలేదు. ఇన్‌స్పెక్టరు ఆలోచిస్తుండగానే, సలీం మెల్లగా కిందకు దిగాడు. ఇన్‌స్పెక్టరు ఎక్కడున్నాడో అతడి మాటల ద్వారా అర్థంచేసుకున్న సలీం, గుదె కట్టెలాగా పట్టుకున్న తుపాకితో అతని మీదపడ్డాడు. ఇన్‌స్పెక్టర్ దూరంగా జరిగాడు. ఆలోగా మిగిలిన ముగ్గురు కూడా కిందకు దిగారు. ఇన్‌స్పెక్టరు పిస్తోలు ట్రిగర్ లాగాడు. ఆలోగా వారు పారిపోతున్నారు. ముందు వ్యాను అడ్డుగా, ఆ తర్వాత లారీ. ఆ తర్వాత మరో లారీ! అయినా ఇన్‌స్పెక్టరు నాలుగు రౌండ్లు కాల్చాడు. అందులో ఒకటి జనార్దన్‌కు తగిలి నేలకూలాడు. మిగిలిన ముగ్గురూ క్షణం కూడా ఆలస్యం చేయలేదు. నిటారుగా ఉన్న కొండను చుట్టు తిరిగి పారిపోతున్నారు. రెండు చేతులూ ముందుకు చాపి, సంకెళ్ళు తగిలించిన ఆ చేతుల్ని ఊపుకుంటూ లోయవైపు పోతున్నారు. ఇన్‌స్పెక్టర్ వారి వెంటపడలేదు. చచ్చిన వ్యక్తి దగ్గరకు వచ్చి చూశాడు. ఆపాటికే ప్రాణం పోయింది. దెబ్బలు తిని లోపల పడివున్న పోలీసులు తలెత్తి, ఎవరూ తమ దగ్గర లేరని నిర్ణయించుకొని, తిరిగి లేచి నిలబడ్డారు. డస్సిపోయిన శరీరాలతో తుపాకులు అక్కడే పడేసి కిందికి దిగి నిలబడ్డారు. ఈ లోగా ఇన్‌స్పెక్టరు ఖైదీలు పోతున్నవైపు పరుగెత్తసాగాడు. మిగిలిన పోలీసులు కూడా తుపాకులు తీసుకున్నారు. కానీ, పరుగెత్తడానికి వారికి ఓపిక లేదు. చిన్నగా బయలుదేరారు.

పోలీసులు తమ వెంటబడుతున్నట్లు ముగ్గురికీ తెలుసు. తమ చేతులకు సంకెళ్ళున్నాయి. అవి ఉన్నంతవరకూ బయలులో తాము పెద్దగా పరుగెత్తలేరు. పోలీసుల్ని ఎదిరించనూలేరు. ఆ సంకెళ్ళు తొలగించడం మాటల్తోకాదు. వాటిని ఏ కమ్మరి దగ్గరైనా విడదీయాలి. అందుకు తగిన గ్రామప్రాంతం పోవాలి. ఆలోగా తాము దొరికిపోతామేమోనని భయపడుతూనే పరుగెడుతున్నారు.

''పోతాలూ! మనం కిందవైపుకు పోతే, పోలీసులు సులభంగా పట్టుకుంటారు. ఈలోగా అదనపు బలగాల్ని కూడా పిలుస్తారు. కొండపైకి మళ్ళండి'' అన్నాడు సలీం.

ముగ్గురూ కొండపైకి తిరిగారు. నిటారుగా ఆకొండను సంకెళ్ళున్న ఖైదీలయినా, సంకెళ్ళు లేని పోలీసులయినా, ఎక్కడానికి ఒకటేబాధ తప్పదు. పైగా ముందుపైనున్న ఖైదీలు, పోతూపోతూ, కాళ్ళతోనూ, చేతులతోనూ క్రిందకు రాళ్ళుదొర్లిస్తున్నారు. ఆరాళ్ళు క్రిందకు అతివేగంగా రావడంతో పోలీసులు ముందుకు

పోలేక నిలబడిపోతున్నారు. ఇన్‌స్పెక్టర్‌కు అపాటికే రెండురాళ్లు కాళ్లకు తగిలి క్రిందపడ్డాడు. ఖైదీల్ని తాముపట్టుకోలేమన్న నిర్ధారణ వచ్చేవరకూ, ఇన్‌స్పెక్టర్ ప్రయత్నించాడు. ఇక సాధ్యంకాదనీ, వాళ్లు రువ్వే రాళ్లదెబ్బలకు పోలీసులు తాముచస్తామనీ నిర్ణయించుకుని వెనుతిరిగి అదనపు బలం అవసరం! ఈకొండఏరియాదాటి వాళ్లు పోలేరు!

పోలీసులు క్రిందికి దిగుతూ ఉండటంతో ఖైదీలు నిబ్బరంగా ఊపిరి పీల్చుకున్నారు. అంటే మరికొంత సమయం తమ జోలికి పోలీసులు రారు. అదనపు సహాయం అవసరం వారికి! అలోగా తాము ఈగుట్టదిగి, ఏదోఒకచోట సంకెళ్లు తొలగించుకోవడం అవసరం!

ఆయాసంతో కొండపైభాగానికి ఎక్కారు. క్రిందలోయవైపు చూశారు. చాలా అగాధంగా ఉన్నట్లుంది. ముగ్గురూ గడ్డిమీద చతికిల బడ్డారు. చేతులకున్న సంకెళ్లు చూసుకున్నారు.

"పోతాలూ! ఈపెద్దరాయి మీదకు నీచేతులు చాపిపెట్టు" అన్నాడు నారాయణ.

అతడిఉద్దేశం ఊహించుకుని రాతిమీద తనరెండు చేతులూ పెట్టాడు పోతాలు. సంకెళ్లు బండమీద అన్పబడ్డాయి. నారాయణ ఒక పెద్దరాతిని ఎత్తి, ఆసంకెళ్లమీద కొట్టాడు. ఖణేళ్ మన్నశబ్దం తప్ప కొంచెంకూడా దెబ్బతినలేదు.

"ఇలాసాధ్యంకాదు నారాయణా!" అన్నాడు పోతాలు! "ఇవి వదిలించుకోవాలంటే కమ్మరి అవసరం! ముందు పల్లెఏదో చేరాలి. అంతవరకూ మనం దొరక్కుండా ఉండిపోతే, కమ్మరిని బెదిరించో, అదిరించో వదిలించుకోవాలి"

"ఈ లోయలో పల్లెలుంటాయా?" సలీం అనుమానంగా అన్నాడు. చుట్టూచూస్తూ.

"ఇవి బోడికొండలు. ఇక్కడంతా వ్యవసాయంచేసే గిరిజనులు ఉన్నారు. వాళ్లు మనకు ఎంతవరకు సహాయం చేస్తారో చెప్పలేం!"

సూర్యుడు పశ్చిమంవైపుకు జారిపోతున్నాడు. కొండపైనుండి, అటువైపు వాలుకు నడవకుండా ఇటువైపు వాలుకే మూలగాదిగడం ఆరంభించారు. పోలీసులు తాము అవైపుకు వెళ్లి ఉంటామని ఊహించి, అటువస్తారు. ఈలోగా చీకటిపడితే తాము పన్నెండు గంటలు నిర్భయంగా గడపవచ్చు. చీకటిపడేటప్పటికి కొండదిగి లోయలో అడుగుపెట్టారు. లోయలో నీళ్లు గలగల చప్పుడు చేస్తున్నాయి. ఏటిఒడ్డువెంట తుప్పలుపెరిగి ఉన్నాయి. నలుగురు తుప్పలుదాటి వెళ్లికడుపారా నీళ్లు త్రాగారు. తిరిగి వచ్చి తుప్పలమధ్య కదలకుండా కూర్చున్నారు. పోలీసులు వస్తారేమోనని ఎదురు చూస్తున్నారు. పోలీసుల అలికిడిఏమీలేదు. గానీ జనం ఇద్దరో, ముగ్గురో మాట్లాడుతూ పోతున్నట్లు వారికి అనిపించింది. అంటే అటుగా బాట ఉందన్నమాట. బాటతోపాటు ఊరుకూడా తప్పకుండా ఉంటుంది. ఇంకా ఎందుకు పోలీసులు రంగ ప్రవేశం చేయలేదో? లేకవెతుకుతూ వస్తున్నారా? వాళ్లు నిర్ణయించుకోలేకపోయారు. చీకటి పడటంతో, తమ రాజ్యం ఆక్రమించిన ఆనర జాతి మీదకు దోమలు దాడిచేస్తున్నాయి. కుడుతున్న దోమల్ని రెండు చేతుల్తోనూ విసురుకుంటూ కాలంగడిపారు. తాము స్వేచ్ఛగా పోవడానికిముందు సంకెళ్లు పోవాలి. అవిపోకుండా జనంకంట పడినా తమకు ముప్పే!

రాత్రి పక్షుల కలకలారవంతో లోయంతా ప్రతిధ్వనిస్తున్నది. ముగ్గురూ లేచి తుప్పలు దాటివచ్చారు. ఆహారంకంటే, ఆవేదన కడుపులో దేవుతున్నది. అంతకు ముందు వినిపించిన సవ్వడిని బట్టి బాట వైపునడిచారు. చిమ్మచీకటిలో ఒకరికొకరు వాళ్లే కన్పించడంలేదు. కనిపించిన కాలిబాటవెంట నడిచారు. దాదాపు ఐదుకిలోమీటర్ల దూరం నడిచేటప్పటికి వారికి దీపాలు కనిపించాయి. వారి మనస్సులో ఆశతోపాటు అనుమానం కూడా వచ్చింది. ఒకవేళ పోలీసులు అక్కడికి వచ్చి ఉంటే? వాళ్లురాకున్నా గ్రామజనం తమసంకెళ్లను చూసి, చుట్టుముట్టి పట్టుకుంటే! వ్యానులో ఇరుగ్గా నిర్లక్ష్యంగా ఉన్నా పోలీసులమీద పడి కొట్టినంత సులభంగా, బయలులో నిలబడ్డ జనాన్ని తాము కొట్టనూలేరు, దొరకకా తప్పదు. ఈఊర్లో అసలు కమ్మరిపని చేసేవాడున్నాడా? ఇవి తీయడానికి వాడు అంగీకరిస్తాడా?



వారికి అనేక అలోచనలు! చనిపోయిన జనార్ధన్ గురించివారి మనస్సులో ఒక వైపు కలుక్కుమంటున్నా ఎవరూ ఆవిషయం బహిరంగంగా మాట్లాడుకోవడంలేదు. ముందు స్వేచ్ఛ ఎట్లా అన్నదే వారి సమస్య! ఆ స్వేచ్ఛకావాలంటే సంకెళ్లు పోవాలి.

ఊరిముందుకు వచ్చారు. పెద్ద రావిచెట్టు విరబోసుకుని ఉంది. దానిప్రక్కనే చిన్న సత్రంఉంది. సత్రంలో బహుశః బిక్షగాళ్లేమో నిద్రపోతున్నట్లు గురకలు వినిపిస్తున్నాయి. చెట్టుక్రిందనిలబడి చూశాడు. ఆ ఊరుఎంతదో వారికి అంచనా అందలేదు. ఏదయితే అది అవుతుంది. బిక్షగాళ్లద్వారా కమ్మరిమనిషి గురించి ఎంక్వాయిరీ చేయాలి. గ్రామంలో ఈసమయంలో ఎవరిని అడిగినా అనుమానమే! బిక్షగాళ్లలో పాతవాళ్లు అయితే చెప్పగలరు, కొత్తవాళ్లకు తెలిసుండకపోవచ్చు.

సత్రంలోకి వెళ్లి, ఒక మనిషిని లేపాడు సలీం! ఆవ్యక్తి లేచాడుగానీ, చీకట్లో ఎదుటివ్యక్తి ఎలా ఉన్నాడో చూడలేదు. ఆవ్యక్తికి ఆ అవసరమూలేదు. బిక్షగాళ్లను లేపడానికి [illegible] రారని వాళ్లకు తెలుసు.

"ఈ ఊళ్లో కమ్మరి నారయ్యా ఇల్లు ఏటు?" అడిగాడు సలీం! కమ్మరిఉన్నాడా? అని అడగితే ఒకవేళ అనుమాన పడతాడేమోనని అతడిభయం! కాని ఆ బిక్షగాడు ఇతడిభయాలూ, ఆలోచనలు ఊహించడంలేదు.

ఎవడో నారయ్యా అనేవ్యక్తి కావాలి. అతడు

తనకు తెలియదు. కమ్మరిపనిచేసే ఇల్లు ఒకటే ఉంది, అతడు ఆయింటిని గురించి చెప్పాడు. ముగ్గురూ గ్రామంలోకి కదిలారు. కమ్మరి పేరు నారయ్యో సూరయ్యో, వీరికీ తెలియదు. ఎవరయినా అడిగితే ఏం చెప్పాలి?

ఎక్కడో కోడి కూసింది. ఆకూతకు ప్రతిధ్వనిగా కూతలు ఆరంభమయ్యాయి. ఇళ్లలోనుంచి దగ్గుతున్న జనం, చెదరుగా మాట్లాడుతున్న మాటలూ వినబడ్డాయి. కుక్కలు కుయ్యోమని మొరుగుతున్నాయి. భయం భయంగానే నడక సాగించారు. ఊరికి ఒకవైపు కమ్మరి కొలిమి కనిపించింది. వాళ్లు ఊపిరి పీల్చారు ఒకసారి!

"వీడెవడో, ఏమంటాడో! దీనిమీద మనబ్రతుకు ఆధారపడి ఉంది" అన్నాడు నారాయణ.

పోతాలు మాట్లాడలేదు. ముందుకువెళ్ళి పూరిగుడిసె తలుపుతట్టాడు. లోపల అలికిడి వినిపించింది. మంచం కిర్రుమంటున్నది. దగ్గుతూ ఒకరు తలుపు దగ్గరకువచ్చి తడిక తలుపును తీశారు. చీకట్లో నిలబడ్డ వారెవరో తలుపు తీసిన వ్యక్తికి తెలియదు.

"ఎవరు మీరు?" అన్నాడు.

ఆలోగా పోతాలు, అతడితోపాటు మిగిలిన వారు లోపలకుదూరి తలుపు బిగించారు. అతడు భయంతో వణుకుతూ నిలబడ్డాడు. యాభై సంవత్సరాలకు పైబడిన వయస్సు. మరో మంచంలో ఒక స్త్రీ, పదేళ్ళ పాప పడుకొని వున్నారు. ఈ అలికిడికి ఆమెలేచి, చేతులకు సంకెళ్ళున్న వారినిచూసి నోరు తెరిచింది.

పోతాలు అతడి వైపుచూసినవ్వాడు. "భయపడకు... మేం దొంగలంకాదు. కొన్ని కారణాలవల్ల పోలీసు కష్టడీనుండి పారిపోయి రావడం జరిగింది. మావల్ల మీకేం భయంలేదు. మా సంకెళ్ళుతీసి సహకరించు. జీవితంలో బతికుంటే ఎప్పుడయినా మేలు చేస్తాం."

అతడు తలగోక్కున్నాడు. భార్యవైపు, కూతురివైపు చూశాడు. తిరిగి వారివైపు చూశాడు. తీయడమా? మానడమా? తీయనంటే తన గొంతు నులిమి వేయగలరు. తీస్తే ఉదయం పోలీసులకు తెలిస్తే తనకు తగిలిస్తారు. ఏంచేయడానికీ పాలుపోక నిలబడ్డాడు.

"నీ పేరేమిటి?" అన్నాడు పోతాలు.

"ధర్మయ్య"

"ధర్మయ్యా! ఆలస్యంచేస్తే మా ప్రాణాలు పోతాయి. పోలీసులు వెంటబడుతున్నారు. ముగ్గురి ప్రాణాలు కాపాడినవాడివవుతావు. నీవు తీయనన్నా నిన్నేం చేయం. మా దారిన మేం వెళ్ళిపోతాం. తీస్తే మా ప్రాణాలు కాపాడినట్లే. మానుండి ఏ సహకారం కావాల్సినా చేస్తాం"

సలీం ధర్మయ్య భార్య దగ్గరకువెళ్ళి నిలబడ్డాడు. అదే మాటలు ఆమెతోనూ చెప్పాడు. ఒకవేళ అరవదలచుకుంటే గొంతు పిసకడానికయినా సిద్ధపడి ఆమెవద్ద నిలబడ్డాడు. వాళ్ళ ప్రాణాలకంటే తమ ప్రాణాలు ముఖ్యం.

"మాకు పోలీసులనుండి అపకారం జరగదా?" అనుమానంగా అడిగాడు ధర్మయ్య.

"ఈ రాత్రి మీ ఇంటికి వచ్చామనీ, మీరు తీసారనీ ఎవరికి తెలుసు. మీరు తీసిన తక్షణం వెళ్ళిపోతాం. నీకేమయినా కావాలంటే సహాయం చేసివెళ్ళిపోతాం"

"మనకు వచ్చిన నష్టంమేమిటి? తీయండి" అంది అతడి భార్య.

భార్య మాటతో ధైర్యం తెచ్చుకున్న ధర్మయ్య పోతాలును ఒక పీటమీద కూర్చోమన్నాడు. ఉలి, శ్రావణం, సుత్తి తీసుకున్నాడు. సంకెళ్ళ మధ్య సందులో ఉలిదూర్చి సుత్తితో కొట్టడం ఆరంభించాడు. ఐదు నిమిషాల్లో పోతాలు చేతుల సంకెళ్ళు విడిపోయాయి. స్వేచ్ఛగా చేతులు వెనుకకు విరిచాడు. నారాయణను, సలీంకు అవిధంగానే విడగొట్టాడు. ముగ్గురికీ బంధవిముక్తి అయ్యేటప్పటికి పావుగంటపైగా పట్టింది. బయట అడుగుల చప్పుడయింది. ధర్మయ్య భయంతో వీరివైపు చూశాడు. భయపడవద్దని సైగచేసి, ముగ్గురు మంచాల కిందకు దూరారు. అడుగుల చప్పుడూ, మనుషుల మాటల చప్పుడూ దగ్గరవుతున్నకొద్దీ వీరి గుండెలు కొట్టుకుంటున్నాయి విపరీతంగా. ఏదో మాట్లాడుకుంటూ వాళ్ళుదూరంకావడంతో మంచాలకింద నుండి లేచారు.




"మేం వెళ్తాం ధర్మయ్యగారూ! మీమేలు మరచిపోలేం! భవిష్యత్తులో మళ్ళీ కలుద్దాం?" అన్నాడు పోతాలు ముందుకుసాగుతూ.

నారాయణ పగిలిన సంకెళ్ళను చేతికి తీసుకున్నాడు. తలుపు తెరిచి బయటకు కదిలారు. మళ్ళీ అడుగుల చప్పుడు కావడంతో తొందరగా దగ్గరలోవున్న చెట్టుకిందకు పరుగెత్తారు. వచ్చినవాళ్ళు పోలీసులని తలుపుగుండా వస్తున్న వెలుతుర్లో తెలుసుకున్నారు. తలుపు మూయబోతున్న ధర్మయ్య దగ్గరకు వాళ్ళువచ్చి వివరాలు ఏవో అడిగారు. ముగ్గురూ అటేచూస్తూ నిలబడ్డారు. ధర్మయ్య వారికి ఏదో చెబుతున్నాడు. పదిమంది పోలీసులు లోపలకు వెళ్ళడం, ఆ తర్వాత ఎవరినో కొట్టినట్లు శబ్దం, పోలీసులు కొందరు బయటకు పరుగెత్తడం చూశారు. చెట్టుకు ఒక పక్కగా బావి గుంటవుంది. నెమ్మదిగా గుంటలోకి జారారు. పోలీసులు గ్రామాన్ని కమ్మేస్తారు. తాము ఇప్పుడు లేచిపోవడం మంచిదికాదు. ఎందరు వచ్చారో వారికి తెలియదు.

మరికొంతసేపటిలో ధర్మయ్యను తన్నుతూ పోలీసులు తీసుకెళ్ళడం, అతడి భార్య, కూతురూ ఏడుస్తూ అతనివెంట వెళ్ళడం చూశారు. పోతాలు ఊపిరిపీల్చి వదిలాడు. తమకొరకు ఒక కుటుంబం బలిఅవుతున్నది. వాళ్ళు తమవల్ల అపకారం జరుగుతుందేమోనని భయపడి సంకెళ్ళు తీశారు. కానీ పోలీసులవల్ల అపకారం జరిగింది. సంకెళ్ళు తీయకుంటే తామయినా వారిని ఏదోఒకటి చేసివెళ్ళేవారే. మరి తప్పించుకోవాలంటే తప్పదు.

"పోతాలు భాయ్!" అన్నాడు సలీం. అతణ్ణి గిల్లాడు పోతాలు నోరుమూసి. అటు తర్వాత ఎవ్వరూ చాలాసేపు మాట్లాడలేదు.

జనం రావడం, పోవడంతెలుస్తోంది, పోలీసులు కొందరు అటువచ్చినా తమ దగ్గరివరకూ ఎవరూ రాలేదు. ఆ చిమ్మ చీకట్లో ఎంతసేపు గడిపారో వారికే తెలియదు. కోడి కూతతో లేచి కూర్చున్నాడు పోతాలు. అతడితోపాటు మిగిలిన ఇద్దరూ చుట్టూ ఎవరూలేరని శబ్దాలద్వారా చూపుద్వారా నిర్ణయించుకున్న తర్వాతలేచి చెట్లుదాటి వచ్చారు. మరి రెండిళ్ళుదాటితే గ్రామందాటినట్లే. ఆ చిమ్మచీకట్లో రెండిళ్ళు దాటడానికి వారికి పావుగంట పట్టింది. ప్రతి అడుగువేసేటప్పుడూ చూసి, చూసి జాగ్రత్త పడ్డారు. ఊరుదాటారు. చెరువు కట్ట ఎక్కారు. కట్టకిందవున్న ఊరు మంచి నిద్రలోవుంది. ఇళ్ళలోని దీపాలు, బయటకుకొన్ని కనిపిస్తూ మిణుకుమిణుకుమంటున్నాయి.

కట్టఎక్కి ఊపిరి పీల్చిన ముగ్గురూ, కట్టవెంట ముందుకుసాగారు.

"అతన్ని ఏం చేస్తారో?" అన్నాడు సలీం చిన్నగా.

"మన బదులు అతన్ని జైల్లో పడేయవచ్చు"

"అతని భార్యాబిడ్డల గతేమిటి? మనం వారికి ఏం సహాయం చేయలేమా?"

నారాయణ గదిమాడు- "నోరు ముయ్యరాబే! ముందు నీకు నీవు సహాయం చేసుకో! ఆతర్వాత వారిని గురించి ఆలోచిద్దువు గాని."

సలీం మాట్లాడలేదు. జనార్దన్ చావకుంటే, అతని బదులు తాము ఎవరో ఒకరు చావక తప్పదు ఆ గుండు దెబ్బకు. తమను మిగిలించి జనార్దన్ చచ్చాడు. అలాగే తాము మిగలాలంటే ఇంకా ఎందరు ఎన్ని దెబ్బలు తింటారో?

ఒకసారి ఇంటిదగ్గరవాళ్ళను మననం చేసుకున్నాడు. తాను నిజాయితీగా బతికాడు. కష్టంచేసి ఏ పూటకాపూట తన భార్యనూ, కొడుకునూ పోషించాడు. వాళ్ళు ఈరోజు ఎంత అనాథలుగా మారిపోయారో ఎవరు చూశారు? ఈ ధర్మయ్య భార్యాబిడ్డ లాంటివాళ్ళే తన భార్యా పిల్లలు. ఒకరు దెబ్బతింటే వారితోపాటు వారి కుటుంబాలూ పతనం కావల్సిందేనా?

చెరువులో 'దబ్' మన్న చప్పుడుతో ఉలిక్కిపడ్డాడు. వాళ్ళు విపరీతమైన ఆలోచనలో వున్నారేమో, ఆ శబ్దానికి వారు భయకంపితులయి, నిల్చున్నచోట నిలబడిపోయారు. అతర్వాత శబ్దం వినరాలేదు. కానీ తుప్పలు కదిలినట్టయింది. పోతాలు కట్టవెంట పరుగు తీసుకున్నాడు. అతడి వెంట మిగిలిన ఇద్దరూ కొద్ది దూరం వెళ్ళేసరికి, బాటకట్ట కిందగా సాగింది.

ఒగరుస్తూ, ఆయాసంగా నిలబడ్డ పోతాలు ను చూసి "ఎందుకు పరుగెత్తటం?" అన్నాడు నారాయణ.

"ఏమో! ఆ తుప్పల్లో పోలీసులుంటే మన ల్ని వెంటాడతారు. ఆవిధంగా దొరికిపోవచ్చు. మనమున్న పరిస్థితిలో గడ్డి మొక్కను కూడా నమ్మలేం" అన్నాడు పోతాలు!

పరుగెత్తడంవల్ల ఆయాసంవచ్చినా ఆగ కుండా దారిపట్టారు. చెరువు దూరంకాసా గింది. తూర్పున మసక చీకట్లు అప్పుడప్పుడే విచ్చుకుంటున్నాయి. దారి బోడి కొండలవెంట సాగిపోతూనేవుంది.

"ఈ కొండలకు అంతంలేదా?" అన్నాడు సలీం.

"ఏమో... ఎవడు చూశాడు? ఈ ప్రాంతం మనకు తెలియదుగదా"

తర్వాత ఎవరూ మాట్లాడలేదు. తెల్లారేసరి కి కొండలోయలలోకి సాగారు. పగలు బయటతి రగడం ద్వారా ఆపదలు ఎదురుకావచ్చు. కనీసం రెండు మూడురోజులు పోలీసులు తీవ్రంగా గాలిస్తారు. ఆ తర్వాత వాళ్లూ చప్పబ డతారు. అంటే కనీసం రెండుమూడురోజులు తాము జాగ్రత్తలో వుండాలని నిశ్చయించుకు న్నారు.

లోకల్ పోలీసువర్గాలు రాత్రి దాడికి ఎప్పు డూ సిద్ధపడరు. వారికి పగలయితేనే ఉత్సాహం. ఎలాంటి ఎదురుదెబ్బా లేకుండా తిరిగిరావచ్చు. రాత్రి దాడులవల్ల ప్రాణానికి తెగించే వ్యక్తులతో చెలగాటమాడి ప్రాణాలమీ దకు తెచ్చుకోడానికి వాళ్లకు ఇష్టం వుండదు.

రాత్రి గడిచింది. తెల్లారకముందే వ్యాన్లలో పోలీసులు చేరారు. సూపరింటెంట్ కొరకు ఎదురుచూస్తున్నారు. ఇన్‌స్పెక్టరుతో సూప రింటెంట్ చర్చిస్తూ కూర్చున్నారు.

"ఎటువైపునుండి దాడిచేస్తే బాగుంటుంది?" అడిగాడు సూపరింటెంట్.

"ఆ కొండగుట్టలు ఎటుచూసినా మూడు కిలోమీటర్లదూరం వున్నాయి. వాటిమధ్య లోయలూ, చిన్నవాగు ప్రవహిస్తుంటుంది. మధ్యన అక్కడక్కడ గిరిజన తండాలున్నాయి. ఒకవైపునుంచి వెతుక్కుంటూ వెళ్తే వారిని పట్టడం పెద్ద సమస్యకాదు" వివరించాడు మ్యాప్ చూపిస్తూ.

ఇన్‌స్పెక్టర్ నాయకత్వం కింద మూడు వ్యా న్లూ, ఒక జీపు కదిలాయి. మొత్తం నలభై మంది పోలీసులూ, వారికి నాయకత్వం వహించే అయిదుగురు సబ్‌ఇన్‌స్పెక్టర్లూ. ముగ్గుర్నీ పట్టడానికి వారు దీక్షతో ముందుకు సాగారు.

పొద్దుపొడిచేలోగానే కొండదాపుకు చేరారు రాత్రి ఏ గ్రామంనుండి ఖైదీలు పారిపోయారో, ఆ గ్రామం వైపునుండే వెతకడానికి నిర్ణ యించుకున్నారు. ఇన్‌స్పెక్టరు అంచనాప్ర కారం, ఖైదీలు పదికిలోమీటర్ల దూరంకంటే ముందుకు పోయివుండరు. అటువైపు రాత్రి నుండే కావలావుంది కనుక వారు మైదానమా ర్గంలో పోనేపోరు. వారికి రక్షణ కల్పించేవి కొండలు! కాబట్టి కనుమగుండా వ్యాన్లని పోని వ్వమని ఆదేశించాడు.

తెల్లవారుఝామున కొండలోయలలోకి దారితీ సిన ముగ్గురూ కొంతసేపూ పచ్చగడ్డిమీద పడుకున్నారు. వారి కళ్లు మూతలుపడటంలే దు. తెల్లారితే పోలీసు వలయం బిగిస్తారు. తప్పించుకోడానికి అవకాశం ఇవ్వరు. చంపడా నికైనా సిద్ధపడతారేగానీ, పారిపోనివ్వరు. మై దానప్రాంతంలో సులభంగా బయటపడవల సివస్తుంది. మరి ఈ కొండల్లో తిండిలేకుండా ఎన్నిరోజులు పడివుంటారు? తండాలలోనికి వెళ్తే వారు పట్టించరన్న నమ్మకం ఏమిటి? వారి ఆలోచనలు అనంతంగా సాగిపోతూనే వున్నాయి.

సలీం లేచి ఒళ్లు విరుచుకున్నాడు. చెట్ల మీద పక్షులు ఆహారంకొరకు పరుగు తీస్తు న్నాయి. అతని కడుపు తిండిలేకుండా మండి పోతున్నది. అతన్ని చూసి పోతాలు కూడా లేచి కూర్చున్నాడు.

"ఏదో ఒకవైపు కాలుసాగించాలి" అన్నాడు సలీం. మిగిలిన ఇద్దరూ తలలు వూపారు.

దగ్గరలో వాగు పారుతున్నది. లోతులేని నీళ్లు రాళ్లని కొట్టుకుంటూ శబ్దం చేస్తున్నాయి. వారు నిలబడివుండగానే కొండల్లో మోటార్ల శబ్దం వినిపించింది. ముగ్గురూ వులిక్కిపడి చెవులు రిక్కించి విన్నారు. వెంటాడటం

# చతుర విపుల

## అభినందనలు

పత్రికల అమ్మకాలు అభివృద్ధి చెందుతున్నాయనడానికి పెరుగుతున్న పాఠకుల ఆదరణే నిదర్శనం. గతకొద్ది నెలలు నుండి విపుల, చతురల అమ్మకాలు గణనీయంగా పెరుగుతు న్నాయి.

పాఠకుల అభిరుచులకు అనుగుణంగా పత్రికలను మరింత నూతనత్వంతో ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలని సంకల్పించాం.

లక్ష రూపాయల బహుమతులతో అనితరసాధ్యంగా భారీయెత్తున కథల/ నవలల పోటీ నిర్వహించిన సంగతి మీకు విదితమే.

1986 జనవరి- జూన్ పిరియడ్‌లో ఆడిట్‌బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్‌వారి సర్టిఫికెట్ ప్రకారం ఇతర మాసపత్రికలకన్నా దాదాపు రెట్టింపుకు పైగా అమ్మకాలతో 'చతుర' అత్యధిక సర్క్యులేషన్‌గల మాసపత్రికగాను, దాని తర్వాత దాదాపు 1½ రెట్లు అమ్మకాలతో 'విపుల' అధిక సర్క్యులేషన్ గల మాసపత్రికగానూ ప్రకటింపబడ్డాయి.

ఫిబ్రవరి నెల విపుల, చతుర జన్మదిన సంచికల నుండీ బహుమతి పొందిన కథలు, నవలలు ప్రచురితమవుతున్నాయి. నవలలు, కథల పోటీ రచయిత(త్రు)లను ఎంత ఆకర్షించిందో అంతకు మించి పాఠకులను ఆకట్టుకున్నదనడానికి అసంఖ్యాకంగా మా కార్యాలయానికి వస్తున్న పాఠకుల ఉత్తరాలే తార్కాణం.

జంట మాసపత్రికలయిన విపుల, చతుర పదవ వసంతంలో అడుగుపెట్టిన శుభసందర్భంలో పత్రికలను మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతున్నాం. పాఠకుల కోరిక మేరకు మరిన్ని కొత్త శీర్షికలు ప్రవేశపెట్టబోతున్నాం.

పత్రికలను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సదా మీ ఆదరాభిమానాలు కోరుతున్నాం.

ఆరంభమయిందనుకున్నారు. లోయవెంట పరుగుఅందుకున్నారు. వాళ్ల కాళ్లశబ్దం వారికే భయంకరంగా వినిపిస్తున్నది. అడ్డువస్తున్న ముళ్లచెట్లను లెక్కచేయకుండా పరుగెత్తుతూనే వున్నారు. ముళ్లు గీరుకుని ఒళ్లంతా వుండులా తయారవుతున్నది. దాదాపు అర్థకిలోమీటరు దూరం పరుగెత్తి నిలబడితే ఎదురుగా లోయగుండానే వ్యాను శబ్దం విన్పించడంతో బెంబేలెత్తిపోయారు.

''మనం మైదానంలోపడి పారిపోయి వుంటేనే మంచిదేమో'' అన్నాడు సలీం.

''అదేంకాదు. మైదానమంతా పోలీసువలయం ఏర్పడేవుంటుంది. ఈ కొండలే మనకు రక్షణ ఇవ్వాలి. ఈ తుప్పల్లో ఎక్కడ దాక్కున్నా పట్టుకోలేరు''

సలీం తలవిదిలించాడు. ''కొండల్లో సోదా చేయడానికి బయలుదేరారంటే, వాళ్లు చుట్టూ ముట్టడిచేసే వుంటారు''

దూరంగా ఎర్రటోపీలు కన్పించాయి. ముగ్గురూ బోర్లబడ్డారు రాళ్లమీద. తుప్పల్ని అడ్డు చేసుకుని పోలీసులవైపు చూస్తున్నారు. దాదాపు అయిదుగురు పోలీసులు. తుపాకులు సిద్ధంగా పెట్టుకుని ముందుకు చూస్తూ సాగుతున్నారు. వారు నడుస్తున్న నడకనుబట్టి చూస్తే, ఎంతో జాగ్రత్తగా చుట్టూ చూసుకుంటున్నట్లే! సలీం మాట్లాడబోతే పోతాలు అతడి నోరు నొక్కాడు. వారి ఊపిరి వారికి భారంగా వుంది. నారాయణ పోతాలును చేతితో పొడిచాడు. పోతాలు అతనివైపు తిరుగుతూనే రెండోవైపు చూపించాడు. రెండోవైపు నుండి కూడా పోలీసులు కొందరు వస్తున్నారు. ప్రతి లోయలోనూ జాగ్రత్తగా వెతకడానికే వాళ్లు నిశ్చయించుకున్నట్లు వీరికి అర్థమయింది. రెండు వైపుల నుండీ వస్తే తాము తప్పకుండా బయటపడక తప్పదు.

పోతాలు ఇద్దరివైపూ చూసి ''కొండపైకి పారిపోదాం'' అంటూ లేచి జవాబుకు ఎదురు చూడకుండా పరుగు లంకించుకున్నాడు.

అతనితోపాటు ఇద్దరూ సాగారు. కొండల మీద పెద్ద చెట్లు లేవు. అన్నీ తుప్పలే... ముళ్ల తుప్పలు! రాళ్లను తన్నుకుంటూ పైకి పరుగెత్తుతున్న వీరిని పోలీసులు చూశారు. ఆ పోలీసులు అందరూ ఒకేసారి పెద్దగా కేకలేశారు. వారి కేకల్ని వినడానికిగానీ, విని నిలబడటానికిగానీ వీళ్లు సిద్ధపడలేదు. పరుగు సాగిస్తూనే వున్నారు. సబ్‌ఇన్‌స్పెక్టర్ల ఆదేశంతో పోలీసులు కొండ ఎక్కడం సాగించారు. కాల్పడానికి వారు సిద్ధపడటంలేదు. కిందనుండి పైకికాలిస్తే ఆ గుండు వారిని అందుకోవడం కష్టం! వృథాగా తూటాలు నష్టం! అందుకే వారిని అందుకోడానికి పరుగెత్తసాగారు. వీరి పరుగులో రాళ్లు కిందకు దొర్లి విపరీతంగా శబ్దం చేస్తున్నాయి. కుంకుడుకాయలు, తేనెకొరకు కొండలవైపుసాగిన చెంచులు, ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు. ఎగరొప్పుతో నిలబడ్డాడు పోతాలు! ఆపాటికి అతని కాళ్లనుండి రక్తం ప్రవహిస్తున్నది. గుడ్డలు పీలికలయ్యాయి! చేతులు పుండ్లు పడ్డాయి. అరికాళ్లు పగిలిపోయాయి. మిగిలిన ఇద్దరి పరిస్థితీ అంతే! మాట్లాడలేకుండా నిలబడి వగరుస్తున్నారు. నారాయణ కళ్లనుండి నీరు కారుతున్నది. తాము దొరికిపోతామేమోనని వాళ్లు భయపడుతున్నారు.

కిందనుండి వస్తున్న పోలీసులు కేకలేస్తూ నిలబడమని హెచ్చరిస్తున్నారు. ''అనవసరంగా ఛస్తారు నిలబడండి'' అంటున్నాడు ఇన్‌స్పెక్టరు.

వారి మాటలు రాళ్ళ లొడలొడలో వీళ్ళకు సన్నగా విన్పిస్తున్నాయి. అయినా వీళ్ళు దొరకడానికి సిద్ధంగా లేరు. మళ్ళీ పరుగెత్తడం ఆరంభించారు. కొండపైకి ఎక్కారు. ఇక కిందికి దిగాలా? లేకుంటే పైన కొమ్ము వెంటనే పరుగెత్తాలా? ఒక్కక్షణం ఆలోచించాడు పోతాలు. కొండ దిగడం ఆరంభిస్తే పోలీసులు కొండదిగుతూ కాల్పులు సాగిస్తారు. గుండు కిందకు విసురుగా వస్తుంది గనుక ఎంతదూరంలోవున్నా తాము పడిపోక తప్పదు. కనీసం తుపాకీరేంజికి అందనంతదూరంలో కొండకొమ్ము వెంటే పరుగెత్తాలనుకున్నాడు. ఇద్దర్నీ హెచ్చరించి, కొండపైన పారిపోవడం ఆరంభించాడు. కొండపైకి వెళ్ళిన పోలీసులు వగరుస్తూ నిలబడ్డారు. ఇంటిదగ్గర తిన్న తిండి కొండపైకి వెళ్ళడానికి సరిపడింది. అక్కడినుండి వారి వెంటబడటం సమస్యగా




ఉంది. వాళ్ళా... ప్రాణాలకు తెగించి రక్తం కారుతున్నా పరుగెత్తుతున్నారు. పోలీసులకు కూడా పట్టీలు చినిగినా ఇంకా రక్తంకారడంలేదు. ఇన్‌స్పెక్టర్ ఆదేశంతో పరుగెత్తక తప్పటంలేదు. అందరికంటే ముందు ఇన్‌స్పెక్టర్ పరుగెడుతున్నాడు. వాళ్ళు ఎలాగూ ప్రాణాలతో దొరకరు. కాల్చివేయడమే మార్గమని అతడి ఉద్దేశం.

పోలీసులు దగ్గర కావడంతో వెనకున్న నారాయణ, ఒకవైపు కొండవాలుకు దిగాడు. అతన్ని చూసిన పోతాలు తాను మరోవైపువాలుకు సాగాడు. సలీం ముందుకే పరుగెత్తాడు. ఎవరి తోవవాళ్ళు చూసుకున్నారు. పోతాలు వాలు వెంట పరుగెత్తి పోలీసులు ఎటు వెళ్తున్నదీ చూడటానికి ఒక గుబురు తీగల్ని ఆధారం చేసుకున్నాడు. పోలీసులు, కొందరు అటు వాలువైపు దిగుతున్నారు. మరికొందరు సలీంవైపు పరుగెడుతున్నారు తన వైపు ఎవరూ రావడంలేదు. తనను వాళ్ళు బహుశా చూసి ఉండకపోవచ్చు. ఈ వాలు వెంటకిందికి దిగితే మైదానం చేరవచ్చు. పచ్చని పొలాలలో పడిపోవడం మినహా మార్గంలేదు. మరికొంత సేపు సవ్వడికొరకువేచి చూస్తూ బండమీద కూర్చున్నాడు. అతడి కళ్ళు నిద్రలేక ఎర్రగా మండుతున్నాయి. ఆకలితో కడుపు దహించుకుపోతున్నది. శరీరం రక్తంతో ఓడుతున్నది.

'ఢన్'మంటూ కొండమోగింది. పోతాలు గుండె పగిలినట్లయింది. ఎవరిమీదనో కాల్పులు ఆరంభమయ్యాయి. బహుశా నారాయణ మీదనే కావచ్చు. దిగువ వాలుమీద సులభంగా దొరికిపోతాడు. మరికొద్ది నిమిషాలలో ఏడెనిమిదిసార్లు మోగాయి. పోతాలు లేచి ఒళ్ళు విరుచుకున్నాడు. అక్కడ నిలబడితే ఇటుతిరిగినా తిరుగుతారు. కిందకి పరుగు లంకించుకున్నాడు. అతనికి సమయం కల్సి వచ్చింది. పోలీసులు అటువారిద్దరివైపే ప్రయత్నాలు చేస్తున్నారుగానీ, ఇటురాలేదు. పోతాలుకూడా అటువైపే ఉంటాడని వేటాడుతూవుండవచ్చు.

అక్కడనుండి పారిపోయిన పోతాలు, రాత్రి ఏ చెరువు కట్టమీదుగా నడిచివచ్చారో, అదే చెరువు కట్టమీదకు తిరిగి వచ్చాడు. కట్టదిగి తూర్పువైపువెళ్తే అంతాపచ్చని పొలం, కట్టకు కిందగా పోలీసు వ్యాను కనిపిస్తున్నది. కట్ట వెంట నక్కినక్కి కొంతదూరం సాగాడు. అటు తర్వాత పోలీసువ్యాను మరుగునపడటంతోనే లేచి పొలాలగుండా పరుగు సాగించాడు.

దాదాపు మైలు దూరం పరుగెత్తిన తర్వాత వెనుతిరిగి చూశాడు. కొండమీద పోలీసులు కనిపిస్తున్నారు. వాళ్ళు ఒకచోట కాకుండా విడివిడిగా వెతుకుతున్నారు. అంటే తన కొరకేనన్నమాట. వ్యానువద్ద ఎవడయినా పోలీసు వుండి తనను చూస్తే వాళ్ళకు చెప్పేస్తాడు. అటుతర్వాత వాళ్ళు ఇటుకూడా వస్తారు. చేను గట్టుమీద చిన్న గుడిసెవుంది. ఆ గుడిసెలోకి దూరి కూర్చున్నాడు. అదిరిపోతున్న గుండె మీద చేతితో రుద్దుకున్నాడు. శరీరమంతా వణుకు ఆరంభమయింది. కళ్ళనుండి నీళ్లు కారుతున్నాయి. పదిమంది కలిసి జైలుకు వస్తే అందులో చచ్చింది ఎందరో? బతికింది ఎందరో? ఇప్పుడు బయట స్వేచ్ఛగా మిగిలింది తాను ఒక్కడే. జనార్ధన్ తన కళ్ళముందే రాలిపోయాడు. సలీం, నారాయణ ఇప్పుడు రాలిపోయినట్లే. మిగిలిన తను మాత్రం ఎంత దూరం పోగలడు? ఏ స్వేచ్ఛకొరకయితే తాను పారిపోయాడో, ఆ స్వేచ్ఛ అనుభవించడం సాధ్యంకాదా?

ముంతలో ఉన్న నీళ్ళను కడుపునిండా తాగాడు. అవి తనకు ఆహారం! ఊపిరి పీల్చి లేచాడు. గుడిసె బయటకు వచ్చి నిలబడ్డాడు. కొండమీద పోలీసులు కనిపించడంలేదు. తనవైపు వస్తున్నారో లేదో తెలుసుకోడానికి వీలులేదు. పత్తిపైర్లు, జొన్న పైర్లు అడ్డంగా ఉన్నాయి. వాళ్ళు తనను వెంటాడితే దొరికిపోతాడు. వెంటనే వీలున్నంతవరకూ పొద్దుగుంకేటప్పటికి పారిపోవడమే మార్గం. చేలగట్ల వెంటపడి పరుగెత్తడం ఆరంభించాడు. పొలంలో ఎక్కడయినా మనిషి కనబడితే ఆగి నిదానంగా నడవడం, ఆ మనిషి కనుమరుగవుతూనే పరుగెత్తడం, అతన్ని చూసిన ఒకరిద్దరు ఆశ్చర్యంతో నోరువెళ్ళబెట్టారు. రక్తం ఓడుతున్న శరీరం, పీలికలయిన గుడ్డలు, రేగిపోయిన తల! అతన్ని చూసి భయపడి పలకరించడంలేదు.



9

ఎంతదూరం, ఎంతసేపు నడిచాడో అతడికే అర్థంకాలేదు. ఒక జొన్నచేను గట్టుమీద పోలీసు ఎర్రటోపీ కనిపించేసరికి నిలిచిపోయాడు. జొన్న చేనుకి ఒకవైపు అతడు, మరోవైపు పోలీసులు వున్నారు. అంటే పోలీసులు తనను అనుసరిస్తూనే ఉన్నారన్నమాట. ఎందుకు అనుసరించరు? పొలాల్లో ఎందరో తనను చూస్తున్నారు. ప్రత్యేకంగా కనిపిస్తున్న తనను వాళ్ళు గుర్తుపెట్టుకుని వెంటపడే పోలీసులకు చెబుతూనే వుంటారు. పోలీసులు వెన్నంటటం పెద్ద సమస్యకాదు. సూర్యునివైపు చూశాడు. మరో రెండుగంటలకుకానీ, అస్తమించేటట్లులేడు. సూర్యుడు అస్తమిస్తే తాను కొంత నిలదొక్కుకోగలడు? లేకుంటే పోలీసులు కాల్చివేయవచ్చు. ఆ జొన్నచేనుగట్టు విడిచి, మరో పొలంలో అడ్డంపడ్డాడు పరుగెత్తుతూ! పోలీసులు కూడా చూసినట్లుంది. కేకలతో హెచ్చరించుకున్నారు. వాళ్ళుకూడా పొలంలో పరుగెత్తడం ఆరంభించారు.

కొద్దిదూరంలోనే జొన్నపొలం తేలిపోయి, పత్తి పొలం ఆరంభమయింది. ఆ బయలులో తాను పరుగెత్తితే సులభంగా దొరికిపోతాడు. పత్తిపొలంలో ఎవరో ఒక మనిషి పత్తితీస్తున్నది. ప్రత్తిపొలందాటితే జొన్నపొలం వస్తుంది. మరి అంతవరకూ పోలీసులు ఊరుకోరు! ఒక నిశ్చయానికి వచ్చినట్లు ఆమె దగ్గరగా పరుగెత్తాడు. మరికొద్ది నిముషాలలో పోలీసులు జొన్నపొలం దాటగలరు. ఈలోగా ఆమెద్వారా రక్షణ దొరికించుకోవాలని అతడి ఆరాటం! అతన్ని చూసి ఆమె ఆశ్చర్యంతో, నోటమాటరాక నిలబడింది. ఆమె స్థితిని అతడు చూడటంలేదు. ఆమె కాళ్ళమీదపడి కాళ్ళుపట్టుకున్నాడు. ఆమె వణుకుతున్నది కానీ, మాట్లాడలేదు.

"అమ్మా! నన్ను పోలీసులు తరుముతున్నారు. దొరికితే కాల్చేస్తారు. నువ్వే నన్ను రక్షించాలి. చంపినా, బతికించినా నీదే భారం!" కళ్ళనీళ్ళతో అర్థించాడు.

ఆమె జవాబివ్వలేదు. ఇచ్చేటంత ధైర్యం ఆమెకు లేదు.

పోలీసులు జొన్నపొలం బయటకు వస్తున్నట్లు శబ్దాలు వినిపిస్తున్నాయి. ఆమె దగ్గరికి వచ్చి తనను గురించి అడుగుతారు. ఆమె దగ్గర తాను దొరికితే తన పని అయిపోయినట్లే. ఎలాగూ చావకతప్పదు, చచ్చేటప్పుడు మంచీచెడూ ఆలోచించేదేమిటి? ఆమె రెండు కాళ్ళ మధ్యాదూరాడు. ఆమె కూడా అనాలోచితంగానే కాళ్ళు ఎడం చేసింది. రెండు కాళ్ళ మధ్య కూర్చుని, చీరను కిందికి జారవిడిచాడు. ముందు ఆమె నడుముకు పత్తి ఒడి వుంది. ఆమె కాళ్ళ మధ్య మనిషి వున్నట్లు గుర్తుపట్టడం కష్టం. పోలీసులు ఆమె మీద అనుమానపడితే తప్ప! అతని ఊహ అర్థమయినట్లు ఆమె వంగి పత్తి తీయడం ఆరంభించింది. పోలీసులు చుట్టూ చూశారు. ఆమె తప్ప మరెవ్వరూ కన్పించలేదు. ఆమె దగ్గరగా పరుగెత్తుకుంటూ వచ్చారు. వారి పరుగులకు పత్తి పుల్లలు విరిగిపోతున్నాయి.

ఇన్స్పెక్టరు ఆమె దగ్గరగా వచ్చి "ఏయ్! ఒక దొంగ ఇటు పరుగెత్తుకుంటూ వచ్చాడు... చూశావా?" అన్నాడు.

ఆమె ప్రత్తి తీయడం ఆపి, "ముఖం మీద నెత్తురు కారుతున్నది వాడేనా?" అనడిగింది.

"ఆ..." అన్నాడు ఇన్స్పెక్టరు చుట్టూచూస్తూ.

ఎదురుగానున్న జొన్న పొలంవైపు చూపించి, "కొంచెం కిందటే ఆ పొలంలోకి పరుగెత్తాడు" అంది నిబ్బరంగా.

ఇన్స్పెక్టరు పరుగుసాగించాడు. అతడితో పాటు పోలీసులు పరిగెత్తారు. దాదాపు పదినిముషాల వరకూ ఆమె తేరుకోలేకపోయింది. తాను ఏం చెప్పిందో, వాళ్ళు ఎందుకు వెళ్ళిపోయారో కూడా ఆమెకు అర్థంకాలేదు.

వాళ్ళేదో అడిగారు, తానేదో చెప్పింది. చెప్పా






లని చెప్పడంకాదు, నోటికి వచ్చింది చెప్పింది... పోతాలు ఆమె చీర తప్పించుకుని బయటకు వచ్చాడు.

కూర్చునే ఆమెకు మరోసారి నమస్కారం చేశాడు. "నా ప్రాణాలు కాపాడావు అవ్వా! నువ్వు ఆ మాట చెప్పకుంటే వాళ్ళు నా ప్రాణంతీసేవాళ్ళే!"

అతడి వైపు అప్పుడు తీరికగా చూసింది. కారిపోతున్న రక్తం చూసి "అయ్యయ్యో!" అంది నొచ్చుకుంటూ.

"ఎందుకు వెంటబడుతున్నారు?" అంది అతని వల్ల తనకు భయం లేదని నమ్మకం కలిగిన తర్వాత.

అతడు నిజం చెప్పలేదు. కల్పించి చెప్పాడు. నిజం చెప్పినా ఆమెకు అర్థంకాదు, కాకపోగా మరింత భయపెట్టినట్లవుతుంది.

"నాయనా! ఈ పోలీసులు యమకింకరులే! మొన్ననే ఎవరో మావూరిలో మీటింగు పెట్టారని మీదపడి కాల్చి ఇద్దర్ని చంపి, పదిమందిని పట్టుకుపోయారు. వాళ్ళను చూస్తేనే మాకు భయం! అందుకే నిన్ను గురించి చెప్పలేదు" అంది.

"నీ కాళ్ళమధ్య దూరినందుకు నన్ను

మన్నించవ్వా! అంతకంటే నాకు గత్యంతరంలేదు. తప్పే అయినా తప్పని పరిస్థితి'' అన్నాడు నెమ్మదిగా.

ఆమె బోసినోరు తెరిచింది. ''నా కొడుకుకూ, నీకూ తేడా లేదబ్బాయ్! వాడెంతో, ఇప్పుడు నువ్వూ అంతే! అయినా ముసలిదాన్ని! ఒక ప్రాణం నిలబెట్టడానికి నేనూ కారణమయినందుకు సంతోషిస్తున్నానేగానీ, అందుకు బాధపడటంలేదులే!''

పోతాలు లేచాడు. తాను ఎటువైపు నుంచి వచ్చాడో అటువైపే తిరిగిపోతే పోలీసు తాకిడి వుండదు. మరి కొంతసేపు పారిపోగలిగితే, పొద్దుగుంకుతుంది. ఆ తర్వాత పన్నెండు గంటలపాటు యధేచ్ఛావిహారం! పన్నెండు గంటలంటే కనీసం నలభైమైళ్ళు. అరవై కిలోమీటర్లు! అప్పటికీ తాను పోలీసువలయంలోనే ఉంటే అప్పటి స్థితి ఆలోచించుకోవచ్చు.

''బువ్వతిన్నావా?'' అంది ఆమె అతన్ని చూస్తూ. అతడు తల అడ్డంగా ఊపాడు.

ఆమె పత్తి ఒడివిడిచి కిందపెట్టింది.

''కూర్చో! పోలీసులు మళ్ళీ వచ్చారా... నిన్నూ నన్నూ చంపేస్తారు. మధ్యాహ్నం కూడు కొద్దిగా మిగిలి ఉన్నట్లుంది... తెస్తాను'' అంటూ ఆమె గట్టువైపు సాగింది. అక్కడే చెట్లకింద కూర్చున్నాడు. ముంతతోపాటు, చిన్న గిన్నెతో ఆమె తిరిగి వచ్చింది. ఆబగా ఆ గిన్నె అందుకున్నాడు. కానీ, అతని మనస్సు చివుక్కుమంది. సరిగ్గా రెండుసార్లు నోట్లోపెట్టుకోడానికి కూడా లేదా అన్నం! దొరికినదాన్నే తిని ముంతలో నీళ్ళు శరీరానికి ఎక్కించాడు.

ఆమె కాళ్ళు పట్టుకొని మరోసారి ధన్యవాదాలు చెప్పి, ముందుకు నడిచాడు. జొన్నపాలందాటి కందిపొలం వెంటసాగాడు. కంది పొలం గట్టుబాగా వెడల్పుగా, చాలామంది నడిచిన ప్రాంతంలా వుంది. ఈ తోవవెంటవెళ్తే ఊరురావచ్చు! పగలు ఊరిలోకి వెళ్తే కష్టం! చీకటిపడేదాకా ఇక్కడే ఉండాలనుకున్నాడు. కంది చెట్ల కిందపడుకున్నాడు, గట్టుకు దూరంగా. అంత తీవ్రమైన పరిస్థితిలో కూడా అతని శరీరాన్ని నిద్రకమ్మింది. అలసి గాయాలతో దెబ్బతిన్న అతడి శరీరం, చల్లని గాలికి ఊగుతున్న కందిచెట్ల కింద మగతలోపడింది.

అలా ఎంతోసేపు పడిఉన్నాడో! మెలకువవచ్చి కళ్ళు నులుముకుని కూర్చున్నాడు. చుట్టూ చీకటి. తలపైన కంది కాయలు కొట్టుకుంటున్నాయి. లేచి నిలబడి చుట్టూ చూశాడు. అడవి దోమలు అరవడం తప్ప ప్రశాంతంగా వుంది. ఎంత సమయమయిందీ అతడికి అంచనాలేదు. గట్టుదగ్గరకు వచ్చి, గట్టు వెంటవున్న బాటలో నడకసాగించాడు. దాదాపు పావుగంట తర్వాత గ్రామఛాయలు కన్పించాయి. ఒకరిద్దరు ఆడవాళ్ళు బయలుకు వచ్చినట్లుంది. వారి మాటలు వినిపిస్తున్నాయి. అది ఏ వూరో, ఏ ప్రాంతమో అతడికి తెలియదు. ఆ ప్రాంతాలలో జన్మలో అతడు అడుగుపెట్టలేదు. ఊరిలోనికి వెళ్తే, తనను చూస్తే గుర్తుపడతారు. ఈపాటికే పోలీసులు ఈ ప్రాంతమంతా ప్రచారం చేసి వుంటారు. గుర్తుపడితే పట్టి అప్పగిస్తారు. అందరూ మునలమ్మలాగా వుండరు. గ్రామంలోనికి వెళ్ళకుంటే ఎలా? కడుపు కాలిపోతున్నది. నాలుగు మెతుకులు సంపాదించుకోవాలి. ఎన్నడూ జోలెపట్టి ఎరుగడు. అవసరం తనది! జోలెపట్టి నాలుగిళ్ళ దగ్గర అడుక్కుంటే ఈ పూట తిండి తినవచ్చు. తిండితింటే కానీ నడక సాగించలేడు. నడకసాగకుంటే ఇక్కడే ఉండాలి. ఏ క్షణంలో ఎలా వుంటుందో ఇక్కడే వుంటే.

మాటలు మందగించిన తరువాత చిన్నగా గ్రామంలోనికి సాగాడు. చిమ్మచీకటి. కరెంటుకు నోచుకోని గ్రామమనుకున్నాడు. ముందుగా చిన్న చిన్న పూరిగుడిసెలు తగిలాయి. బహుశా వెలివేయబడిన వారి ఇళ్లు అయివుండవచ్చని అనుకున్నాడు.

ఒక ఇంటి ముందు నిలబడి ''అమ్మా'' అన్నాడు. రెండోసారి పిలిచినప్పుడు ఒకావిడ బయటకు వచ్చింది

''వెళ్ళు... వెళ్ళవయ్యా! తినడానికి మాకు తిండిలేదు. నీకెక్కడ తెచ్చిపెడతాం!'' అంది కసురుకుంటూ. అక్కడి నుండి పక్కఇంటి తలుపు వద్దకు అడుగువేశాడు.

ఆ ఇంటిఆవిడ చిన్నముద్ద అన్నం తెచ్చివేసింది చొక్కాగుడ్డమీద. దగ్గరగా వచ్చిన

ఆమె అతన్ని ఆశ్చర్యంగా చూసి ఒకడుగు వెనక్కివేసింది బెదురుగా. ఆమె బెదురును అతడు గుర్తించాడు. మరో ఇంటి ముందుకు సాగాడు. అన్నంపెట్టిన మనిషి, పక్కింటి మనిషితో ఏదో చెప్పడానికి వెళ్ళినట్లుందనుకున్నాడు పోతాలు. అంత బాధలోనూ చిన్నగా నవ్వుకున్నాడు. తనను గురించి ప్రచారమయ్యేలోగా నాలుగు ముద్దలు సంపాదించుకొని ఊరువిడవాలని చకచకా తిరిగాడు. అన్నం చాలానే వచ్చింది, కానీ కూర, పచ్చడి ఏదీరాలేదు. అక్కడి నుండి తిరిగి వచ్చిన తోవకే వచ్చాడు. ఊరివెలుపల బావి వద్ద అన్నంముందు పెట్టుకుని కూర్చున్నాడు. అది ఏం అన్నమో? ఎన్ని రకాల అన్నమో, వేడిదే, చద్దిదే, పులిసిపోయిందో అతడు గుర్తించడంలేదు. అందులో కారం ఏమీ తగలకున్నా ఆబగాతిని బావిలో దిగి, నీళ్ళు తాగాడు. అతడికి జనం అలికిడి వినిపించింది. ఏమో? గ్రామంలో ఈ ఆడవాళ్ళు చేసే ప్రచారాల వల్ల తన కొరకే ఎవరయినా వస్తున్నారేమోనని, అడ్డంగా చేలల్లోనికి పరుగెత్తాడు. కొంతదూరం పరుగెత్తేసరికి ఆయాసం వచ్చి గొంతు కూర్చున్నాడు. తిన్నఅన్నం వాంతిచేసుకున్నాడు. కళ్ళు తిరుగుతున్నాయి. లేచే ఓపికలేదు... శరీరం మత్తులో తేలుతున్నది. కళ్ళుమూశాడు.

తిరిగి కళ్ళు తెరిచేసరికి తెల్లారింది. సూర్యుడు అప్పుడే ప్రారంభిస్తున్నాడు దినజీవితాన్ని! దగ్గరలో కోళ్ళు, కుక్కలు అరుస్తున్నాయి. మనుషుల మాటలు కూడా వినబడుతున్నాయి. అంటే తాను ఊరికి చాలా దగ్గరగా ఉన్నాడన్నమాట. ఎవరయినా ఇప్పుడు తనని చూస్తే తన గతి అంతే!

నడవడానికి కాళ్ళు సాగడంలేదు. కడుపులో ఇంకా దేవుతూనే వుంది. శరీరం ఇంకా విశ్రాంతి కోరుతున్నది. కాలు ఎత్తిపెడితే పగిలిన పాదం నకనకమంటున్నది. తన పరిస్థితి చూసి ఏడ్పు వచ్చింది. పంటితో పెదిమలు కొరుకుతూ ఏడ్పు దిగమింగుకున్నాడు. ఇది ఏడ్చే సమయం కాదు. తాను ఎందుకు పారిపోయాడో అది సాధించిన తర్వాతే తీరికగా ఏడ్పులు! అంతవరకూ విశ్రాంతి, బాధల్ని పట్టించుకోకూడదు.

ఊరికి దూరంగా పొలాల్లో అడ్డంపడిసాగాడు. దాదాపు రెండుగంటలు దారీ తెన్నూ లేకుండా గుబురు పొలాలలో పడి పోతున్నాడు. తాను పారిపోయివిడిచిన కొండలు ఎత్తుగా తనకు కనిపిస్తున్నాయి. వాటికి వ్యతిరేక దిశవైపు తాను నడక సాగిస్తున్నాడు. కొంతదూరం నడిచాక ఒక పొలంగట్టున, అన్నం క్యారియరు కనిపించింది. చొక్కా, లుంగీ, పైపంచకూడా పక్కన వున్నాయి. మనిషి ఒకడు పత్తి పొలానికి మందు స్ప్రే చేస్తున్నాడు. ఒక్క నిముషం వాటివద్ద నిలబడ్డాడు. ఇవి తీసుకెళ్తే? తాను దొంగవుతాడు! దొంగతనం చేయడానికా ఇన్ని బాధలుపడింది? దొంగతనంతో బతకదలచుకుంటే, ఎంతో హాయిగా తన ఊరిలోనే బతకవచ్చు. ఇదంతా దేనికి...? కాని మరో నిముషంలో అతని మనస్సు మారింది. నీతులు చెప్పడం చాలా తేలిక! కానీ, ఆచరణలో మనిషికి అవసరమైన వస్తువులు అందుబాటులో వుండి, అలవికాని బాధల్లో ఉన్నప్పుడే ఎవరికైనా అసలు విషయం తెలుస్తుంది. ఇవి తనకు ప్రస్తుత పరిస్థితిలో ఉపయోగం! ఈ పూట తిండితింటే మరో రెండురోజులు తాను ప్రయాణం చేయవచ్చు. ఈ గుడ్డలు తొడుక్కుంటే, తాను నలుగురిలో తిరిగినాశరీరంమీద గాయాలు ఉన్నా ఎవడూ పట్టించుకోడు. ఇటువంటి అవకాశం తాను విడవలేడు. ఇది దొంగతనమే అనుకుంటే, సైకిల్ వ్యక్తిని తన్నడం, తోవలో వెళ్ళే మనుషులనితన్ని గుడ్డలు లాక్కోవడం అదే అవుతుంది! తాను కావాలని చేయటంలేదు. తప్పనిసరి పరిస్థితిలో, అదీ—ఇక ఎటూ గత్యంతరం లేకనే తీసుకుంటున్నాడు.

తనకు తాను నచ్చచెప్పుకున్నాక, గుడ్డలు చంకలో పెట్టుకుని, క్యారియర్ చేతికి తీసుకుని పరుగులంకించుకున్నాడు. గుబురు పొలంలోకి వెళ్ళి, పీలికలయిన గుడ్డల్ని విడిచి, వాటితో గీరుకున్న కోసుకున్న గాయాల్ని నెమ్మదిగా తుడిచాడు. తెచ్చిన గుడ్డలు తొడుక్కున్నాడు. క్యారియర్ చేతపట్టుకుని, మరికొంత దూరం వెళ్ళి ఒక బావి వద్ద కూర్చున్నాడు. ఒక్క పిసరుకూడా మిగిలించకుండా తిన్నాడు. క్యారియర్ కడిగి అక్కడే

పెట్టి, బావిగట్టున చతికిలబడ్డాడు.

సలీం, నారాయణ చంపబడినట్లేనా, లేక తనలానే తిరుగుతుంటారా? పెదవి విరిచాడు. వారిని పోలీసులు వెంటాడటం, కాల్చటం కళ్ళతో చూశాడు. ఇంకా వాళ్ళు బతికివుంటారని తనకు ఆశలేదు. ఒకవేళ బతికినా తాము మళ్ళీ కలుసుకోవడమూ సాధ్యంకాదు. చివరకు మిగిలింది తాను ఒక్కడే!

జైలులో అడుగుపెట్టినప్పటినుండీ జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే మననం చేసుకుంటున్నాడు. సబ్‌జైలర్ తమతో అలా ప్రవర్తించకుండా, నచ్చచెప్పగలిగి వుంటే, ఖైదీలందరికీ వారికివ్వవలసిన రేషన్ ఇచ్చి వుంటే, ఈ పోట్లాటలు ఏవీ వుండేవి కావు. సబ్‌జైలర్ చేస్తున్న పనులు, ఖైదీల మీద అతడి ఈసడింపు, బెదిరింపులూ, బాదటాలు అతని ప్రాణం హరించి చేశాయి. ఖైదీలంటే ఎవరు? అందరూ దొంగతనాలు చేసి వచ్చారా? కాదు... న్యాయసూత్రంలోని ప్రధానసూత్రం, — వందమంది అపరాధులు తప్పించుకున్నా సరే ఒక నిరపరాధికి శిక్ష పడకుండా చూడటం-! కానీ, వందమంది అపరాధులు తప్పించుకుంటున్నా అంతకు తగిన మంది నిరపరాధులు జైలుకు రావడం నేటి సూత్రంగా తయారయింది. జైలులో నిజమైన దొంగలూ, హంతకులూ ఉండవచ్చు. వాళ్ళు అసలు అలాఎందుకు చేశారు? అని ప్రశ్నించుకుంటే ఈ సమాజంలో వారు బతకడానికి అవకాశం లేకనే, సమాజం వారిని తొక్కడానికి ప్రయత్నించడంవల్లనే. పోనీ, వారు తప్పు చేశారు కాబట్టి అనుభవించుతున్నారనుకున్నా, ఏ తప్పూ చేయని వ్యక్తులు ఎందరో జైళ్లలో వున్నారు. పోలీసులకు కేసులు దొరకనప్పుడల్లా అమాయకుల్ని పట్టితేడం పరిపాటయింది. వారికి బెయిల్ ఇచ్చేవారుగానీ, వాదించే లాయర్లుగానీ లేకపోవడంవల్ల సులభంగా శిక్షపడుతుంది. మూగగా వాళ్ళు రోదిస్తూ అనుభవించాల్సిందే. పడుకోడానికి చోటు లేక దేవాలయం దగ్గర పడుకున్నవాడిని, దేవాలయం గంట దొంగిలించడానికి ప్రయత్నించాడని ఒక పోలీసు కేసుపెడితే, బీడీ తాగుతూ ఓ బడ్డీ కొట్టుదగ్గరో రాత్రిపూట నిలబడ్డ మనిషిని, ఆ బడ్డీ నిలువు దోపిడీ చేయడానికి అక్కడున్నాడని మరో పోలీసు కేసుపెడుతూ, ఒక బ్లేడు, చాకు, అగ్గిపెట్టె వాడి జేబులో వున్నట్లు హాజరుపరుస్తారు. బ్లేడు, చాకు, అగ్గిపెట్టెతో బడ్డీకొట్టు తెరవగలడా లేడా అని ఎవడాలోచించేది? దున్న ఈనిందంటే, దూడకు పాలు తాపమనే న్యాయాధీశులు, వాడి ముఖం చూడకుండా, మూడు నెలలో, ఆరు నెలలో శిక్ష వేస్తారు. ఇలాంటివారు ఎందరు అన్యాయంగా బలయిపోతున్నారు! ఇక విచారణలేక సంవత్సరాల తరబడీ సబ్‌జైళ్లలో, జైళ్లలోరిమాండ్ ఖైదీలుగా, ఏ తప్పూ చేయకున్నా ఎందరు పడివున్నారు? బయటి వారి సంసారాల గతేమిటి? ఇవన్నీ ఎవడూ ఆలోచించడు. పోలీసుల చేతిలో ఎవడయినా పడితే, వాడు నేరం చేసినట్లే సమాజం దృష్టిలో. నిజాన్ని సమాజం చూడటం లేదు. ఇక వాడికి నేరవృత్తి అంటకట్టి మెడపట్టి, సమాజంలో చీడపురుగుగా చిత్రించి బయటకు నెట్టడం జరుగుతుంది.

తన పనీ అంతే! తాము ఏం చేశారు? 'మేం బతకడానికి అవకాశం లేదు. బతుకడానికి అవకాశం కల్పించండి. మీ సిటీబస్సులు మీకిచ్చిన రూట్లలో తిప్పండి' అన్నారు. సిటీ బస్సు యజమానులకు మండుకొచ్చింది. 'రిక్షాలకు బాడుగలు సరిగ్గా దొరకడం లేదు. మీరు మాత్రం కిరాయి విపరీతంగా వసూలు చేస్తున్నారు. కిరాయి తగ్గించండి' అన్నారు. రిక్షా యజమానులకు పౌరుషం పొడుచుకు వచ్చింది. అంతే! రిక్షాలు విరుగ్గొట్టారని వీళ్ళు, బస్సుల మీద రాళ్ళేశారని వాళ్ళు కేసులుపెట్టి ఇరికించి దొంగసాక్ష్యాలు సృష్టించారు. ఫలితం జైలుకు రెండు సంవత్సరాలు అతిథులుగా బయలుదేరి వచ్చారు. 'స్వేచ్ఛగా బతుకుతున్నాం, ఒకరికి లొంగడమేమిటి?' అనుకుంటే, 'మీకు స్వేచ్ఛ ఇస్తే మేం చిప్ప తీసుకోవాల్సిందే' అన్నారు.

సరే! రెండు సంవత్సరాలూ కళ్ళు మూసుకుని కాలం గడిపి బయటకు వద్దామని ఇంత దూరం పోలీసుల వెంట వస్తే, వచ్చిరావడమే తగవు. బయట ఏ నిజాయితీకొరకు పోరాటం చేయాల్సివచ్చిందో, లోపలా అదే. బయట





ఎలాంటి వ్యక్తులున్నారో లోపలా అలాగే వున్నారు. నెలకు వేలరూపాయలు తీసుకునే ఆఫీసర్లు, నేరస్తులైన ఖైదీల ఆహారం తింటుంటే సహించనందుకు వాళ్ళు కక్కిన కోపానికి ప్రతిఫలం ఇది.

పక్కన అలికిడి కావడంతో పోతాలు తలతిప్పి చూశాడు తత్తరపాటుతో. ఉడుత ఒకటి అతన్ని చూస్తూ పారిపోయింది. అటువంటి పరిస్థితిలోనూ అతడికి నవ్వు వచ్చింది. ఉడుతలాంటి జీవికూడా స్వేచ్ఛగా తిరుగుతున్నది. తన స్వేచ్ఛకు అడ్డువచ్చిన తనవైపు మిర్రి మిర్రి చూస్తూపోతున్నది.

ఊపిరి పీల్చి వదిలాడు. ఏది యేమైనా తనకు కావలసింది స్వేచ్ఛ? స్వేచ్ఛగా రిక్షా తొక్కి, అదీ నిజాయితీగా బతికాడు. మిగిలిన వారి కొరకు స్వేచ్ఛగా బయట పోరాడాడు. తిరిగి జైలులోనూ పోరాడాడు. ఎవరు అణగతొక్కదలచినా తాను లొంగాల్సిన అవసరం లేదు. అవసరమయితే చావు కూడా స్వేచ్ఛగానే అనుభవించాలి. ఎవడి దయకొరకో ఎదురుచూసి బ్రతకడం కంటే, చస్తే మాత్రం ఏం?''

పొద్దు నడినెత్తి మీదకు వచ్చింది. లేచి నిలబడి బట్టలకంటుకున్న దుమ్ము దులుపుకున్నాడు. క్యారియర్ చేతికి తీసుకున్నాడు. కనిపించిన దారివెంట సాగాడు. ఏదారి ఎక్కడికిపోతుందో అతనికి తెలియదు. ఎవరిని అడగాలన్నా ఇంతకుముందు సంశయించాల్సి వచ్చేది. ఇప్పుడు గుడ్డలు బాగున్నాయి. ఎవరయినా ఎదురయితే అడిగి తోవ తెలుసుకోవాలనుకున్నాడు.

ఎదురుగా ఇద్దరు వ్యక్తులు వచ్చారు. ఇతని వైపు అనుమానంగానే చూస్తూ వెళ్తున్నారు.

''ఏ వూరికి వెళ్తున్నారు?'' అన్నాడు పోతాలు వారిని చూస్తూ.

''చాకలికొండ. నీవు ఏ వూరు వెళ్లాలి?'' అన్నారు ఇద్దరూ.

''ఎల్లారెడ్డి వెళ్లాలి. ఎంత దూరం వుంటుంది?''

ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ''ఎల్లారెడ్డి తోవ ఇది కాదు. ఇది బోదనం వెళ్తుంది. అయినా నడిచి ఎల్లారెడ్డి ఎన్నిరోజులు వెళ్తావు? అసలు ఇక్కడికి ఎట్లా వచ్చావు?''

వారి మాటలకు జవాబివ్వకుండా ముందుకు సాగాడు. బోదనమో, చీదనమో ఏదయితేనేం! ఏదో ఒక పట్టణం ముందు చేరితే తర్వాత చూసుకోవచ్చు. ఇలా పొలాలలో ఎంతకాలం తిరగడం! పోలీసులు ఈపాటికి తాను దొరకకపోవడం వల్ల వెనుకకు వెళ్లివుంటారు. ఇక తనను గురించి గాలించకపోవచ్చు. గాలించినా ఈ ప్రాంతం వైపు రారు. ఇద్దరూ కూడబలుక్కుంటూ వెనుతిరిగి చూస్తూ ముందుకు సాగారు.

మరికొంత దూరం తర్వాత ఒక గ్రామం కన్పించింది. గ్రామంలోనికి అడుగు పెట్టాడు. ఇళ్ల దగ్గర జనం పెద్దగా లేరు. అంతా పొలాలకు వెళ్లి వుండే సమయం. ముసలివారు, పిల్లలు ఎక్కువగా ఉన్నారు. 'ఆ క్యారియర్ ఎవరికయినా అమ్మి నాలుగు డబ్బులు సంపాదించుకుంటే?' అనుకున్నాడు. అది తన దగ్గర బరువే. విడువలేక తెస్తున్నాడు. ఓ యాభై రూపాయలు ఎవడయినా ఇస్తే బాగుంటుందనుకున్నాడు.

ఒక ఇంటి ముందు ఆగాడు. నడుం వంగిన ముసలతను పోతాలును చూసి ఏమన్నట్లుగా తల ఊపాడు.

''తాతా! నేను బోదనం వెళ్లాలి. ఛార్జీలకు డబ్బులు లేక నడిచి వస్తున్నాను. నా క్యారియర్ తీసుకొని కొంత డబ్బు ఇవ్వగలవా?'' అన్నాడు చూస్తూ.

ముసలతను బయటకు వచ్చాడు. అతని వైపు పైకీ, కిందకు చూస్తూ-

''ఈ క్యారియర్ నీకు ఎక్కడిది?'' అన్నాడు లోగొంతుకతో.

''నాదే! నడిచి బయలుదేరుతూ, అన్నం తెచ్చుకున్నాను.ఎంత దూరం నడవగలను?''

''ఇంటి దగ్గర డబ్బులు తెచ్చుకోవచ్చుగదా?''

''అదంతా పెద్ద కథలే! పోట్లాడి రావలసి

వచ్చింది.'' అన్నాడు నవ్వుతూ.

మునలతను క్యారియర్ చేతికి తీసుకొని ఆశ్చర్యంగా చూశాడు. దాన్ని అట్నుంచిటు రెండుసార్లు తిప్పి ''ఇది మా రామారావు క్యారియర్‌లాగుందే! ఉండు... చూపించి వస్తాను'' అంటూ తడబడే అడుగుల్తో పక్క ఇంటి వైపు కదిలాడు. పోతాలు గుండె మళ్లీ శరవేగంతో కొట్టుకోవడం ఆరంభమయింది. అన్నం తినిన తను అది పారేసి రాక తీసుకరావడం, అమ్మడానికి ప్రయత్నించడం ఎంత బుద్ధితక్కువో అర్థమయింది. అక్కడ ఉంటే తనను పట్టుకొని తన్నుతారు. ఆ తర్వాత పోలీసులకు పట్టిస్తారు. మునలాడు పక్క ఇంట్లోకి వెళ్లి కనుమరుగవుతూనే, వీధి వెంట పరుగు లంకించుకున్నాడు. అతని పరుగు చూసి పిల్లలు కేకలేస్తున్నారు. కుక్కలు మొరుగుతున్నాయి. ఊరు దాటేవరకూ ఆగలేదు.

ఊరి వెలుపల రచ్చబండ మీద కూర్చున్న కుర్రవాళ్లు పరుగెత్తుతున్న పోతాలును చూశారు. లేచి అడ్డు వచ్చి పట్టుకున్నారు. పోతాలు ఆయాసపడుతూ విడిపించుకోడానికి ఎంత గింజుకున్నా వారు విడిచిపెట్టలేదు. ఆలోగా వెంట పడుతూ వచ్చిన పిల్లలూ, మునలివారూ వచ్చి వారికి జరిగింది చెప్పారు. యువకులు ఆవేశంగా కొట్టారు. వారిలో ఒక వ్యక్తి అడ్డు వచ్చి యువకుల్నించి తప్పించాడు.

''జరిగిందేమిటి? ఎందుకు దొంగిలించావు?'' అడిగాడు అతడు.

పోతాలు ఇక దాచుకోలేదు. దాచుకున్నా వాళ్లు కొట్టి అయినా చెప్పించుకుంటారు. తన పరిస్థితి చూసి కనీసం జాలి వేస్తేనయినా ఇంతటితో విడుస్తారు.

జరిగింది వివరంగా మొదటి నుండీ చెప్పి, తల వంచుకున్నాడు.

అతన్ని అక్కడికి దగ్గర్లోనే ఉన్న ఒక ఇంటి వద్దకు తీసుకెళ్లారు. బండల మీద కూర్చోమన్నారు. ఎవరినో పిలుచుకు రమ్మని మనిషిని పంపారు. మరికొంతసేపట్లో తిరిగివచ్చి వాళ్లు వస్తున్నట్లు చెప్పాడా వ్యక్తి. పోతాలు ఆలోచిస్తున్నాడు. 'పొయ్యిలో తంతే పెంత లోకి వచ్చినట్లు' ఇంత తీవ్రంగా తప్పించుకోడానికి ఎన్నో బాధలుపడినా చివరకు చిన్న తప్పిదం వల్ల మళ్లీ దొరికాడు. ఆ క్యారియర్ అక్కడే పారేసి వచ్చి వుంటే... ఏమో? ఎలా చెప్పడం? అప్పుడు మరోవిధంగా దొరకవలసి వచ్చేదేమో? దొరికిన తర్వాత బాధపడి లాభం లేదు. వీళ్లు పోలీసులకు పట్టిస్తే తనను దారిలోనే కాల్చి పారేసిపోతారు.

తలకు తుండు చుట్టుకొని, పంచె పైకెగకట్టి, చుట్టతాగుతూ ఒకవ్యక్తి అక్కడకు వచ్చాడు. అందరివైపూ ఒకసారి చూసి, ''మీరంతా ఎందుకురా! వెళ్ళండి... వెళ్ళండి'' అన్నాడు. చాలామంది వెళ్ళిపోవడం ఆరంభించారు.

పొద్దు గుంకుతున్నది. జనం అప్పుడే పొలాల నుండి వస్తున్నారు. ఈ తతంగం తెలిసి చాలామంది వచ్చిపోతున్నారు.

''లోపలకుపోదాం రా!'' అన్నాడు వచ్చిన వ్యక్తి.

పోతాలును తీసుకుని నలుగురు యువకులు అతనితోపాటు లోపలకువెళ్ళారు.

మంచంవాల్చి ''కూర్చో'' అన్నాడు అతడు కూర్చుంటూ. పోతాలు నిలబడే ఉన్నాడు.

''కూర్చో ఇటు'' అన్నాడు అతడు మరోసారి పోతాలు వైపుచూసి.

పోతాలు కూర్చున్నాక- ''నువ్వు చెప్పిందంతా నిజమేనా?'' అన్నాడు. కళ్ళలోనికి చూస్తూ.

పోతాలు తలఊపాడు.

''మరోసారి చెప్పువింటాను.'' అన్నాడు.

పోతాలు చెప్పకతప్పలేదు. చేతికిచిక్కిన నాగుపాము చెప్పినట్లు ఆడాల్సిందే. అతను బరువుగా ఊపిరిపీల్చాడు. చుట్టవెలిగించి దమ్ములాగాడు. చుట్టవిదిలిస్తూ-

''స్వేచ్ఛగా బతకడమంటున్నావు! అసలు నీదృష్టిలో స్వేచ్ఛ అంటే ఏమిటబ్బాయి?'' అన్నాడు. పోతాలు ఒకసారి ఊపిరిపీల్చి వదిలాడు.

''స్వేచ్ఛగా బతకడమంటే ఒకరికి లొంగకుండా, ఒకరిమీద ఆధారపడకుండా నిజాయితీగా బతకడం. ఒకరికి చేతనయిన సహకారం నిజాయితీగా చేయడం! అదే నేను ఇంతవరకూ చేశాను''

"అయినా నువ్వు జైలుకెళ్ళావు. అక్కడా నీవు కోరుకున్న స్వేచ్ఛలేదు. ఆతర్వాత కూడా నీ కథమామూలే... అంతేనా?"

తలవూపాడు పోతాలు.

"అయితే నీ స్వేచ్ఛను హరించే శక్తి ఇంకేదో వుంది. ముందు దానినంగతి చూడాల్సి వుంది... ఒప్పుకుంటావా?"

పోతాలు తల ఊపాడు.

"ముందు సమాజానికి స్వేచ్ఛకావాలి. ఈ మొత్తం సమాజానికి స్వేచ్ఛలేకుండా నీవో, నేనో స్వేచ్ఛ అనుభవిద్దామంటే అసాధ్యం. సమాజానికి మొత్తానికి స్వేచ్ఛ లభించినపుడే నీకూ స్వేచ్ఛ లభిస్తుంది. ముందు దానికి స్వేచ్ఛ లభించేట్లు చూడు" తిరిగి అన్నాడు- "నాపేరు రాఘవయ్య! నేనూ స్వంత స్వేచ్ఛకొరకు ప్రయత్నించి, విసుగుపుట్టి అసలుకు మూలమేదో తెలుసుకున్నాను. నీవు చెప్పినకథ అబద్ధమనుకోవడంలేదు, ఉదయం పోలీసులు ఇక్కడికి వచ్చి వెళ్ళారుగనుక! నిన్నేదో పోలీసులకు పట్టించాలని మాకు ఆత్రుతాలేదు. నీ స్వేచ్ఛను నిలబెట్టుకుంటానంటే నీయిష్టం! వెళ్ళు! కానీ, నీ స్వేచ్ఛ, ఈ సమాజం పూర్తిస్వేచ్ఛ పొందినపుడే సాధ్యమని గుర్తుంచుకో!" అంటూ లేచాడు.

అక్కడున్న పదిమంది వైపు చూశాడు రాఘవయ్య! "ఇటువంటివాళ్లను పోలీసుల నోటిలోనికి పంపించడం మన ఉద్దేశం కాదుగదా! ఆకలయింది. క్యారియర్ కనిపించింది. తినడంలో తప్పేంలేదు. ఛార్జీలకు దాన్ని అమ్ముకోవడంలోనూ, ఆ పరిస్థితిలో అంతే మరి! అతడు ఏ స్వేచ్ఛనుగురించి చెబుతున్నాడో మనం చెప్పేదీ అదే అయినప్పుడు చేతనయిన సహాయం చేయడమే మంచిది. ఒక వందరూపాయలు చేతిలోపెట్టి, రోడ్డుమీదకు తీసుకెళ్ళి, బస్సు ఎక్కించండి. ఆతర్వాత ఆయన ఇష్టంవచ్చిన చోటుకు వెళ్లనీ!" అంటూ రాఘవయ్య లేచివెళ్ళిపోయాడు.

పోతాలు తన చెవులను, కళ్లనూ తను నమ్మలేకపోయాడు. తాను వింటున్నది కలలోనేమోననుకున్నాడు. తన బతుకు అయిపోయిందనుకున్నాడు. తనను పోలీసులకు పట్టింపేస్తారనుకున్నాడు. కానీ వాస్తవంలో వాళ్ళు తనను విడిపిస్తున్నారు. అదీ తనకు సహాయం చేసి మరీ వదులుతున్నారు. స్వేచ్ఛనుగురించి వివరాలు చెబుతున్నారు. ఎవరు వీళ్ళు?- ఆలోచిస్తున్నాడు.

ఆ పదిమందిలో కూడా మరికొందరు వెళ్లిపోయారు. ఒకవ్యక్తి వది పదిరూపాయల కాగితాలు తెచ్చి పోతాలు చేతిలో పెట్టాడు.

"అన్నం తిన్న తర్వాత కదుల్దాం! ఇక్కడికి అయిదు కిలోమీటర్లదూరంలో రోడ్డు వుంది. పదిగంటలదాకా బస్సులు తిరుగుతూనే వుంటాయి. నిన్ను బస్సు ఎక్కించివస్తాం!"

పోతాలు కృతజ్ఞతలు చెప్పాడు. ఏం మాట్లాడాలో అతనికి అర్థంకాలేదు.

మరో గంట తర్వాత పోతాలుతోపాటు ఇద్దరు తోడుగా బయలుదేరారు. రాఘవయ్యను కలిసి మాట్లాడివెళ్తానని పోతాలు అన్నా వాళ్ళు అంగీకరించలేదు. "ఆయన ఇక నీకు కన్పించడు... నీకు సమయం మించిపోతోంది" అన్నారు.

"ఆయన ఎవరు?" అన్నాడు పోతాలు ఆసక్తిగా.

"ఎవరయితే ఏం? నీకు స్వేచ్ఛ ప్రసాదించిన ఒకవ్యక్తి! ఆయన నీకు వ్యతిరేకంగా మాట్లాడకున్నా కనీసం నోరు మూసుకుని ఉన్నా ఈపాటికి పోలీసులు నిన్ను తీసుకుపోతూ వుండేవాళ్ళు! పోలీసులకు బదులు నీవెంట మేం ఉన్నామంటే అది ఆయన ఉద్దేశం! చెప్పాడుగా నీస్వేచ్ఛకూ, ఆయన స్వేచ్ఛకూ తేడా?"

పోతాలు తల ఊపాడు. "ఔను... నేను మెలిగిన సమాజంలో, పరిస్థితులలో అంతవరకే అర్థమయింది! ఇకముందు ఆయన చెప్పినట్లు నడుచుకుంటాను"

గంట తర్వాత తారురోడ్డు మీదకు వచ్చారు. మరోపావుగంటలో వచ్చిన బస్సు నిలిపి ఎక్కించారు. బస్సు కదలబోతుండగా కిందినుండి వాళ్ళు చెయ్యి ఊపారు. బదులుగా చెయ్యి ఊపి, ఊపిరి పీల్చి బరువుగా విడిచాడు.



# నా జీవితపు పనిలో దేవుని శక్తిచేత రక్షింపబడి స్వస్థ పరచబడితిని

1980 వ, సంవత్సరము వరకు నేను భక్తిహీనుడనై యుండి, చనిపోయినపుడు నిశ్చయముగా నరకమునకే పోయెడి వాడనని యెరుగుదును. నా బంధు మిత్రుల సమాధి కార్యక్రమములు జరుగుచున్నపుడు, ఈ సంగతి ఆలోచిస్తూండేవాడను. నేను నిజమైన దేవుని బిడ్డలను గౌరవిస్తూన్నప్పటికిని, దేవుడు నన్ను ప్రార్థనలోనికి నడిపించేవరకు ఈ అద్భుతమైన సమాధానము ఎలా పొందగలనో తెలియలేదు.

అపుడపుడు ఒక వాహనము ఎక్స్‌రే ఇన్‌స్టిట్యూట్ నుండి మే ముంటూన్న రీచెన్‌బాక్ అను గ్రామానికి వస్తూండేది. మేము "సైకలైన్ క్రీన్స్" తయారుచేయు కర్మాగారానికి కూడవచ్చి దర్శించాలని కోరాము. మా తోటి పనివారు, నేను నా భార్య నా పిల్లలు ఎక్స్‌రే పరీక్షలు చేయించు కొన్నాము.



కొన్ని రోజుల తర్వాత యిన్‌స్టిట్యూట్ వారు నన్ను పిలిచి, నా ఊపిరితిత్తులపై ఒక మచ్చ ఉన్నదనియు, వెంటనే మంచి వైద్యునిచే తరువాత చేయించుకొనవలసిన పరీక్షలు చేయించుకొని, తగిన చికిత్స తీసికొనవలసినదనియు, సలహా యిచ్చిరి. కొన్ని సం॥ల క్రితము నా తమ్ముడు యిలాగే ఈ కర్మాగారములో పనిచేస్తూ ఊపిరితిత్తుల కాన్సర్‌తో చనిపోయాడు. అతడూ నాలాగే పొగత్రాగేవాడు. అందుచేత నాకుకూడ అదే జబ్బు అనే భయం నన్ను పట్టుకొంది. ఈ ఊపిరితిత్తుల కాన్సర్ ఏ డాక్టరు బాగుచేయలేడనియు, దేవుని శక్తి మాత్రమే స్వస్థత యివ్వగలదనియు నా హృదయములో ఒప్పుదల కలిగింది.

నా స్వంత జీవితములోను, కుటుంబ సంబంధముగాను, వ్యాపారమందును, సమస్యలు ఎదురైనపుడు; నాయంతట నేనుగాని, యితరుల వలనగాని పరిష్కార మార్గము దొరుకనపుడు దేవునికి ప్రార్థన చేస్తూండేవాడను. నేను దేవునితో సమాధానముగా ఉండక పోయిననూ కీర్తన 50 : 15 లో "ఆపత్కాలమున నీవు నన్నుగూర్చి మొర పెట్టుము. నేను నిన్ను విడిపించెదను నీవు నన్ను మహిమపరచెదవు." అను వాగ్దానమును నమ్మినవాడనై ప్రార్థనచేసిన ప్రతిసారి ప్రభువు నా ప్రార్థన ఆలకించి, నాకు సహాయముచేస్తూండేవాడు. నా ఊపిరితిత్తులపై ఏర్పడిన మచ్చ విషయమై ఒక వారమంతా, దినమునకు 20 సార్లు 'ప్రభువా, నన్ను స్వస్థపరచుమని' బ్రతిమాలు కొంటిని. నా ప్రార్థనలో దేవుడు తన సేవచేయుదునని ప్రమాణము చేయుమని కోరగా, నేను ఏ (నీవు నన్ను స్వస్థపరచితే, అలాగే సేవ చేయగలను అను) షరతులేకుండా వాగ్దానము చేసితిని.

ఎక్స్‌రే యిన్‌స్టిట్యూట్ వారి సలహా మేరకు నేనొక వైద్యుని యొద్దకు వెళ్ళాను. ఆయన మరికొన్ని ఎక్స్‌రే పరీక్షలకొఱకు ఏర్పాట్లు చేసినాడు. మొదటి ఎక్స్‌రేలో తేటగ కనిపిస్తూన్న ఆ ఊపిరి తిత్తులపైని మచ్చ తరువాత తీసిన ఎక్స్‌రేలలో మటుమాయమైంది. నా ప్రార్థనలకు జవాబు దొరికినది. దేవుడు నన్ను స్వస్థ

పరచినాడు. నేను నా ప్రార్థనలను కొనసాగిస్తూ, ఆయన నన్ను స్వస్థపరచినందుకు గాను, కృతజ్ఞతాస్తుతులు చెల్లించాను. నేను ప్రార్థనయందు ఆయన సన్నిధి అనుభవింప గలిగాను. పరిశుద్ధ గ్రంథము యిలా చెప్పుచున్నది. యాకోబు 4 : 8 "దేవుని యొద్దకు రండి; అప్పుడాయన మీ యొద్దకు వచ్చును." నా పట్టుదలగల ప్రార్థనవలన యిది జరిగింది.

మరుసటి ఆదివారము నేను నా యింటి వెలుపల దేవుని సన్నిధి నిమిత్తమై ప్రార్థిస్తూండగా దేవునిశక్తి నాపై ఒక మేఘమువలె దట్టంగాదిగి, నన్ను భూమిమీద పడవేసి నట్టింది. ఆ మేఘములో ఒక ప్రకాశవంతమైన వెలుగు కనుపించి, నా దృష్టిని రెండు, మూడు మీటర్ల దూరము మట్టునకే పరిమితం చేసింది. కనురెప్ప పాటులో ఏదోవొక అద్భుతమైనది నాలో ప్రవేశించింది. దేవుడు నా కన్నుల యెదుట 'యేసు' అనుపేరు గొప్ప సువర్ణాక్షరాలతో వ్రాయబడి యున్నట్లు నాకు చూపాడు నాకు ఈ అద్భుతమైన అనుభవం కలిగాక ఏ అనుమానం లేకుండా యేసు నా హృదయంలోకి వచ్చాడు అని ఎరిగాను.



మొదటిసారిగా యేసు నాతో మాట్లాడుతూ "నీవు పొందిన దాని నిమిత్తమై దేవుని స్తుతించుము." అని చెప్పాడు. నేను నాయింటి నుండి స్కార్‌నాచ్టల్ వెళ్తూ, యేసునుబట్టి, నాకు దయచేసిన అద్భుతమైన అనుభవాలను బట్టి దేవుని స్తుతించాను. నేనంత ఘోరమైన పాపభారాన్ని మోస్తున్నానని ఎరుగనైతిని గాని ప్రభువు ఆ భారాన్ని నాపైనుండి ఎత్తివేశాడు.

నేను యింటికి తిరిగివచ్చేప్పుడు, ప్రతి విధమైన కీడునుండి నన్ను భద్రపరచుమనియు, నాకు కలిగిన యీ అనుభవముల నుండి సాతాను నన్ను దోచకుండునట్లు కాపాడుమనియు దేవుని అడిగితిని. తరువాత సాతాను ప్రయత్నించాడుగాని నాకు ప్రభువుయొక్క రక్తధారల భద్రత యున్నందున విజయము పొందలేక పోయాడు. యేసు ప్రభువు కల్వరి సిలువపై రక్తము చిందించి, చనిపోయి సాతానును ఓడించాడు. ఈ విషయము నిశ్చయముగానమ్మి ఎరిగియున్నాను.

ఈ అసాధారణమైన సంభవము జరిగిన నాట నుండి, నా హృదయము సమాధానముతోను, పొరలిపారే ఆనందముతోను ప్రభువు నన్నెన్నడును విడువడు, ఎడబాయడు అను నిశ్చయతతోను నిండియున్నది. నేను చనిపోయినపుడు నేను ప్రభువుతోనే యుందుననియు, పరలోకరాజ్యము నా బహుమానమనియు ఎరుగుదును. నిత్యజీవమును పొందుమార్గము మన హృదయములో యేసు ప్రభువును కలిగియుండుటయే! పరిశుద్ధ గ్రంథము యీ లాగున చెప్పుచున్నది. "దేవుడు మనకు నిత్యజీవము దయచేసెను. ఈ జీవము ఆయనకుమారుని యందున్నది. కుమారుని కలిగిన నిండు జీవముగలవాడే. దేవుని కుమారుని కలిగియుండనివాడు జీవము లేనివాడు."

యోహాను 5 : 11,12

పరిశుద్ధాత్మ నాకు బయలుపరచిన నా పాపము లన్నిటిని పశ్చాత్తాపముతో ఒప్పుకొని, ప్రతివిషయము చక్కపడినాను. వాగత జీవితములో నేనుచేసిన నా తప్పులన్ని క్షమించి

నట్లు ప్రభువు నాకు చూపాడు. ఈ భూమిమీద మనము తల్లిగర్భమున జన్మించాము, గాని పరలోకములో ప్రవేశించడానికి దేవుని ఆత్మ వలన పుట్టవలసియున్నాము. తిరిగి పుట్టుటను గూర్చిన అనుభవము, హృదయములోని పరిపాలన మారినట్లు; యేసుప్రభువు హృదయములోనికిరాగా, లోకసంబంధమైన ఆత్మ, ఆశలు తొలగి పోవలెను.

ఆదాము అవ్వలు పాపమునందు పడిపోయిన కారణముచేత, స్వభావ సిద్ధముగా మనుషులందరు వారి పడిపోయిన పాపజీవిత లక్షణములను పొందారు. గనుక మనము యేసు ప్రభువును మన హృదయములలో కలిగి యుండలేదు. అందుచేత మనము పాపపు కార్యములను చేసినందున, అవి మనలను దేవునికి దూరపర్చినవి, గనుక చచ్చినవారి వలె మనలను మనము పాపమునుండి విడిపించుకోడానికి శక్తిహీనులమై యున్నాము. ఈ కారణమునుబట్టి దేవుడు తనగొప్ప ప్రేమ చేత మనలను మన పాపములనుండి రక్షించుటకై తన ప్రియకుమారుడగు యేసుక్రీస్తు ప్రభువును మనకొరకు ప్రాయశ్చిత్తము చేసినాడు. యేసు మాత్రమే మానవుల పాపములను క్షమించగల దైవాధికారము కలిగి యున్నాడు. గనుకనే "నేనే మార్గమును, సత్యమును, జీవమును; నాద్వారానే తప్ప ఎవడును తండ్రియొద్దకురాడు." యోహాను 14 : 6. పేతురు యేసుప్రభువు విషయమై చెబుతూ– "ఈ నామముననే మనము రక్షణ పొందాలి, గాని ఆకాశముక్రింద మనుష్యులలో యివ్వబడిన మరి ఏనామమున రక్షణ పొందలేము. అ:కార్య 4:12 అనెను.

రక్షణ పొందగోరు ప్రతివాడు హృదయ పూర్వకముగా దేవుని వెదకవలెను. "మీరు నన్ను వెదకిన యెడల, పూర్ణ మనస్సుతో నన్నుగూర్చి విచారణ చేయుసెడల మీరు నన్ను కనుగొందురు." యిర్మి 29 : 13 అని ప్రభువు చెప్పుచున్నాడు. దేవుని కొఱకైన ఆశతో, యథార్థమైన ప్రార్థనద్వారా, ఆయన కుమారుడైన యేసు మన హృదయములలో ప్రవేశించి, నిత్య నరకాగ్ని దండన తప్పించి నిత్యజీవము, దేవుని సమాధానము యిచ్చి మనలను రక్షించగలడు.

కనుక ప్రియులారా! సంతోషముతో నేను మీకు చెప్పున దేమనగా: పట్టుదలగల ప్రార్థనతో ప్రభువును వెదకండి; అపుడు ప్రభువు నన్ను ఏశాంతితో, ఏ ఆనందముతో నింపాడో అదే శాంతితో, అదే ఆనందముతో మిమ్మును నింపుతాడు. మానవులందరూ ఈ ఆశీర్వాదములను ఇంతగొప్ప రక్షణను పొందాలనేదే 'అందరికొరకు నేనుచేయు ప్రార్థనయై యున్నది. దేవుడు మిమ్ము నాశీర్వదించుగాక!

మనము చేయుపని ఏదైయున్నప్పటికి ప్రతి ఒక్కరు రక్షణ పొందాలని దేవుడు కోరుచున్నాడు.



జేకబ్ విస్సన్

ఈ పటము బరువులను ఎత్తుటయు, ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు తీసికొని పోవుటయు, అవసరమైనచోట దించుటయు చూపించుచున్నది.



మీ కోరికపై క్రొత్తనిబంధన గ్రంథములను ఉచితముగా పంపగలము. మీ అడ్రస్, పిన్‌కోడ్ నంబరుతో తేటగా పెద్ద అక్షరములతో మాకు వ్రాయండి.

ప్రభువు మిమ్ము దీవించుగాక!

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావల్సింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమేకాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీజగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ
హైదరాబాద్ - 500004

## FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad- 500 482 |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India. | : | Yes |
| If foreigner, state the country of origin | : | — |
| Address | | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad- 500482 |
| 4. Publisher's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India. | : | Yes |
| If foreigner, state the country of origin | : | — |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad- 500482 |
| 5. Editor's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India. | : | Yes |
| If foreigner, state the country of origin | : | — |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad- 500482 |
| 6. Names and address of Individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital. | : | VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad- 500482 |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.
Sd/- RAMOJI RAO
Publisher

Date: March 1, 1987

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 220728. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500482

# పరీక్షల సమయమా? కష్టపడి చదివే సమయం...



పూర్తిగా ఆరోగ్యంగా ఉండాల్సిన సమయం, **కాంప్లాన్** తీసుకోవలసిన సమయం.

**కేవలం కాంప్లాన్® లోనే అతనికి అవసరమయ్యే అధిక పోషణనిచ్చే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.**

పిల్లలూ బాగా ఆరోగ్యంగా ఉండటం అవసరం, అది మరి వాళ్ళు పరీక్షలకి చదువుతూన్నప్పుడు మరీ అవసరం. అందుకే మరి తల్లులకు తెలుసు పరీక్షల సమయం అంటే కాంప్లాన్ తీసుకోవలసిన సమయం అని.

ప్రోటీన్లు, హుటా హుటీగా పెరుగుదలకు తోడుపడే పోషక పదార్థాలు. కాంప్లాన్ వాళ్ళకి సర్వోత్తమమైన ప్రోటీన్లతో బాటే 22 అత్యావశ్యకమైన యితర పోషక పదార్థాలు యిస్తుంది—పెరిగే వయస్సులోని పిల్లలకి యివి అవసరం అవుతాయి.

గుర్తుంచుకోండి. కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సుచేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్, చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమ పువ్వు, స్ట్రాబెరీ సువాసనంలోనూ, ప్లెయిన్ (సాదా)గా కూడానూ దొరుకుతుంది.




**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

B84.GLC.11Tel.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD /402